


# ఆమె చెక్కిన శిల్పం పై సమీక్షలు

సెప్టెంబరు 'చతుర'లో ప్రచురితమైన సింహప్రసాద్ నవల 'ఆమె చెక్కిన శిల్పం' పై మాకు అందిన అసంఖ్యాకమైన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## కనువిప్పు

**(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)**

సింహప్రసాద్‌గారి 'ఆమె చెక్కిన శిల్పం' నవల నేటి సమాజంలోని కొందరి ఆడవాళ్ళ అత్యాశలకు, ఆడంబరాల వ్యామోహాలకు అద్దం పడుతోంది. ఉన్నదానితో సంతృప్తిపడటం మనకి, మనవారికి ఎంత మనశ్శాంతినిస్తుందో అరుణ పాత్ర ద్వారా తెలియజేశారు. నేలవిడిచి సాముచేయడం ఎంత అవివేకమో మనకన్నా ధనికులను చూసి వారిలా బ్రతకడం కోసం వక్కదారులు తొక్కడం ఎంత అనర్థదాయకమో స్వప్న పాత్ర బోధిస్తుంది. అందిన వాటిని చులకనగా చూడటం, అందని వాటికి అర్రులు చాచడం ఈ రోజుల్లో కన్నెపిల్లలకి పరిపాటి అయింది. అరుణ, అలివేణి వంటి వారి బోధనలు వారికి నచ్చవు. రాణి అహంభావంతో తనని ప్రేమించి పెళ్లాడిని భర్తకు అశాంతిని అందించింది. స్వప్న, రాణి పాత్రలు నేటి మహిళలకు కనువిప్పు.

కానీ రచయిత ప్రభాకర్ పాత్రని మరీ పేలవంగా, పిరికివాడిగా, మానసిక స్థైర్యం లేనివాడిగా సృష్టించారు. భార్య మీదగల ప్రే





మతో గుడ్డిగా ఆమె చెప్పినట్లు నడవనక్కరలేదు. ఆమె కోర్కెలు సమంజసమైనవి కావనీ తమ జీవితాలను పక్కదోవలు పట్టిస్తాయనీ ఆమెకు నచ్చజెప్పి తన మార్గంలోకి ఆమెని నడిపించవచ్చు. లోలోపల అతనికి కూడా ధన వ్యామోహం ఉంది కాబోలు అనిపించేలా ప్రవర్తించాడు. చివరలో పశ్చాత్తాపంతో శిక్షకి తల వంచడం కొంత నయం. శ్రీరామ్ భార్యను అదుపులో ఉంచుకోలేక సంసారాన్ని నరకం చేసుకొన్నాడు. భార్య తనకు అనుగుణంగా లేనంత మాత్రాన తను తప్పుదారిన పడటం ఏమంత శ్రేయస్కరం? భార్యని మందలించి మంచి దారిలో పెట్టడం అతని విధి. అదిచేతకాక సోఫియా వలలో పడటం అతని బలహీనత.

అరుణ పాత్ర సూదంటురాయిలా ఆకర్షిస్తుంది. బలమైన ఆమె వ్యక్తిత్వం, ఆత్మవిశ్వాసం, నమ్మిన మార్గంలో సాగగల గుండె బలం ప్రశంసనీయం. నేర్పుతో, ఓర్పుతో స్వామిలాంటి 'బ్రాకెట్' పిచ్చివాడిని ఉన్నతంగా తీర్చిదిద్దిన అరుణపాత్ర అందరికీ ఆదర్శప్రాయం.

— తనికెళ్ళ మంజుల
పార్వతీపురం

## ఆమె చెక్కిన శిల్పమే!

**(ద్వితీయ బహుమతి రు.75/-పొందిన సమీక్ష)**

**సింహ**ప్రసాద్‌గారి 'ఆమె చెక్కిన శిల్పం' పాఠకులను నిరాశపరిచిందనే చెప్పాలి. మంచి రచయితగా సింహప్రసాద్‌గారు చిరపరిచితులు. అటువంటి రచయిత నుండి కొత్తదనంగానీ, నిండుదనంగానీ లేని ఇటువంటి నవల వస్తుందని పాఠకులు ఊహించలేరు.

కోరికలు, ఊహలు అందరికీ ఉంటాయి. అవి మధ్యతరగతి జీవితాల్లో మరింత ఎక్కువ. కోరికలు ఉండటం తప్పుకాదు. కానీ వాటిని తీర్చుకోవడానికి అడ్డదారులు పట్టడమే తప్పని నిరూపించారు రచయిత.

స్వప్న పాత్రతో ప్రారంభమయిన ఈ నవల చాలాభాగం ఆమె కథానాయిక అన్నట్టుగా సాగింది. స్వప్న పాత్రలో అనేక రంగుల కలలు ప్రవేశపెట్టి తప్పుదారి పట్టించే ప్రయత్నం చేశారు. ప్రభాకర్‌ను ఒక మంచి వ్యక్తిగా చూపాలని చేసిన ప్రయత్నం కూడా ఎక్కువసేపు సాగలేదు. అతడు అవినీతిపరుడుగా మారడానికి స్వప్నే కారణమని రచయిత చెప్పడానికి ప్రయత్నించినా అది సరికాదు అన్నది నిజం. ప్రభాకర్ మొదటిసారి లంచం తీసుకొనేవరకూ ఆమె అలాంటి పనులకు ప్రోత్సహించినట్లు ఎక్కడా చెప్పలేదు.

గర్వం, అహంకారం అనేవి ధనం ఉన్నచోటనే ఉంటాయి. అది వ్యక్తుల తప్పుకాదు. వారి వర్గానిది. నవలలో రచయిత సినిమా ధోరణి కనబరిచారు. ముఖ్యంగా అరుణ తల్లి మరణ సమయంలో కూతురికి తండ్రి ఫొటో ఇచ్చి ఎప్పటికయినా కలుసుకుంటారని చెప్పడం, తండ్రిని మంచివాడిగా వర్ణించడం.... కట్టుకున్న భార్యనీ, కన్న బిడ్డనీ వదిలేసి వెళ్ళినవాడు రచయిత దృష్టిలో మంచివాడు ఎలా అయ్యాడో పాఠకులకు అర్థంకాని విషయం.

ఈ నవల మొత్తంలో గుర్తుండిపోయే ఒకే ఒక మంచిపాత్ర అరుణ. తనేమిటో, తనస్థాయి ఏమిటో తెలిసిన వ్యక్తి ఆమె. ఎదుటివ్యక్తిలో మంచి మార్పుని కోరే మనసు, భర్త మంచి చెడ్డలు చూడగల నేర్పు ఆమె ఆభరణాలు. స్వామి నిజంగా ఆమె చెక్కిన శిల్పమే.

—కాళహస్తి నాగేశ్వరరావు
కోరాపుట్

## అర్థాంగే ఆధారం

**(తృతీయ బహుమతి రు.50/-పొందిన సమీక్ష)**

**సింహ**ప్రసాద్‌గారి రచన 'ఆమె చెక్కిన శిల్పం' వాస్తవాన్ని ప్రతిబింబింపజేసింది. విభిన్నమనస్తత్వాలున్న ముగ్గురు అమ్మాయిలు తమ భర్తల అభివృద్ధికి, అధోగతికి ఎలా

ముఖచిత్రం: లక్ష్మణ్

దోహదపడ్డారో వివరించిన తీరు రెండు కోణాల నుండి సమీక్షిస్తే ఒక కోణం నుండి వాస్తవానికి దగ్గరగానూ, మరొక కోణం నుండి వాస్తవానికి దూరంగానూ ఉంది.

స్వప్న పేరుకు తగ్గట్టుగానే స్వప్నలోకంలో విహరిస్తూ తన ఆడంబరాల కోసం భర్తను సాధించి, చివరికి జైలుపాలు చేసింది. భార్యను సంతృప్తిపరచడం భర్త కర్తవ్యమే అయినా, ఆమెకోరిన ప్రతీ గొంతెమ్మ కోరికనూ తీర్చడం కోసం భర్త అధోగతిపాలు కానవసరంలేదు. తన విచక్షణా జ్ఞానంతో భార్యకు నచ్చజెప్పి తన అభిరుచులకు అనుగుణంగా మలుచుకోవచ్చు.

సిరిసంపదలతో మకుటంలేని మహారాణిలా ప్రవర్తించే రాణి గొప్పకోసం మహిళా సమాజాలకు విరివిగా విరాళాలిస్తూ, ఉపన్యాసాలిస్తూ, భర్తను, కన్నబిడ్డను నిర్లక్ష్యం చేసింది. దానితో శ్రీరామ్ హృదయం గాయపడి ఆ గాయం మానటం కోసం మరోస్త్రీని ఆశ్రయించినట్టు చూపించడం కన్నా రాణికి ఆమె అభిమానించే మహిళా సంఘాల ద్వారానే కనువిప్పు కలిగేలా చేస్తే బాగుండేది.

భర్తను ఆరాధ్యదైవంగా భావించే అరుణ పాత్ర అభినందనీయం. ఈ రోజుల్లో అటువంటి అరుణలు అరుదుగానే ఉన్నారనిపిస్తుంది. తనభర్త స్వామిని బ్రాకెట్ల నుండి ఐ.పి.ఎస్ వరకు తెచ్చిన తీరు 'కృషితో నాస్తి దుర్భిక్షం' అన్న సూక్తిని గుర్తుకు తెస్తుంది. అరుణ ఉద్యోగం చేస్తూ స్వామిని కాలేజిలో చదివించడం కన్నా ఇద్దరూ ఏవోచిన్నఉద్యోగాలు చేసుకుంటూ సార్వత్రిక విశ్వవిద్యాలయం ద్వారానో, కరస్పాండెన్స్ కోర్సుద్వారానో డిగ్రీ సంపాదించి ఐ.పి.ఎస్‌కు ఎంపికైనట్టు కథను మలిచితే బాగుండేది. మగవాని జీవితం పూలబాట కావాలన్నా ముళ్లబాట కావాలన్నా అర్థాంగి పైనే ఆధారపడి వుంటుందన్న నగ్నసత్యాన్ని చాటిచెప్పిన ఈ నవలా రచయిత సింహప్రసాద్‌గారు అభినందనీయులు.

— ఎమ్.డి. రంజాన్ అలీ
అక్కయ్యపాలెం

## లక్ష్యం ఏమిటి?

*(రు.25/- బహుమతి పొందిన సమీక్ష)*

శివుడు స్థాణువనీ, పార్వతి శక్తి అనీ స్థాణువులో శక్తి ప్రవేశించినప్పుడే అదిచైతన్యవంతమౌతుందనీ ఆర్యోక్తి. ప్రపంచ ప్రసిద్ధి పొందిన ప్రతి పురుషుని వెనుక ఒక స్త్రీ హస్తం ఉండి తీరుతుందన్నది అందరికీ తెలిసిన సంగతే. అయితే ఈ నవలలో రచయిత పురుషుణ్ణి పూర్తిగా అచేతనావస్థలో పడవేసి, అస్తిత్వమే లేకుండా చేశారు. అదేనిజమయితే స్త్రీలకు ఈనాడు తమ హక్కులకోసం పోరాడవలసిన పరిస్థితి ఎందుకేర్పడుతుంది? ఆవిధంగా చూస్తే ఈ నవల వాస్తవానికి దూరంగా ఉన్నట్టు అనిపిస్తుంది. పోనీ ఒక విధమైన నైరాశ్యంలో కొట్టుకుపోతున్న స్త్రీజాతికి మేలుకొలుపు అందామనుకున్నా స్త్రీని కూడా మరొకరకంగా అస్తిత్వరాహిత్యంలో పడేశారు. రాణి, స్వప్న అరుణ - ఈ ముగ్గురి తత్వాలూ కేవలం ముగ్గురు స్త్రీలవి కావు; మూడు తరగతులవి. సమాజంలో పైతరగతికి, మధ్యతరగతికి, క్రింది తరగతికి వరసగా ఈ ముగ్గురి లక్షణాలు దర్పణం పడతాయి. ఆ పేర్లు పెట్టడంలో కూడా రచయిత వారి మనస్తత్వాన్ని ప్రతిబింబించారు.

ఇదంతా చూస్తుంటే రచయిత లక్ష్యం ఏమిటో సరిగా అర్థంకావటంలేదు.

— డా. చింతలపూడి వెంకటేశ్వర్లు
సత్యనారాయణపురం

## సందేశాత్మకం

*(రు.25/-బహుమతి పొందిన సమీక్ష)*

విభిన్న మనస్తత్వాలుగల ముగ్గురు అమ్మాయిల ఆకాంక్షలూ, అవి నెరవేర్చుకొనే తీరు, వాటి పర్యవసానం, హృద్యంగా వివరించి చూపిన నవల 'ఆమె చెక్కిన శిల్పం'. మూడు జంటల జీవన విధానాల్ని పక్కపక్కనే విశ్లేషించి చూపడం వల్ల పాఠకుడికి ఏది ఉత్తమ




జీవన విధానమో సులువుగా అర్థం చేసుకోవడా నికి వీలుగా ఉంది.

ఇందులో చెప్పుకోవాల్సిన అంశం రచయిత పాత్రలను మలచిన తీరు. ముఖ్యంగా అరుణ పాత్ర 'ఆదర్శమహిళ'కు ప్రతీకగా ఉంది. ఆమె నడవడిక, ఆలోచనావిధానం, వాస్తవిక దృక్పథం, పట్టుదలా ఎవరినైనా ఇట్టే ఆకట్టు కుంటాయి. వాస్తవిక పరిస్థితుల్ని విస్మరించి కలల్లో తేలిపోయే నేటి యువతకు ఆమె జీవనవిధానం కనువిప్పు కలిగిస్తుంది. ఒక ఇంటిని స్వర్గధామం చేసుకోవడం, లేదా నరక కూపంగా మార్చుకోవడం ఆ ఇంటి ఇల్లాలి మీదనే ఆధారపడి వుందని ఇందులోని స్త్రీపా త్రలు నిరూపిస్తాయి.

అందం, తెలివితేటలు అనేవి మనిషి ఉన్నత స్థాయికి చేరుకోవడానికి ఉపయోగపడా లికానీ పతనానికి కాదు. గొప్పగా బ్రతకాలనుకో వడంలో తప్పులేదుకానీ ఇతరుల్ని చూసి అసూయపడటం ఆరోగ్యానికి మంచిదికాదు. వివేకం కోల్పోయి, అత్యాశకు లోనై భర్తని పెడమార్గం పట్టించి సంసారాన్ని పతనం చే సుకుంటుంది స్వప్న.

అన్నీ ఉన్నా తన అహంభావంతో విచ్చల విడిగా ప్రవర్తించి సంసారంలో సుఖశాంతులు లేకుండా చేసుకుంటుంది రాణి. స్వప్న మధ్య తరగతి మనస్తత్వానికి ప్రతిబింబంకాగా, ధనిక వర్గ స్త్రీల మనస్తత్వానికి రాణి ప్రతినిధిగా నిలుస్తుంది.

రచయిత పురుషుల బలహీనతల్ని వాస్తవి కంగా చిత్రిస్తూనే, వారిని స్త్రీలు ఏవిధంగా మార్చవచ్చో వివరించి యువతకు చక్కని సందేశాన్ని ఇచ్చారు.

— సూర్యదేవర జోగేశ్వర రావు
విజయవాడ

# శిల్పం అమోఘం

***(రు.25/- బహుమతి పొందిన సమీక్ష)***

ప్రతి మగవాడి విజయం వెనుక ఓ స్త్రీ ఉన్నట్టే, పరాజయం వెనుక కూడా ఉంటుంది. రచయిత ఈ విషయాన్ని తీసుకొని నేటి యువతుల, ముఖ్యంగా మధ్యతరగతి యువ తుల ఆలోచనలకు సజీవరూపకల్పన చేశారు. తీసుకున్న విషయం వాస్తవానికి దగ్గరగా, విశ్లే షణాత్మకంగా ఉండటం వల్లనేమో నవలలోని ప్రతిపాత్ర నిత్యం మనకు తారసపడే బంధువు లనో, స్నేహితులనో గుర్తొచ్చేలా చేస్తాయి. ము ఖ్యంగా స్వప్న పాత్ర చిత్రీకరణలో సింహప్ర సాద్ చక్కటి ప్రతిభ కనపరిచారు. సగటు మధ్యతరగతి యువతిలో నెలకొనే ఊహాప్రవృ త్తి, వాస్తవ దూరమైన ఆలోచనలు, వాటిని యథాశక్తి పెంచి పోషించే నవలలు, సినిమా లు-నిజజీవితంలోని కఠినమైన వాస్తవాలు, వాటిని ఎదుర్కోలేని సంఘర్షణను స్వప్నలో చూపించారు.

డబ్బుతో ఏమయినా చేయవచ్చుననుకొని, అదిచేయలేనివి కొన్ని ఉంటాయని తెలిసేసరి కీ ఆ కొన్నిటిని కోల్పోయింది రాణి. ఆదర్శంగా తార్కిక దృష్టితో, జీవితాన్ని అద్భుతంగా మలు చుకుంది అరుణ... ఇలా విభిన్నమైన మనస్త త్వాల నేపథ్యంలో జీవితంలో వాస్తవిక దృక్పథా నికున్న విలువను తెలియజేసిందీనవల.

భార్యమీద ఉన్న ప్రేమకూ, ఆమె కోర్కెలతో సహకరించని ఆదాయానికీ మధ్యనలిగిపోతూ అవినీతిపరులై, అన్యాయమైపోయే ప్రభాకర్ లు ఎందరో... అదుపు లేని కోరికలు అనర్థదా యకాలన్న నగ్నసత్యాన్ని నిరూపించడంలో రచయిత కృతకృత్యులయ్యారు. జూదమే వేద మనుకొనే స్థాయినుండి పోలీస్ ఆఫీసర్గా ఎదిగిన స్వామిలో ఆత్మవిశ్వాసాన్ని అణువణు వునా నింపిన అరుణ పాత్ర చిత్రణ అద్భు తంగా ఉంది. అరుణలోని సూటిదనం, తెలివి తేటలు, ఆదర్శవాదం ప్రతిమహిళా అలవ ర్చుకోవాలి. రాణి భర్త శ్రీరామ్లాంటి వాళ్లకు దేశంలో కొదువలేదు. అత్యాశ, అహంకారం, ఆదర్శాల నేపథ్యంలో సూటిగా సాగిపోతుందీన వల. ఊహాజగత్తులో తేలిపోయే పాఠకులను నేలమీదికి రప్పించి సాంఘిక ప్రయోజనాన్ని సాధించిన నవలా రచయిత సింహప్రసాద్గా రికి ధన్యవాదాలు.

— వి.ఎస్.వి.వి. రాఘవరావు
ఏలూరు



# చతుర

సంపుటి: 12 నవంబర్ 1989 సంచిక: 10




తన చుట్టూరా ఉన్న చీకట్లని తిట్టుకుంటూ, బాధపడుతూ గడిపే కంటే ఒక్క చిరుదివ్వెనైనా వెలిగించి కాంతిరేఖల్ని పంచటం మనిషి బాధ్యత. సమాజాన్ని పట్టిపీడిస్తూ మానవతకు చిరునామాలే కుండా చేస్తున్న దుర్మార్గుల ఆట కట్టించటం అంతసులభం కాకపోయినా అందుకు ప్రయత్నించటం మనిషి కర్తవ్యం...

.... అనుకున్న మంచిమనిషి "మాష్టారు." అమాయకుల ఆక్రందనలకు ద్రవించి రౌడీలనూ, స్వార్థపరులనూ వారి దుర్మార్గాల్నీ ఎదుర్కొనడానికి ఒంటరిగానే సిద్ధమయ్యారు. మానవత్వానికీ, పైశాచికతత్వానికీ మధ్య జరిగిన ఆ సంకులసమరంలో ఆయనకి అండగా ఎందరు నిలబడ్డారు?

తమకెలాంటి అన్యాయం జరుగుతున్నదో కూడా తెలుసుకోలేని సామాన్యులను ఆర్తితో, ఆవేదనలతో గుండెలకు హత్తుకుని అన్యాయాల్ని ఎదిరించటం నేర్పించబోయిన మాష్టారు అందులో సఫలీకృతులయ్యారా?

ఈ ప్రయత్నంలో వారు ఎదుర్కొన్న భయంకర సంఘటనలెలాంటివి? మానవ ప్రయత్నంతో కొందరు దోషుల్లోనైనా పరివర్తన, పశ్చాత్తాపం కలిగేలా చేయగలమా? 'అన్యాయం' చెరలువిడిపించి 'న్యాయం'వైపుకు నడిపించగలమా? అనే ప్రశ్నలకు సమాధానంగా నేటి సమాజానికీ, వ్యక్తులకూ, సన్నివేశాలకూ సజీవ రూపకల్పనచేసి ఆలోచింపచేసే **వాసమూర్తి** రచన **అన్యాయం** ఈ నెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్రనవల.

ఈవేళ నేను నాజీవితంలో ఒక చాలా పెద్దని ర్ణయం తీసుకున్నాను. మనం తీసుకునేవి కొన్ని చాలా పెద్దనిర్ణయాలే అవుతాయి సాధారణంగా. ఉదాహరణకి జీవితభాగస్వామి ని ఎంచుకోవడం చాలా పెద్దనిర్ణయమే. ఎందుకంటే పెళ్లంటే నూరేళ్లపంటఅన్న నాను డి ఉండనే ఉంది. తొందరపడి తప్పుడు నిర్ణయంచేస్తే జీవితాంతం పశ్చాత్తాపపడుతూ ఉండవలసివస్తుంది.

అంతేకాదు మన నిర్ణయం ఫలితాలు మన కికలిగే సంతానంపైన కూడా ఉంటాయి. అలా గే చదువుల్లో మనం ఎంచుకునే విషయం, మనం సంపాదించుకునే ఉద్యోగం ఇవన్నీ కూడా మొత్తం జీవితంపై ప్రభావం చూపేనిర్ణ యాలు అనవచ్చు.

కానీ నేనీవేళ తీసుకున్నది పైవాటికన్న భిన్నమైనది. తీవ్రమైన అపాయంతో కూడుకున్నది. పెద్దపులితో తలపడాలనుకు న్నాను- మామూలు పులికాదు, నరమాంసం రుచిమరిగి, తనస్వైరవిహారంతో భయోత్పాతా లు సృష్టిస్తున్నదది.

క్షమించండి... పులిఅంటే నిజంపులి అను కునేరు. అలా అలంకారప్రాయంగా మాత్రమే చెప్పాను. నేను ఎదుర్కోదలచుకున్నది నిజంపులికన్న ఎన్నోరెట్లు క్రూరమైనదీ, నిర్దాక్షి ణ్యమైనదీను. ఒకపులిని ఏ వేటగాడో పూర్తిగా చంప(లే)క, తీవ్రంగా మాత్రం గాయపరచివె ళ్లిపోతే అది బాధపడి, మెల్లగా కోలుకొని, తన మామూలు ఆహారాన్ని వేటాడి సంపాదించు కునే సామర్థ్యంలేక, ఆకలి బాధ భరించలేక, సులభంగా దొరికే మనుషులమీదపడి చంపి తినడం మొదలుపెడుతుంది. నరభక్షకుల్లో అధికాంశం అలాతయారైనవే అంటారు. కాని నేను ఎదుర్కోబోయే పెద్దపులి మరోదారిలేక ఈ జీవితానికి పూనుకున్నదికాదు. ఉట్టిపుణ్యాన, కేవలం వినోదంకోసం అమాయకులూ, అసహా యులమీద దాడిచేసి హింసించే పెద్దపులి.

అందుకే 'క్రూరమైన, నిర్దాక్షిణ్యమైన' అన్న పదాలు వాడాను.

నిజానికి జంతువులవిషయంలో 'క్రూర మైన, నిర్దాక్షిణ్యమైన' అన్నపదాలు వాడకూడ దు. అవి ఎప్పుడూ తమకి సహజసిద్ధమైన రీతిలోనే వ్యవహరిస్తాయి. వాటి 'క్రూరత్వం' మనదృష్టితో మనం ఆపాదించినదే. 'క్రూర మైన, నిర్దాక్షిణ్యమైన' అన్నపదాలు నిజంగా తగినవి మానవులకే. ఏ నరభక్షకీ నరరూపనర భక్షకులకు సాటిరాదు. ఇక్కడ ఒక నరభక్షకికా దు- నాలుగునరభక్షకులు- అంటే నాలుగు నరరూపనరభక్షకులన్నమాట.

నిర్బలుడనైన నేను ఆనాలుగు భయంకర జీవులనెదుర్కోవడానికి నిర్ణయం తీసుకున్నా ను.

ఉపమానాలూ, రూపకాలూవంటి అలంకా రాలు కట్టిపెట్టి ఉన్నదున్నట్లు చెప్పుతాను. మాపేటలో భయోత్పాతాలు చెలరేగుతు న్నాయి. దీనికికారణం నలుగురు రౌడీయువ కులు. వాళ్ల ఆగడాలగురించే చెప్పుకుంటూ మాపేటవాళ్లు గడగడలాడిపోతున్నారు. ఆ రౌ డీలు మాపేటవాళ్లుకాదు. కాని వారు కాసేది మాపేటకు ముఖ్యమైనదారినే. మాపేటవాసుల్లో అధికాంశం ఆ మార్గంగుండానే ఆఫీసులకీ, పనిచోట్లకీ, కళాశాలలకీ, ప్రధానమైన మార్కెట్ల కీపోయేది. అటువంటిదారిలో కీలకమైన కూడ లిలో నిలబడి వచ్చిపోయేఆడవాళ్లని ఆటప ట్టించడం ఆరౌడీకుర్రాళ్ల నిత్యకృత్యంగా ఉంటోంది. కాస్తకంటికి సదురుగా కనిపించే స్త్రీ అయితేచాలు- ఆమె యువతైనా, మధ్యవయ స్కురాలైనాసరే- ఆమెపై వ్యాఖ్యలువిసరడం, జోకులు పేల్చడం, బిగ్గరగా నవ్వడం వాళ్లకి సరదా. ఇద్దరు ముగ్గురు ఆడవాళ్లు ఉంటే, వాళ్లమగాళ్లుకూడా దగ్గరఉంటే అంతటితో ఊరుకుంటారు. ఒంటరిఆడది కనిపిస్తేమా త్రం ఇక వాళ్లనిపట్టడం ఎవరిశక్యంకాదు. ఈలలువేస్తూ, పాటలూ పాడుతూ, వచ్చిబూతు వ్యాఖ్యలుచేస్తూ, కోరికలు స్పష్టంగా వ్యక్తబరు స్తూ వెంటబడతారు. మసకచీకటిగా ఉంటే జడపట్టుకుంటారు. కొంగుపట్టిలాగుతారు ఒంటిమీద చేతులువేస్తారు. గిచ్చుతారు. చూ డనట్లు ఢీకొని, పడబోకుండా తప్పించేందుక న్నట్లుగా గట్టిగా వాటేసుకుంటారు. వాళ్లుక్ర మంగా ఆ కూడలినుంచి కదిలి, ఇప్పుడిప్పు డు మాపేటలోకే రాకలు సాగించారు. సాధార ణంగా వీధిమొగం అంతగాచూడని ఆడవాళ్లు కూడా ఇప్పుడు వాళ్లదృష్టిలోకివచ్చారు. గు మ్మంముందునుంచి రెండుమూడుసార్లు





అటూఇటూ తిరగడం, సన్నగా ఈలవేయడం, తేరిపారచూడటం, చటుక్కున కన్నుకొట్టడం వాళ్ల మృగయావినోదంలో భాగాలే.

ఈ రౌడీకుర్రాళ్లు మామూలు రౌడీలుకాదు ఏ పోలీసులకో ఫిర్యాదుచేయడానికి. వాళ్లకివయస్సుఇచ్చే బలవుపొంగూ, నిర్లక్ష్యమూ, దౌర్జన్య ప్రయత్నాలకు తోడు డబ్బు, హోదా, పలుకుబడీ ఉన్నవాళ్లు. పోలీసులే తరచు వాళ్లతండ్రుల దర్శనంచేసుకొని సలాంకొట్టివస్తూ ఉంటారు. వెనక ఒక కేంద్రప్రభుత్వోద్యోగి కూతురు- బాగా చదువుకున్నదీ, బొంబాయి, కలకత్తా, ఢిల్లీ వంటినగరాల జీవితం ఎరుగున్నదీ- సినిమాలూ, టీవీచిత్రాలు చూసిన ప్రభావంవల్ల కాబోలు, ఈ రౌడీల్లో ఒకడు ఆమెతో అతిచనువుచేయబోతే ఛెళ్లున చెంపపేల్చింది. చెప్పుచేతుల్లోకి తీసుకుంది. దానితోచాలా పెద్ద రభస అయింది. ఆ పిల్లతండ్రి తనకున్న అధికారమూ, పలుకుబడీ అంతా ఉపయోగించి ఆ కుర్రవాడిని శిక్షింపజేయడానికి సకల ప్రయత్నం చేశాడు. చివరికి ఏమీచేయలేక తనే మరోఊరు బదిలీచేయించుకొని వెళ్లిపోయాడు.

సాధారణంగా మాపేటవాళ్లు ఎవరిజోలీ వెళ్లకుండా తమతమ చిన్న ప్రపంచాల్లోనే ఉంటూ కాలంవెళ్లబుచ్చేస్తూ ఉంటారు. ఏదైనా ప్రమాదసూచన కలిగితే దానికి దూరంగా పారిపోవడమే వాళ్లుచేసేది. ఎవడైనా దర్పం ప్రదర్శిస్తే వాడిముందొకసారి సాష్టాంగ పడిపోతారు. అటువంటిది తామెంత ఒదిగి ఉంటే అంతగా మీదికివస్తున్న ఈ రౌడీలవిషయంలో ఏమిచేయాలో వారికి బోధపడలేదు. అప్పుడప్పుడు చిన్నచిన్న గుంపులుగా గుమిగూడి తమభయాలూ, కష్టాలూ చెప్పుకుంటారు. చిత్రమేమిటంటే నలుగురూ కలిసినప్పుడు వచ్చేబలమూ, ధైర్యమూ రాకపోగా వ్యక్తిగత భయాందోళనలు మరిన్ని రెట్లయి, వచ్చినప్పటికన్న ఎక్కువ నిస్తేజులై, నీరసించిపోయి ఇళ్లకుమరలుతారు. పిల్లిమెడలో గంటకట్టవలసిందేనని అందరూ అంగీకరిస్తారు. కాని ఎవరు కట్టాలి అన్నదే వాళ్ళకి కొరుకుడుబడని సమస్య.

ఇటువంటిపరిస్థితిలో 'నేనున్నా'నంటూ ముందుకు వచ్చాన్నేను. శారీరకంగా నేను ఒక బక్కప్రాణిని. కసరత్తూ, కుస్తీలవంటివి ఎన్నడూ ఎరగను. చిన్నప్పుడెప్పుడో ఆటలాడేనేమో కాని చాలాకాలంనుంచి అవీలేవు. గట్టిగా ఎవరిమీదా దెబ్బలువేయలేదు, దెబ్బలు తిననూలేదు. ఇక డబ్బూ పలుకుబడీ నాకెంత ఉంటాయో నేనొకస్థానిక ఉన్నత పాఠశాలలో సోషల్‌స్టడీస్ బి.ఇడి ఉపాధ్యాయుడినని చెపితే తెలిసిపోతుంది. నాదగ్గర ట్యూషన్లు చెప్పించుకునేవారు ఎవరూ లేరు. నాకు కూడా స్వభావరీత్యా ట్యూషన్లు చెప్పడం అంత ఇష్టంలేదు. అందువల్ల అదనపు రాబడి అంటూ ఏమీలేదు. మానాన్నగారు మాపల్లెటూరిలో ఒకఎకరం భూమి సొంతసేద్యంచేసుకుంటూ, పౌరోహిత్యాలు చేస్తూ కాలక్షేపం చేస్తూ ఉంటారు. నన్ను ఎలాగో బి.ఎ.బి.ఇడి చేయించి, మాచెల్లెలి పెళ్లిచేశారు. ఇంకా మా తమ్ముడిని చదివించవలసి ఉండటంతో వేన్నీళ్లకు చన్నీళ్లుతోడన్నట్టు మానాన్నగారికి నెలనెలా కొంచెంపంపిస్తూ ఉంటాను. పోనీ అటు అత్తవారినుంచి కట్నకానుకలు ఘనంగా ముట్టాయా అంటే అదీలేదు. కట్నం తీసుకోలేదు- అని గొప్పచెప్పుకోవడంకాదుకాని మేనరికంకాబట్టి అసలు ఆ ప్రసక్తేలేకపోయింది. మామేనమామ ఏవో కొద్దిపాటి లాంఛనాలతో పెళ్లిమాత్రం ఏతగాదాలూ రాకుండా ఉభయులకీ ముచ్చటగానేచేశాడు. అందువల్ల గృహలక్ష్మితప్ప వేరేలక్ష్మి నాదగ్గరకు చేరదు.

పలుకుబడిగల బడివంతుల్లు లేకపోలేదన్నది నిజమే. కాని నాకనుచూపుమేరలో నాకు తెలుసు అనిచెప్పుకోదగ్గ రాజకీయనాయకులెవరూ లేరు. ఆఖరికి మావార్డు మున్సిపల్ కౌన్సిలర్‌ని కూడా ఎరగను. ట్యూషన్లులేవని ముందేచెప్పానుకదా. అందువల్ల అవిధంగా సన్నిహితమయ్యే కొద్దిమంది విద్యార్థులు కూడా నాకు లేరు. పాఠశాలలో పాఠాలు చెప్పేటప్పుడు పరిచయమేతప్ప వేరేగా ఎవరితోనూ అటువంటిదిలేదు. నేను పాఠాలు బాగానే చెబుతానని ఒకపేరుఉంది, కాని అవసరంవస్తే 'అయ్యో, మనమాష్టారు' అని ఎందరు ముందుకు దూకుతారో చెప్పలేను. ఇంతవరకూ అటువంటి పరీక్షరాలేదు. పరీక్షవచ్చి నిజంతేలితేనేకదా వివరంగా చెప్పగలిగేది.



తోటి ఉపాధ్యాయులలోనైనా మిత్రులదాకా ఎందుకు, సన్నిహితులుకూడా ఉన్నారని చెప్ప లేను. అటు పుట్టింటినుంచికానీ, ఇటు అత్తింటినుంచికానీ వచ్చిన ఆస్తిపాస్తులేమీ లేక, ట్యూషన్లులేక ఉండటంతో వాళ్లవరికీ నాపట్ల పెద్దగౌరవభావంలేదు. ముఖ్యంగా ట్యూషన్లు చెప్పకపోవడం వారిదృష్టిలో పెద్ద అనర్థత. ప్రయత్నిస్తే ఏవో కొన్నైనా ట్యూషన్లు దొరకకపోతాయా అంటారువాళ్లు. వారికి ఎప్పు డైనా శ్రోతగా పనికివస్తాను తప్ప ఇతరత్రా నావల్లవారికి ఒనకూడేప్రయోజనం ఏమీలేదు. పైగా వారు ఏమీచెపితే అది ఊఁ కొడుతూవిని అవిధంగా వారిభావాలకు ఆవేశాలకూ నిర్గమ నమార్గంగా ఉపయోగిస్తానా అంటే అదీ లేదు. నేను సాధారణంగా తీరికవేళల్లో వాళ్లకబుర్లలో, వాదాల్లో అంతగా పాల్గొకుండా, గ్రంథపఠనంలో ఎక్కువ లీనమైఉంటాను. ఈ కళాసాహిత్యాది విషయాల్లో మామూలుకన్నా ఎక్కువ ఆసక్తి చూపుతానని కూడా వాళ్లకి నామీదమంట. మొత్తంమీద- నాదేతప్పుకావచ్చు- తోటిఉపా ధ్యాయులలో స్నేహితులెవరినీ సంపాదించలే కపోయాను. ఇక మా ఇరుగుపొరుగుల్లో అయితే పొద్దున్న లేచింది మొదలు రాత్రిపొ ద్దుపోయేవరకూ సంసారనౌకని నెట్టుకురావ డంలోనే సతమతమయ్యేవారికి సరససల్లాపా లకు సమయమెక్కడ? ఈవిధంగా నాకు శరీర బలమూలేదు, అర్థబలమూలేదు, అంగబల మూలేదు- అటువంటివాడిని అన్నీఉన్న నలు గురు నరరూపరాక్షసులనెదుర్కోవడానికి పూనుకోవడం ఆశ్చర్యంగానే ఉంటుంది.

పిల్లిని గదిలో బంధించి కొట్టబోతే అది మీదపడి గుడ్లు పీకేస్తుందంటారు. ఇంగ్లీషులో కూడా 'ఈవెన్ ద వర్మ్ టర్న్‌జ్' అన్న నానుడి ఉంది. అంటే చివరికి పురుగైనా తిరగబడుతుందని. అలా చివరికి ఏ దారీ లేక తెగింపుకు వచ్చి నేను తిరగబడి ఉంటే అది సరికాదు. నిజానికి ఈ రౌడీకుర్రాళ్లతో నాకు ప్రత్యక్ష సంబంధం లేదు. వాళ్లవలన నాకు స్వయంగా కలిగిన బాధ, దుఃఖమూ ఏమీ లేవు. నేను నల్లగానే ఉంటాను. నా భార్యా నల్లగానే ఉంటుంది. అయినా "తావలచినది రంభ" అన్నట్లు నాకు నచ్చే మా మేనమామ కూతురిని చేసుకున్నాను. ఎరుపు ఏడుందాలు తెస్తే నలుపునాలుగందాలు దాస్తుందంటారు. ఆ నలుపే మాపట్ల వరమైందన్నమాట. మా శ్రీమతి కృష్ణవేణి నాకు ప్రేయసి అయినా ఈ రౌడీ కుర్రాళ్ల దృష్టిలోకి రాలేదనుకుంటాను. కాబట్టి నన్ను నేను వారి ఆగడాలవల్ల బాధితు ణ్ణని చెప్పుకోలేను.

అయినా ఈ నిర్ణయం తీసుకున్నానంటే దానికి కారణముంది.

★ ★ ★

ఇంతకుముందు నేనే ఈ కుర్రరౌడీల దుశ్చ ర్యలూ, వాటికి ఈ పేటవాసుల భయాందోళన లూ గురించి వింటున్నా అంతగా పట్టించుకో లేదు. వాటిని వార్తలుగా కేవలం చోద్యంగా తీసుకునేవాణ్ణి. మనం రోజూ ఎన్ని ఘోరప్ర మాదాలూ, హత్యలూ, దారుణాలూ, ప్రకృతివైప రీత్యాలూ గురించి చదవడంలేదు? అక్కడ ముప్పై మందిని కాల్చిపారేశారన్నా, ఇక్కడ మూడువేలమంది సజీవ సమాధి అయ్యార న్నా కాసేపు ఆసక్తితో చదువుతాం, తరువాత వార్తకి కదిలిపోతాం. కాని ఒకసారి కళ్లారా ఒక సంఘటన చూస్తే చలించిపోతాం. అది మన సు ముందు చాలాకాలం ఉంటుంది కూడా. అటువంటిదే జరిగింది- నా విషయంలో కూడా.

నాకు తెలిసిన ఒక అమ్మాయి ఉంది. నేనీ ఊరు వచ్చిన కొత్తలో నా తరగతిలో ఉండేది. తరువాత పదో తరగతి పాసై, కాలేజీలో చే రింది. ఇప్పుడు బి.ఎ. చదువుతోంది. నా తరగతిలో ఉండగా తరుచు నా దగ్గరికి వచ్చేది. ఆ విధంగా నాకు కొద్దిగా సన్నిహితు లైన శిష్యులలో అలాంటివారిని ఒంటిచేతి వేళ్లమీద లెక్కపెట్టవచ్చు- ఒకతె అయింది. ఆమె పేరు నాకు గుర్తుండిపోయింది శ్యామల. తరగతిలో నేనెప్పుడైనా ప్రశ్నలు వేస్తే తనే ముందు జవాబిచ్చేది. తనకి సందేహాలు కలి గినా వివరణలు కావలసి వచ్చినా సంకోచం లేకుండా అడిగేది. నా పాఠంలో అంత శ్రద్ధ కనబరచడం నాకు ఆనందదాయకంగా ఉంటుందని వేరే చెప్పనక్కరలేదుకదా. ఎదు రుపడి నమస్కరించినా, తరగతిలో ప్రశ్నలు వేసినా, జవాబిచ్చినా ఎప్పుడూ చిరునవ్వుతోనే చేసేది. కాని అప్పుడప్పుడు ఆమె నాకేసి

చూడనప్పుడు ఆమె మొగంపై మబ్బులు కమ్మడం గమనించాను. నాలో కుతూహలం కలిగినా అణచుకున్నాను. ఒకమారు ఆమె మొగం మీద మరీ దట్టంగా కారుమబ్బులు ఆవరించినట్లు కనిపించింది. నేను దగ్గరగా వస్తున్నా గమనించక ఆలోచనలో పడిపోయి నిలబడి ఉంది.

"ఏమమ్మా, ఈవేళ అలా ఉన్నావేమిటి?" అని అడగకుండా ఉండలేకపోయాను.

ఆమె ఉలిక్కిపడి నన్ను చూసి ఒక్కసారి తెల్లబోయి, వెంటనే తేరుకొని "నమస్కారం మాష్టారూ" అంది.

అంతే, జవాబివ్వలేదు. కారుమబ్బులు అలాగే ఉన్నాయి.

"ఏమిటి తల్లీ ఈవేళ నువ్వు చాలా దిగులుగా ఉన్నట్లున్నావు- ఎందువల్ల?" అన్నాను నేను మరింత మెల్లగా, సానుభూతితో.

ఒక్కసారిగా ఆమె కళ్లనుంచి నీరు పొంగి వచ్చింది. ఏడ్చివేసింది.

ఇప్పుడు తెల్లబోవడం నావంతైంది. ముందుకడుగువేయడమా, వెనక్కి తగ్గడమా పాలుపోక "ఊరుకోతల్లీ, చెప్పాలంటేనే చెప్పు. చెపితే కొంత బాధ తీరుతుందంటారు" అన్నాను.

కొంతసేపటికి ఆమె తన్నుతాను అదుపులో పెట్టుకొని, వోణీ కొంగుతో మొగం తుడుచుకొని- "క్షమించండి మాష్టారూ" అని పరుగెత్తుకుపోయింది.

తరువాత చాలారోజులు నన్ను తప్పించుకు తిరిగింది. కనీసం నాకలా అనిపించింది. కాని త్వరలోనే మామూలు స్థితిలోకి వచ్చేసింది. అదే చిరునవ్వుతో నమస్కరించడం, ప్రశ్నించడం, జవాబివ్వడం చేస్తోంది. ఆరోజు సంఘటన జరగనట్లే వ్యవహరించసాగింది. నేను కూడా పాతగాయం కెలకదలచుకోలేదు.

కాని కొన్నాళ్లకు మళ్ళీ అలాంటి సన్నివేశమే ఎదురైంది. ఈమారు నేను గుచ్చిగుచ్చి అడిగాను. అప్పుడు చెప్పింది.

ఆమె అయిదారేళ్ల పిల్లగా ఉండగానే ఆమె తల్లిపోయింది. అప్పటికి తనకు అన్నలు కానీ, తమ్ముళ్లు కానీ, అక్కచెల్లెళ్ళు కానీ లేరు. కొన్నాళ్ళకు తండ్రి రెండో పెళ్లిచేసుకున్నాడు. సవతి తల్లి మొదట్లో శ్యామలని బాగానే చూసింది. కాని తరువాత సొంత సంతానం కలగడంతో ఆమె వైఖరిలో మార్పువచ్చింది. ఇప్పుడామె దృష్టిలో శ్యామల తన, తన పిల్లల దారిలో ముళ్లకంప. నానా మాటలూ అనడమేకాదు నానాహింసలూ పెట్టసాగింది. ఆమె పిల్లలు కూడా ఆమెకు తోడయ్యారు. శ్యామల మొదట్లో చాలా బాధపడినా క్రమంగా ఆ మాటలకీ చేతలకీ అలవాటుచేసుకొని బతుకు నడపడం నేర్చుకుంది. కాని మనస్సుని ఎంత మొద్దుబార్చుకున్నా, అప్పుడప్పుడు కొన్ని మాటలూ, సంఘటనలూ గుండెలోకంటా దూసుకుపోయి తూట్లుపడేసేవి. తండ్రి తనని సమర్థించే బదులు రెండో భార్య అంటే భయంతో ఆమెనే వెనకేసుకువచ్చేవాడు లేదా పట్టనట్లు ఊరుకునేవాడు. చేసేది ప్లీడరు గుమాస్తా. ఇంత పెద్దకుటుంబాన్ని భరించేనికి తాపత్రయంలో తండ్రీకూతుళ్లకు విడిగా కలుసుకునే అవకాశం లేకపోయేది. అప్పుడైనా చాటుగా కూతుర్ని ఓదార్చి బాధకొంత పోగొడతాడంతే. అందువల్లే అప్పుడప్పుడు ఎంత దాచుకుందామనుకున్నా గుండెలో బాధ ఆగక పైకి పొంగుకువచ్చేది.

సంగతి తెలిసి నేను నిశ్చేష్టుడినైపోయాను. తరువాత నానిస్సహాయతను పేలవమైన చిరునవ్వు వెనకదాస్తూ "ధైర్యంగా ఉండు శ్యామలా! కష్టాలు కలకాలం ఉండవంటారు కదా. త్వరలోనే నీ జీవితం నువ్వు బతికే అవకాశం వస్తుందికదా" అన్నాను.

"ఏమో... అప్పుడు మాత్రం కష్టాలు నన్ను వెంబడించవని నమ్మకమేముంది మాష్టారూ?" అంది ఆమె.

నేను నిరుత్తరుడినయ్యాను. అవును... ఎందరు అభాగినుల జీవితాలు పెళ్ళి అయిన తరువాత మరింత విషాదంలో మునిగిపోవడంలేదు!

తరువాత కొద్దికాలానికే ఆమె పదో తరగతిలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణురాలై కళాశాలలో చేరింది. అందుకు ఆమె పెద్ద యుద్ధమే చేయవలసివచ్చిందని నాకు తరువాత తెలిసింది. కళాశాలలో చేరిన తరువాత ఆమె




ఇంచుమించుగా నాకు కనబడనే లేదు. దరి మిలా ఆమె ఇంటర్మీడియట్‌లో కూడా ప్రథ మశ్రేణిలో ఉత్తీర్ణురాలై డిగ్రీలో చేరిందనీ కూడా తెలిసింది.

ఇటీవల మళ్లీ శ్యామలను కొన్నిసార్లు కల వడం తటస్థించింది. కారణం మా తోటి ఉపా ధ్యాయుడు ఒకరు బలవంతాన నన్ను తన ఇంటికిలాగుకువెళ్లడమే. ఆయన ట్యూషన్లు బాగా చెబుతాడు. సహజంగా కొంత స్థితిపరు డే. ఆపైన అత్తవారినుంచి కట్నకానుకలు బాగా అందుకున్నవాడు. అతనిపేరు లక్ష్మీ పతి. చాలా చక్కగా అమరిందనే చెప్పాలి. అందువల్ల అన్ని వైభోగాలూ అనుభవిస్తూ ఉంటాడు. తాను ఏ కొత్త వస్తువు- మిక్సీ, ఫ్రిజ్, టి.వి వగైరా- కొన్నా చుట్టుపక్కలవాళ్లనీ, తోటి ఉపాధ్యాయులనీ పిలిపించి, వారి వస్తువు చూపించి, వారిచే శభాష్ అనిపించుకుంటేనే కాని తృప్తి ఉండదు. ఆయన ఈమధ్యన తన నలుపు తెలుపు టీవీ మార్చి రంగులసెట్టు కొన్నాడట. నన్నుచూసి వెళ్లమని బలవంతం చేశాడు. అప్పుడు తెలిసింది. నాకు శ్యామల వాళ్లు ఆఇంట్లోనే ఆ చివరి వాటాలో ఉంటున్నా రని-

నన్ను చూసి శ్యామల పరుగెత్తుకువచ్చింది. టీ.వీ చూస్తూ ఉల్లాసంగా కబుర్లు చెబుతోంది కాని ఎవరూ తనకేసి చూడటం లేదన్నప్పుడు ఆమె మొగం గంభీరమవుతూ ఉండటం నేను గమనించాను. కాని నా అంతట నేను ఆమెని ప్రశ్నించదలచలేదు. కొత్త టీవీ చూసి, మా మిత్రుడిని ఘనంగా పొగిడి బయటపడ్డా ను.

అదే సమయంలో ఎవరో ఆయన గేటు బయటికి పోబోతున్నాడు. శ్యామల నావెనకే పరుగెత్తుకు వచ్చి "మాష్టారూ... మానాన్న" అని ఎదరకు పరుగెత్తుకువెళ్ళి "నాన్నా... హైస్కూల్లో మా మాష్టారు, అందరిలోకీ ఇష్ట మైన మాష్టారు" అని చెప్పింది.

ఆయన వెనుతిరిగి "అలాగా బాబూ... చాలా సంతోషం వస్తానండి, సెలవు" అని నమస్కరించి వెళ్ళిపోయాడు. నలభై అయిదే ళ్ళు మించి ఉండకపోవచ్చుకాని జుట్టు తెల్లబ డిపోయి, సగం బట్టతల అయిపోయింది. ఆయన మోస్తున్న బతుకుభారంవల్ల కాబోలు కొద్దిగా ముందుకు వంగినడుస్తున్నాడు.

శ్యామల నన్ను తన తండ్రికి పరిచయం చేస్తుంటే వాళ్ళ గుమ్మంలోనుంచి ఎన్నో జతల కళ్లు అటు చురచురా చూస్తుండటం గమ నించాను. అందువల్ల "వస్తానమ్మా" అని చె ప్పి త్వరగా ముందుకు కదిలాను.

తన తండ్రి వ్యవహారానికి చిన్నబుచ్చుకున్న ట్లుంది "అలాగే మాష్టారూ- నమస్కారం" అని నీరసకంఠంతో అంది.

ఇలా రెండుమూడుసార్లు మాతోటి ఉపాధ్యా యుడు లక్ష్మీపతి ఐశ్వర్యం చూసేవంకన శ్యా మలని కూడా కలుసుకోవడం జరిగింది. ఒక సారి ఎందుకో ఆమె నన్ను దూరంనుంచి చూసి కూడా నా దగ్గరకు రాలేదు. నేను తిరిగి వెళ్లిపోబోతూంటే త్వరగా అడుగులు వేసు కుంటూ నాదగ్గరికి వచ్చింది. చిరునవ్వునవ్వే ప్రయత్నం కూడా చేయలేదామె. "మాష్టారూ... మా పిన్ని తొందరమూలంగా మానాన్న నాకు త్వరగా పెళ్లిచేసి పంపించేద్దామనుకుంటున్నా డండీ! డిగ్రీలో ప్రవేశించానుకదా, ఇదైనా పూర్తి చేయనియ్యి- నాన్నా! అని ఎంత బతిమాలినా వినిపించుకోవడంలేదండీ! 'డిగ్రీ అయిన తరువాత ఏ ఎమ్మేయో చదువుతానంటావు. నీకేం తల్లీ... పెళ్లీడుకొస్తున్న మా పెద్దదాని మాట ఏంచేయాలి. నీలాగే అది కూడా పెళ్లిపె డాకులూ లేకుండా ఉండిపోవాలా?' అని మా పిన్ని వెటకారం చేస్తోందండీ! అయినా మాష్టా రూ మీరొకసారి మానాన్నతో మాట్లాడి నన్ను డిగ్రీ చదువుపూర్తిచేయటానికి ఒప్పించండి. నేను పెళ్లి చేసుకోకుండా ఉండదలచడం లేదండీ... కనీసం డిగ్రీయేనా ఉంటే బాగుంటుందనుకుంటున్నాను- అంతే మాష్టా రూ" అంది ఆమె ఎంతో ఆరాటంతో నాకళ్ళలో కి చూస్తూ.

నేను కొంచెం తటపటాయించాను. ఆమె తండ్రి వ్యవహారం చూశానుకదా. ఆయన వినడం వినకపోవడం అలా ఉంచి, అసలు ఆయనతో మాట్లాడడమే ఎలా? అయినా పైకి అన్నాను "అలాగేనమ్మా... అవకాశం వస్తే తప్పక ప్రయత్నిస్తాను. కాని ఆయనని ఎక్కడ ఎప్పుడు కలుసుకుంటే బాగుంటుందో నువ్వే చెప్పు" అన్నాను.



ఆమె ఒక నిముషమాగి "వద్దులెండి మాష్టారూ... మీరు చెప్పినా వింటాడని నమ్మకం ఏమీలేదండి. పైగా మీరునాతరపున మాట్లాడారని తెలిస్తే మాఇంట్లో నరకం ఒక్కసారి భగ్గుమంటుంది" అంది శ్యామల డీలాపడిపోతూ.

"మాష్టారూ... చదువుకు నీళ్లొదులుకోవలసి వచ్చేటట్లే ఉంది. నా రాతకి తలఒగ్గవలసేటట్లుంది"

"కాలేజి చదువే చదువుకాదమ్మా... తెలుసుకోవాలన్న తపనే ఉండాలికాని ఎప్పుడైనా చదువుకోవచ్చు. పెళ్ళి అయిన తరువాత డిగ్రీలు సంపాదించుకున్నవారు కూడా ఉన్నారమ్మా" అని నేను ఆమెకు భరోసా ఇవ్వబోయాను.

"ఆ వచ్చేవాళ్లు ఎలాంటివారై ఉంటారో మాష్టారూ" అంది శ్యామల.

వర్తమాన సమాజంలో ఆడపిల్ల భవిష్యత్తు ఎంత భయంకర సందేహాలతో కూడి ఉందో మళ్లీ ఒకసారి అవగతమయింది. నేనేమీ మాట్లాడలేకపోయాను.

"వస్తాను మాష్టారూ" అని ఆమె వెనక్కి వెళ్లిపోయింది.

శ్యామల తండ్రి ఆమెకోసం తీవ్రంగా సంబంధాలు వెతుకుతున్నాడని తరువాత లక్ష్మీపతిద్వారా తెలిసింది. వరుడు ఎలాఉన్నా చదువూ, సంస్కారము లేకపోయినా, పెద్ద ఉద్యోగం లేకపోయినా ఫర్వాలేదు భార్యను పోషించేవాడై ఉండి, కట్నలాంఛనాలు తక్కువ తీసుకునేవాడి కోసం గట్టిగా ప్రయత్నిస్తున్నాడట. ఎంత త్వరగావీలైతే అంతత్వరగా ఈ బరువువదిలించుకోవాలని తాపత్రయమన్నమాట.

జిజ్ఞాస, ఉత్సాహం, చలాకీఉన్న ఒక జీవి త్వరలో ఒక చిన్న పంజరంలో బంధించబడబోతోందని తలచుకొని నేను బాధపడ్డాను. కాని నేను చేయగలిగింది ఏముంది? లక్ష్మీపతే చెప్పాడు- రెండుమూడు సంబంధాలవారు వచ్చి శ్యామలని చూసివెళ్ళారనీ, రాయబారాలు సాగుతున్నాయనీ, ఏమైనా శ్యామలపెళ్ళి త్వరలోనే ఖాయమనీ చెప్పాడు. మంచికో చెడుకో శ్యామల జీవితంలో కొత్త అధ్యాయంప్రారంభం కాబోతోందన్నమాట. అది అంధకారబంధురమయి తీరుతుందని ముందే ఎందుకనుకోవాలి? ఆమె తన తెలివితేటలతో, చలాకీతనంతో భర్తని తన చెప్పుచేతల్లో పెట్టుకొని తన జీవితంచక్క దిద్దుకోవచ్చు. తన ఆదర్శాలు కూడా సాధించుకోవచ్చు, ఏమైనా ఇప్పటి సజీవ నరకం నుంచి బయటపడుతుందికదా అని నన్నునేను సముదాయించుకున్నాను.

అంతలో అనుకోనిది జరిగిపోయింది. ఆ రౌడీ కుర్రాళ్లలో ఒకడి దృష్టి ఆమెమీద పడనే పడింది.

* * *

ఆవార్త చెవినపడేవరకూ నాకు శ్యామల అందంగురించి ఆలోచనే రాలేదు. ఇప్పుడు తిరిగి తలచుకుంటే ఆమెలో ఒక అందం, ఆకర్షణ ఉన్నాయని బలంగా గుర్తుకు రాసాగింది. ఇన్నాళ్లూ ఈ విషయం ఎందుకు గుర్తుకురాలేదంటే నలుపు నాలుగందాలు దాస్తుందని ముందే చెప్పాను కదా. కాని శ్యామల నలుపుకాదు. చామనచాయ. కోల మొహం. కనుముక్కు తీరు బాగుంటుంది కూడా. ఆ కళ్లలో మెరుపు ఉంది. మళ్లీ మళ్లీ చూడాలనిపించే లక్షణం ఉంది. నిండు పెదవులమీద చిరునవ్వు చిందులాడేటప్పుడు బుగ్గన సొట్టలుపడతాయి. ఆమెని నేను ముఖ్యంగా అభిమానంతోనే చూశాను కాబట్టి ఆమె అందం గురించి పెద్దగా పట్టించుకోలేదు. కాని ఆ దుర్మార్గుడి దృష్టి వేరుకాబట్టి ఇట్టే శ్యామల అందాన్ని పసికట్టాడు. చిత్రమేమంటే కళాసాహిత్యాలుకానీ, ఉన్నత విలువలుకానీ ఏమీ తెలియని కుసంస్కారి కూడా ఆడదాని చక్కదనాన్ని ఇట్టే గుర్తిస్తాడు. అందుకే ఈ రౌడీగాడి కన్ను శ్యామలమీద పడిందన్నమాట.

ఆ తరువాత పరిణామాలు నాకు తెలియరాలేదు. కారణం నా ప్రధాన సమాచార సాధనం లక్ష్మీపతి పదిహేనురోజులు సెలవుపెట్టి స్వగ్రామం వెళ్లిపోయాడు. శ్యామల ఇంటిపరిస్థితి నాకు తెలుసుకాబట్టి ఆమెను గురించి తెలుసుకోవాలన్న తహతహ ఎంతఉన్నా నా అంతట నేనే వాళ్లయింటికి వెళ్లి విచారించి వచ్చే అవకాశంలేదు. లక్ష్మీపతి తిరిగివచ్చిన తరువాతే నా ఉద్విగ్నత తీరే దారి ఏర్పడింది.

"శేఖర్‌గారూ... ఇంగ్లీషు సామెత చెబుతారు చూడండి, టెమ్స్ వంతెనకింద నుంచి చాలా నీరు ప్రవహించిందని. అలాగే ఈ పదిహేనురో





జుల్లో చాలా కథ నడిచింది. ఇప్పుడు క్లైమాక్సు కి చేరుకుంది కూడా'' అన్నాడాయన.

నా ఉత్కంఠ తారాస్థాయికి చేరుకుంది. ఇబ్బంది ఏమంటే శ్యామల జీవితంపట్ల నాకు ఏర్పడిన ఆసక్తి, ఆందోళనా ఆయనకేమాత్రం లేవు. అసలు ఆయన స్వభావమే అంతకదా, ఎవరెలా పోతేనేం నా రంగుల టీవీ, ఫ్రిజ్, మిక్సీ, సోఫాసెట్లు నాకు ఉన్నాయి కదా అను కునేరకం. పొరుగునే ఉన్నా ఆ అమ్మాయిపట్ల పెద్ద సానుభూతి కలగలేదు. ఒక అమాయకజీ వితం ఏమవుతుందో అన్న ఆలోచనే లేదు. కేవలం ఒక పసందైన వార్త చెపుతుంటే కలిగే సరదామాత్రమే. అందువల్ల మధ్యలో అనేక శాఖా చంక్రమణలూ, వాళ్లనీ, వీళ్లనీ పలుక రింపులూ, వాళ్లతో కబుర్లూ వగైరాల్లో లక్ష్మీపతి నుంచి నేరుగా కథ రాబట్టడం కష్టమైంది. చివరికి ఎలాగో తెలుసుకున్నది ఇది.

ఆ రౌడీపేరు నరసింహులట. వాడు ఆ దుష్టచతుష్టయంలో ప్రధానవ్యక్తి కాదు. వారిలో ఇద్దరే డబ్బూ, హోదా, పలుకుబడి కలవారు. తక్కిన ఇద్దరూ పులిని వెన్నంటి ఉండే నక్క లాంటివారు. ఆ యిద్దరిలో వీడొకడు. వాడు చూశాడు- శ్యామల ఒక చక్కని చుక్క అని. అంతే... తొలిచూపులోనే ప్రేమ అన్నట్లైంది. ప్రేమంటే ఏమిటో వాడికి తెలుసునని కాదు- వాడి దృష్టిలో ప్రేమ అంటే తనలో కోరిక కలగడం; ఆ కోరుకున్నది సాధించడమే. అలా కోరుకున్నది ఒక ప్రాణంలేని వస్తువుకాదు, రక్తమాంసాలూ, భావావేశాలు కల మనిషి అనీ; ఆమెకూ కోరికలు ఉండవచ్చనీ, అవి భిన్నంగా ఉండవచ్చనీ వాడికి తోచనేతోచదు. వాడి మనస్సుకి నచ్చింది కాబట్టి ఇక ఆమె తనదే. ఇకదానిపై తన అధికారం స్థాపించుకో వడమే తరువాయి అన్నట్లు వ్యవహరించసాగా డు. ఆమెను వెన్నాడటం మొదలుపెట్టాడు. ప్రేమిస్తున్నానన్నాడు. పెళ్లాడతానన్నాడు. మొ దట్లో ఆమె తనని వదిలి వేయమని బతిమా లింది. ఆమె బతిమాలినకొద్దీ వాడి ధీమా మరింత పెరిగింది.

చివరికి- "నేను నిన్ను ప్రేమించడం లేదు. నిన్ను పెళ్లాడే ప్రశ్నేలేదు'' అని కరాకచ్చిగా చెప్పింది శ్యామల. వాడు వెనుదీయలేదు. తన తోటివాళ్లకు చెప్పాడు. వాళ్లు "సెభాష్... ధైర్యంగా ముందుకుసాగు, నీకు మేము తోడు న్నాం'' అని భరోసాయిచ్చారు. వాడు-ఆ నర సింహులు-కోరుకున్న వస్తువు వాడి ఒడిలోపడే టట్లు చేయడమే వాళ్ల తక్షణ కర్తవ్యమైంది. ఒకసారి వాళ్లు ఆమె దారి కాసి "మావాడితో సినిమాకు వెళ్లు, అన్నీ మాట్లాడు'' అని ఒత్తిడి చేశారు. "నన్ను ఆలోచించుకోనివ్వండి'' అని ఎలాగో వాళ్లనుంచి విడిపించుకొని ఇంటికి పారిపోయివచ్చింది. ఎలాగైనా కాలేజీ చదువు పూర్తి అయ్యేటట్లు లేదు. అందువల్ల అప్పటి నుంచే కాలేజీకి వెళ్లడం మానేసింది. ఇంట్లోనే ఉండిపోసాగింది.

ఆ దుష్టచతుష్టయం వదిలితేగా! ఇంటికే రావడం మొదలుపెట్టారు. శ్యామల వీధి మొగం చూడటమే మానివేసింది. అయినా లాభం లేకపోయింది. వాళ్ల తెగింపు మరో స్థాయి పైకిపోయిందే కాని తగ్గలేదు. చీటీలు రాసి పిల్లలచేత లోపలికి పంపసాగారు. అలాంటి చీటీ సవతితల్లి కంటబడింది. ఇంకే ముంది, కొంపలంటుకున్నాయి. ఈ చీటీల మూలంగా అప్పటికే ఇరుగుపొరుగుల్లో గుసగు సలు ప్రారంభమయ్యాయి. శ్యామల సవతిత ల్లి చేసిన యాగీ ఇంతా అంతా కాదు. "ఇదే ఏదో చేసి ఉంటుంది. లేకపోతే వాళ్లెందుకు బరితెగిస్తారు? మన బంగారం మంచిదైతేనే కదా ఇతరులననడానికి'' అంటూ తిట్లూ, శాప నార్థాలూ, ఏడుపులూ, ఒకటేమిటి లంకించు కుంది. "నాపిల్లల గతేం కాను దేవుడో! నా యిద్దరాడపిల్లలకీ పెళ్లిళ్లు అవుతాయా,రేపు నా యిద్దరు కొడుకులకీ సంబంధాలు వస్తా యా?'' అని ఆక్రోశించింది. ఇంతకీ ఆమె పెద్దపిల్ల వయస్సు పదిహేనేళ్లే. ఆఖరి పిల్లవా డు ఇంకా ఉయ్యాలలో ఉన్నాడు. అయినా వాళ్ల భవిష్యత్తు గురించి ఊహించుకొని ఆవే శంతో ఊగిపోయింది. మొగుడు ఎదురుగా కనబడేసరికి "మీ అలుసే ఇంతపనిచేసింది. గారాబం చేసి నెత్తికెక్కించుకున్నారు. ఆడ పిల్లకు చదువెందుకు, వెంటనే పెళ్లిచేసి పంపెయ్యండంటే నా మాట విన్నారా? ఇప్పు డేం చేస్తారో చేయండి. ఇక దీనికి పెళ్లి ఎలా చేస్తారో చూస్తానుగా. ముందు నాకొచ్చింది తంటా. నన్నూ నా పిల్లల్నీ ఏ నూతిలో




దూకమంటారో చెప్పండి'' అంటూ ఆయన మీద విరుచుకుపడింది. ఆయన కూడా పిచ్చి ఆవేశంలో పడిపోయి, శ్యామల ఎంత చెప్పినా వినిపించుకోక ఎన్నడూ చేయిచేసుకోనిది, ఆ వేళ ఆమెను కొట్టి వీధిగేటుకంటా గెంటుకు పోయి ''ఫో... ఇక నీమొగం నాకు చూపించకు. ఫో వాడి దగ్గరికే పో... మళ్లీ ఈ గడపతొక్కా వంటే కాళ్లూ చేతులూ నరికేస్తాను' అం''గా ఆమెనక్కడే వదిలివేసి లోపలికి పోయి తలుపులు ఫెడీమని బిగించేసుకున్నాడు. లోపలినుంచి చాలాసేపు ఆయన రెండో భార్య ఏడుపులూ, పెడబొబ్బలతో శాపనార్థాలు వినబడుతూనే ఉన్నాయి.

అటు శ్యామల వీధిగేటు బయటే కూలబడిపోయింది. చీకటి పడింది. ఎనిమిదయింది, తొమ్మిదయింది. ఇంట్లోవాళ్లెవరూ వచ్చి ఆమెను తీసుకువెళ్లినవారూ లేరు; ఆ పిల్లా అక్కడినుంచి కదలలేదు. మొదట్లో కంటికీ మంటికీ ఏకధారగా ఏడ్చి ఏడ్చి తనని ఓదార్చేవాళ్లెవరూ లేరు, సానుభూతి చూపేవాళ్లూ ఎవరూ లేరని గుర్తించి మెల్లగా తనను తాను సముదాయించుకొని శాంతించింది. కాని బయటి చీకటికన్నా ఆమె మనస్సునావరించిన చీకటి ఎంతో దట్టమైనది, భయంకరమైనది. తను ఎక్కడికిపోవాలి? ఏమిచేయాలి?- ఆమెకేమీ సమాధానం తోచలేదు. అందువల్ల గేటు వెలుపల నేలమీద శిలాప్రతిమలా కూర్చుండిపోయింది.

ఈ పరిస్థితి చూసి చుట్టుపక్కల వాళ్లు చివరికి కలగజేసుకోక తప్పలేదు. వెళ్లి శ్యామలా వాళ్ల తలుపు బాది, తెరిచేటట్లు చేసి ఆమె తండ్రిని కేకలేశారు. ఆ పిల్లనలా నడివీధిలో వదిలి వచ్చేస్తే వదిలిపోయిందనుకున్నారా? ఆ పిల్ల మాట ఎలా ఉన్నా రేపు మీరు మళ్లీ వీధిమొగం చూడగలరా? ఊళ్లో పరిస్థితి తెలియనిది కాదుగా. ఆ రౌడీ వెధవల వల్ల ఎంత గగ్గోలు పుట్టిందో మీకు తెలియదా? సంసారం చేసే ఆడవాళ్లూ, సంప్రదాయంలో పుట్టిపెరిగిన ఆడపిల్లలూ కూడా ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకొని కూర్చుంటున్నారే. ఆ రౌడీ వెధవ ఆగడానికి ఆ పిల్లనలా రోడ్డుమీద వదిలేస్తే, రాత్రి ఆమెకేమైనా అయితే రేపు అందరూ మీ మొగం మీద ఉమ్మేయరూ? ఇంటిగుట్టు ఇంట్లోనే దాచుకోవాలి కాని బయలు చేసుకుంటారా ఎవరైనా? మీరు తెలివైన వాళ్లయితే వెంటనే ఏదో సంబంధం స్థిరపరచి చదీచప్పుడూ కాకుండా పెళ్లి చేసివంపించెయ్యండి. అంతేకాని ఇలాంటి తెలివితక్కువ పనులు చేయకండి అన్నారు.'' ఎవరో వెళ్లి శ్యామలను కూడా చీవాట్లు వేసి లోపలికి నడిపించుకు వచ్చారు. ఆమె గుమ్మం కేసి తీసుకువెళ్లారు. ఎవరూ అడ్డుపెట్టలేదు. ఆమెను లోపల దిగబెట్టి చుట్టుపక్కల వాళ్లు ఇవతలికి వచ్చివేశారు. తరువాత తలుపులు మూసుకున్నాయి. ఆ రోజుకి కథ ఆ ఘట్టంతో ఆగింది. ఆ యింట్లో నుంచి ఆ రాత్రి మరో శబ్దం రాలేదు.

తరువాత శ్యామల తండ్రి ఒక సంబంధంవారికి మరికొంచెం ఎక్కువ కట్నం ఇస్తానని చెప్పి ఒప్పించాడు. తాంబూలాలు కూడా పుచ్చుకున్నారు. ఈ వార్త ఎలాగో ఆ రౌడీ వెధవలకి చేరిపోయింది. నరసింహులు ఉగ్రంతో చిందులు తొక్కాడు. ఆత్మహత్య చేసుకుంటానన్నాడు. తోటివారికి సంకట పరిస్థితిగా, అంతకన్న ఎక్కువగా తమ ప్రతిష్ఠకొక సవాలుగా తోచింది. కాని మార్గం మాత్రం తోచలేదు. అంతలో ఒకడికి బ్రహ్మాండమైన ఆలోచన వచ్చింది. నాయకుడి చెవిలో ఊదాడు. నాయకుడు తక్కిన యిద్దరికీ చెప్పాడు. అందరూ తలలూపారు. వెంటనే ఆచరణకు పూనుకున్నారు కూడా. ఒకరోజున శ్యామల ఇంట్లోవాళ్లకీ, ఇరుగుపొరుగులకీ, సంబంధం ఒప్పుకున్నవారికీ శుభలేఖలు అందాయి. వాటిలో చి॥సౌ॥శ్యామలకీ చి॥నరసింహులుకీ వివాహం నిశ్చయమైందనీ, ముహూర్తానికి అందరూ వచ్చి వధూవరులను ఆశీర్వదించి వెళ్లాలనీ ఉంది. 'శుభలేఖ' నిజంగా శుభలేఖలాగే ఉంది.

శ్యామలకుటుంబంపై పిడుగు పడ్డట్టే అయింది. చుట్టుపక్కలవాళ్లు కూడా అదిరిపోయారు. కుదిరిన పెళ్లి చెడిపోయిందని వేరే చెప్పనక్కర్లేదుకదా. తరువాత ఆ యింట్లో ఏమవుతుందో ఊహించడం కూడా కష్టం కాదు. రెండుమూడు రోజుల తరువాత ఎవరో శ్యామల తండ్రికి సలహా యిచ్చారట. ''వాడెలా



గూ చేసుకోవాలనుకుంటున్నాడుకదా. వాడికే ఇచ్చి చేస్తే పోలా? కులంగిలం చాదస్తం పెట్టుకోకండి. ఆపద్ధర్మంగా వెళ్ళి ఆ రౌడీగాడి తల్లిదండ్రులతో రిజిష్టరు వివాహానికి ఒప్పించి ఆ తంతు పూర్తిచేసి మళ్ళీ ఆ అమ్మాయిని మీ గుమ్మం తొక్కనివ్వకండి'' అని.

ముందు భగ్గుమన్న శ్యామల తండ్రి 'ఇదొక్కటే దారిలా తోస్తోంది' అనుకొని ఆ సలహాయిచ్చిన పెద్దమనిషినే వెంటబెట్టుకొని నరసింహులు తండ్రి దగ్గరికి వెళ్ళాడు.

నరసింహులు తండ్రి వాళ్ళని కొట్టినంత పనిచేశాడు. 'ఎందుకొచ్చాయయ్యా మీకేళ్ళు! ఆ కుర్రకుంక ఏదో కుర్రచేష్ట చేస్తే అది నిజంగా తీసుకొని నాయింటిమీద పడతారా! ఎన్నిదమ్ములున్నాయి మీకు! ఎంత బాపనయ్యావైతే మాత్రం ఎవడిక్కావాలయ్యా నీ దరిద్రపు సంబంధం. నా కొడుక్కి అడ్డమైనోళ్ల పిల్లనిచ్చి చేసుకోవడానికి నేను తలమాసినోడిని కాదు. నాకు ఊళ్ళోపేరు ఉంది. నాకు ఎంతో గౌరవం ఉంది. మావోడికి మేనరికమే ఉంది తెలుసా? పొండవతలకి. నాకు కోపమొస్తే మిమ్మల్ని నిలువునా చర్మం చీరేసి చెప్పులు కుట్టిస్తాను, జాగ్రత్త, హుం!''

దానితో శ్యామల తండ్రీ, సలహాయిచ్చినాయనా వెనక్కి తిరిగి చూడకుండా పారిపోయి వచ్చారు.

తరువాత ఇరుగుపొరుగుల్లోనే ఒక పెద్దమనిషి నరసింహులునే కదిపి చూశాడట, ''ఏమిటయ్యా నీఆలోచన? ఆ పిల్లమీద నీకంత మమకారం ఉన్నప్పుడు నువ్వే దారి చూపించాలి. మీనాన్న ఒప్పుకునేటట్లులేదు. నువ్వే తెగించాలి- ఏమంటావు?''

వాడు బెల్లంకొట్టిన రాయిలా ఒక్కమాట పలికితే ఒట్టు!

అంతా చెప్పిన తరువాత లక్ష్మీపతి అన్నాడు- ''ఆ అమ్మాయికి పెళ్ళి అంటే విముఖత ఏమీ లేదుటండీ కనీసం బి.ఎ వరకైనా చదవాలని ఉబలాటపడిందట, అంతే. అందరిలాగే ఆమెకీ పెళ్ళి చేసుకోవాలనీ, పిల్లల్ని కనాలనీ, సంసారం చక్కదిద్దుకోవాలనీ కోరిక ఉండేదిట. ఇప్పుడిక ఆ కోరిక నెరవేరే అవకాశం లేనట్లే అనిపిస్తోంది. అటు ఆమె తండ్రి ఆమెను చదివించే స్థితిలోనూ లేడు. పోనీ ఉద్యోగం చేసుకొని తన బతుకేదో తను బతుకుతుందంటే ఏ డిగ్రీ లేక, పలుకుబడీ లేక, డబ్బూ లేక ఉద్యోగం ఎలా సంపాదించగలదు చెప్పండి''

లక్ష్మీపతే ఆనాడు ఇంటిలోపల దిగబెట్టి వచ్చినప్పటినుంచీ శ్యామలను మళ్ళీ చూసినవాళ్లూ లేరు, ఆమెమాట విన్నవారు లేరు అని కూడా చెప్పాడు.

నేను గిజగిజలాడిపోయాను. కాని ఒంటరివాడినీ, అర్భకుడినీ ఏమి చేయగలను? ఒక ఊపులో నేను వెళ్లి శ్యామలను తీసుకువచ్చి మాయింట్లో పెట్టుకొని చదివించడమో, లేక ఉద్యోగ ప్రయత్నం చేయించడమో చేద్దామనుకున్నాను. కొద్దిక్షణాలు ఆశ కూడా వెలిగింది. మా ఆవిడ ముందు విషయం ప్రస్తావించాను. శ్యామల గురించి టూకీగా చెప్పి నాప్రతిపాదన చెప్పాను. కృష్ణవేణి కళ్లలో ఆశ్చర్యమూ, అపనమ్మకమూ, భయమూ గోచరించాయేకాని ప్రోత్సాహం జాడ ఎక్కడా లేదు. పైగా ఒక మూలనుంచి అనుమానం కూడా తొంగి చూస్తున్నట్లనిపించింది. అన్నివిధాలా అనుకూలవతి అనుకున్న నా అర్ధాంగి నుంచే అటువంటి ప్రతిస్పందన రావడంతో నేను హతాశుణ్ణయ్యాను.

అసూయా, అనుమానము ఎంత సులభంగా మానవహృదయాల్లో మొలకెత్తగలవు? మా ఆవిడలోనే ఆ ఛాయలు కనిపిస్తే ఇక చుట్టుపక్కలవాళ్ల విషయంలో ఇంకేమి చెప్పాలి. తొందరబాటుతో ఆపదలో ఉన్న ఆమెను రక్షించే బదులు నానెత్తిమీదికే తుఫాను తెచ్చుకుంటాననిపించింది. ''మరి ఏమిటి దారి, భగవంతుడా'' అని కొట్టుకున్నాను. రాత్రి పొద్దుపోయేవరకూ ఆలోచిస్తూనే ఉన్నాను. మెలకువ వచ్చినప్పటినుంచీ అదే ఆలోచన. కాని ఎటునుంచి మినుకుమినుకుమనే సమాధానమైనా తోచలేదు.

కాని మనం సమస్యల గురించి ఆలోచిస్తూ పరిష్కారాలు వెతుకుతుంటే సంఘటనలు జరగడం ఆగిపోవుకదా. మర్నాడు మధ్యాహ్నం లక్ష్మీపతే వార్త మోసుకొచ్చాడు. శ్యామల కిరసనాయిలు పోసి అంటించుకుందనీ, చావు బతుకుల మధ్య ఊగిసలాడుతోందని. నేను

కొంతసేపటికి తేరుకుని మధ్యాహ్నం సెలవుపెట్టి శ్యామలను ఉంచిన ఆసుపత్రికి పరుగెత్తాను.

ఎనభైశాతం శరీరం కాలిపోయిందట. బతికే అవకాశం ఏ మాత్రంలేదని డాక్టర్లు చెప్పేశారట. మరో రెండు గంటలకు కానీ నన్ను ఆమెని చూడనివ్వలేదు. ఆమె ఒళ్ళంతా కప్పివేసే ఉంది. చిత్రంగా ఆమె మొహం ఇంచుమించు మామూలుగానే ఉంది. నేను దగ్గరికి జరిగి "శ్యామలా" అని రెండు మూడుసార్లు పిలిచాను మెల్లగా. మూలుగుతూనే ఆమె మెల్లగా కళ్ళుతెరచి నలుదిసలా చూసి చివరికి నాకేసి చూసింది. "మాష్టారూ... మీరు వచ్చారా?" అంది.

"శ్యామలా... ఎంతపని చేశావు! ఇదేనా మార్గం?" అన్నాను మూసుకుపోతున్న గొంతుకను పెకలించుకొని. ఆమె కళ్ళుమూసుకొని కొంతసేపు మూలిగి, మళ్లీ భారంగా కళ్ళుతెరచి నాకేసి చూస్తూ అంది- "నాకు మరో మార్గమేముంది మాష్టారూ?"

నేను మాట్లాడలేకపోయాను. మళ్లీ ఆమె అంది "మాష్టారూ... నాకు మాత్రం బతికే హక్కులేదా?" నేనేమీ జవాబివ్వగలను? అంతలో డాక్టర్లు వచ్చారు. నేనక్కడి నుంచి ఇవతలికి వచ్చేయవలసి వచ్చింది. తిరిగి ఆమెను చూసే అవకాశమే లేకపోయింది. మరో రెండు గంటలకే ఆమె చనిపోయింది.

ఆమె ప్రశ్న నా చెవుల్లో గింగురుమంటూనే ఉంది. ఆ ప్రశ్నవేస్తున్నప్పుడు ఆమె కళ్ళలో కానవచ్చిన నిరాశ, నిస్సహాయత, దీనత్వం, పైకి ఉబుకుతున్న కన్నీళ్లూ అస్తమానూ నా కళ్లముందాడుతూ నన్ను గుండె లోతులకంటా పొడిచివేస్తున్నాయి.

అప్పుడే నేను ఈ నిర్ణయం తీసుకున్నది. ఏమైనా సరే- ఆ దుండగుల్ని ఎదుర్కొని వాళ్ల ఆటకట్టించి తగ్గశిక్ష అనుభవించేటట్లు చేయడానికి శపథం పూనాను.

ఆ రౌడీల ఆగడాలకు గురిఅయిన అమ్మాయిలూ, స్త్రీలూ అందరూ అందుకు ముందువరకూ వార్తల్లోనే ఉండిపోయినవారు ఇప్పుడు నాకు ఆత్మీయులైపోయినట్లై నాకేసి చేతులు చాచుతున్నట్లనిపించింది. నా నిర్ణయం బలపడింది.



నిర్ణయమైతే తీసుకున్నానుకాని దానిని అమలుపరచాలికదా. సమస్య అంతా అక్కడే ఉంది. నా పరిస్థితి ఏమిటో, నేను ఎదుర్కోబోయే శత్రువులెలాంటివారో, చుట్టూ ప్రజల జీవనవిధానం ఎలాంటిదో ముందే వివరించాను. ఇటువంటి స్థితిలో మొండి సాహసంచేసి ఆ నరభక్షకి చతుష్టయంతో తలపడితే నేనే వాటికి ఆహారమైపోతాను. అవి తృప్తితో పెదాలు నాకుకుంటాయి.

మరి ఏంచేయాలి?

నలుగురితో కదలాలి. ఈ రౌడీల్లో నూటికి తొంభైమంది సాధారణంగా పిరికివారే అయి ఉంటారు. ఎదుటివారి బలహీనతా, పిరికితనమూ ఆసరాగా తీసుకునే వాళ్లు విర్రవీగుతారు. తమకన్నా బలాఢ్యులెదురైతే ఇట్టే తోకముడుస్తారు. నావంటి వారికి నలుగురితో కదలడంలోనే బలముంది కాని మాపేటవాసుల్ని కలిసి కదిలేటట్లు చేయడం నాతరం అవుతుందా? అందులోనూ అపాయం పొడతగిలితే చాలు అడుగుముందుకు పడదువాళ్లకి. అయినా ప్రయత్నంచేసి చూడాలనిపించింది. జరగదని ముందే నిర్ణయించుకొని చేతులు ముడుచుకొని ఎందుకు కూర్చోవాలి? సభపెట్టి 'అందరూ రండి' అంటే రాజుగారూ - పాలసే కరణా కథలోలా 'నేనొకండూ వెళ్ళకపోతే సభ ఆగిపోతుందేమిటి? తక్కినవాళ్లు ఉంటారుగా, అని ఎవరిమట్టుకు వాళ్లు ఆలోచించుకొని ఏ ఒక్కరూ రాకపోవచ్చు. అలాకాక విడివిడిగా కలుసుకొని, మెల్లగా, జాగ్రత్తగా మాట్లాడి కనీసం ఒకరిద్దరినైనా ముందుకు వచ్చేటట్లు చేస్తేచాలు తరువాత తక్కినవారిని కూడా





లాక్కురావచ్చు. శ్యామల విషయంలో ఎన్నడూ లేనిది కొందరు కలగజేసుకున్నారని లక్ష్మీపతే చెప్పాడుకదా కాబట్టి ఇదే నా కార్యాచరణ పథకంగా నిశ్చయించుకున్నాను. ఎవరితో మాట్లాడితే కార్యం సానుకూలం కావచ్చునో అటువంటివారి గురించి ఆలోచించసాగాను. నాలుగైదు పేర్లుదొరికినాచ్చాలు ప్రారంభం చేయడానికి.

కాని ఈలోగా శత్రువుని గురించి సాధ్యమైనంత అధిక సమాచారం సేకరించి పెట్టుకోవడం మంచిదనిపించింది నాకు. ఎందుకంటే సాధారణంగా శత్రువు బలాలూ, బలహీనతలూ సరిగా తెలుసుకోకుండా ముందుకు దూకడంవల్లే అపజయాలూ, అనర్థాలూ సిద్ధిస్తుంటాయి. అవతలివాడిని గురించి ఎంత బాగా తెలుసుకుంటే అంత ధీమాతో అతనితో మనం వ్యవహరించవచ్చు. అందువల్ల కొద్దిరోజులు ఈ రౌడీ కుర్రాళ్ళని గురించి సమాచారం సేకరించడంలోనే నేను గడిపాను. నా ప్రయాస తగినంత ఫలించిందనే చెప్పాలి.

ఈ 'దుష్టచతుష్టయం'లో రారాజు దుర్యోధనుడు సురేశ్ అనేవాడు. సుమారు ఐదడుగుల పదంగుళాలు పొడవుండి, పుష్టిగానే ఉంటాడు. ఒకరు చూపించగా నేను ఈ నలుగురినీ కొద్దిదూరంలో నుంచి చూశాను. ఈనాటి ఫాషనుకి తగ్గట్లు పొడుగు జుట్టు, గడ్డమూ పెంచక, మామూలు క్రాపింగ్‌తో మీసాలు మాత్రం పెద్దవిగా, గుబురుగా పెంచుతాడు. ఆ మీసాలూ, దట్టమైన కనుబొమ్మలూ, కొద్దిగా ఎరుపెక్కిన మిడిగుడ్లు కొట్టొచ్చినట్లు కనపడతాయి. గుర్తుంటాయి కూడా. అతడి దగ్గర ఉంటే మనకి కలిగే భావం శరీరబలం యొక్క ప్రాధాన్యమూ, మొరటుతనమూ, నిర్దాక్షిణ్యమూను. కళ్ళల్లో ఎరుపుకి కారణం అతను తరచు పుచ్చుకునే బీరు, బ్రాందీ వగైరాలంటారు. ఎక్కువగా మాట్లాడడు. మాట్లాడినప్పుడు బూతుపదం ఊతంలేకుండా మాట్లాడడు. నవ్వితే రావణాసురుడు నవ్వినట్లుంటుంది. ఆ నవ్వుని సినిమాలు చూసి జాగ్రత్తగా అభ్యసించాడని కూడా చెబుతారు.

చదువు పదో తరగతి వరకూ ఏఢోకా లేకుండా సాగిందట. అందుకతడు బాధ్యుడు కాడు. అతని ఉపాధ్యాయులే ఏయేటికాయేడు పైతరగతిలోకి తోయడం తమ బాధ్యత,క్షేమమూ కూడా అనుకున్నారు. పదో తరగతి దగ్గర మాత్రం వారి ప్రయత్నం సాగలేదు. సురేశ్ తండ్రి దృష్టిలో చదువుకి పెద్ద విలువలేదు కాబట్టి కొడుకు పరీక్ష తప్పాడంటే ఆయన ధాం ధూం అనలేదు. 'అంత హడావుడిగా పాసై ఏమి చేయాలి' అన్నట్లు ఊరుకున్నాడన్న మాట. కాని మూడో సంవత్సరం కూడా తప్పడం తన ప్రతిష్టకి దెబ్బగాఎంచి, కాపీలు అందివ్వడం వగైరా ఏర్పాట్లు పకడ్బందీగా చేయించి కొడుకు ఉన్నత పాఠశాల విడిచి వెళ్ళేటట్లు చేశాడు. ఆ తరువాత సురేశ్ రెండేళ్ల ఇంటర్ మీడియేట్ నాలుగేళ్ళలో పూర్తి చేసి ఇప్పుడు బి.ఎ. మొదటి సంవత్సరం చదువుతున్నాడు. పాఠశాలలోనూ, కళాశాలలోనూ అతని సహాధ్యాయులెందరో చాలా పైకిపోయారు. ఒకరిద్దరు అతనికే లెక్చరర్లుగా వచ్చారు. అది కూడా ఒక గొప్ప విషయంగా చెప్పుకుంటాడతను. మాస్టర్లనే ఒరే అనే అవకాశం ఎవరికుంటుంది! అతనికి ముఖ్యంగా కావలసింది 'స్టూడెంట్' అన్న ముద్ర, అంతేకాని డిగ్రీలూ కాదు, శ్రేణులుకాదు. స్టూడెంట్‌గా ఉన్నంతకాలం సంపూర్ణస్వేచ్ఛ అనుభవించే ఒక ప్రత్యేక హక్కు తనకుంటుందని అతని భావన. సంపూర్ణస్వేచ్ఛఅంటే బాధ్యతలేమీ గుర్తించనక్కర్లేకపోవడం, తనకెలా బుద్ధిపుడితే అలా తిరగడమూ చేయడమూ అని అతని అర్థం. ఎటువచ్చీ ఆ సంపూర్ణస్వేచ్ఛ కావాలనుకునే అనేకులకన్నా దానిని సార్థకం చేసుకునే స్తోమతు అతనికుంది, ఇతరులకుండదు, అంతే.

దానికి కారణం అతని తండ్రి వరప్రసాదరావు. ఆయన మొదటి భార్య కొన్నాళ్ళు కాపురం చేసి నిస్సంతుగానే చనిపోయిందట. తరువాత ఆయన ఆపిడ చెల్లెలినే పెళ్లాడాడు. ఆమెవల్ల కలిగిన వాడే ఈ సురేశ్. రెండవ భార్య కూడా కొడుకు ఏడెనిమిదేళ్లవాడుగా ఉన్నప్పుడు పోయింది. వరప్రసాదరావు ముచ్చటగా మూడో పెళ్ళి చేసుకున్నాడు. ఈసారి వేరే కుటుంబంలో ఆమెని. ఆమెకు ఇద్దరు ఆడపిల్లలు. సురేశ్ తల్లి బతికున్నంతకాలమూ ఒక మాదిరి అదుపులో క్రమంలో బాగానే

పెరిగాడట. కానీ ఆమె పోయినప్పటినుంచీ తెగినగాలిపటంలా అయ్యాడట. సవతి తల్లికీ అతనికీ మధ్య వైముఖ్యం పరస్పరం సమానస్థాయిది. అటు తండ్రి ఇంట్లో ఖర్చుకి కావలసిన సొమ్ము ఎంతైతే అంత ఇచ్చివేయడమే కాని ఆపైన ఇంటి విషయాలు పట్టించుకునే తత్త్వంకాదు. కొడకంటే ఆయనకు వల్లమాలిన ప్రేమ. ఆ ప్రేమ వ్యక్తమయ్యేది ఎవరైనా సురేశ్‌ని పల్లెత్తుమాట అంటే వాళ్ళని నిలువునా చీరేసి నిలువులోతున పాతిపెట్టేసినంత పనిచేయడం ద్వారా మాత్రమే.

వరప్రసాదరావు తన తల్లిదండ్రులకి ఎంతో కాలానికి సంతానం కలగకపోతే చివరికి ఎవతో ఫాదరీ ఉపదేశం మీద ఏసుక్రీస్తును ప్రార్థిస్తే పుట్టినవాడు. అందుకే ఆ పేరు. తల్లిదండ్రులు క్రైస్తవులుగా మతం పుచ్చుకోలేదు. పైకి హిందువులుగానే చలామణీ అయ్యేవారు. ఏసుక్రీస్తుని మాత్రం పూజించేవారు. వరప్రసాదరావు దగ్గరికి వచ్చేసరికి అతనికి అటు ఏసుక్రీస్తుమీద గురిలేకపోయింది, ఇటు హిందూదేవతలమీద భక్తి ఏర్పడలేకపోయింది. పదేళ్ళవయసు నుంచీ, అంటే నాయిష్టం అని గట్టిగా చెప్పడం మొదలుపెట్టిననాటి నుంచీ అతను చర్చికి పోలేదు. అప్పుడప్పుడు దేవాలయాలకి వెళ్లేవాడు. ఉత్సవాలూ, వేడుకలూ చూసివచ్చేవాడు. అతని తోటివాళ్లందరూ హిందువులేకాబట్టి వాళ్లసరదా తీర్చేందుకూ, వాళ్ల అల్లరిలో పాల్గొనేందుకూ అలా చేసేవాడు. ఏసుక్రీస్తు అతని తల్లిదండ్రులకి అతనిని ప్రసాదించాడు కాని, అతని తల్లిదండ్రులు అతనికిచ్చినది ఏమీ లేదు - బలమైన చేతులూ కాళ్లూ తప్ప. వాటితో అతను కూలీగానే జీవితం ప్రారంభించాడు.

ఆయన్ని కూలీగా చూసినవారూ, అతని చేత పని చేయించుకున్నవారు కొందరు ఇప్పటికీ ఉన్నారు. కాని ఆ విషయంపైకి చెప్పేదమ్ములు ఎవరికీ లేవు. కారణం ఆయన ఈవేళ చాలా పెద్ద కంట్రాక్టరు. కూలీ చేస్తూ చేస్తూ మేస్త్రీ అయ్యాడు. మేస్త్రీఅయిన కొద్దికాలానికి చిన్న చిన్న కంట్రాక్టులు చేయడం మొదలుపెట్టాడు. అంతే... ఉన్నట్లుండి పెద్ద కంట్రాక్టరు అయిపోయాడు. అంత హఠాత్తుగా అంత ఎత్తు ఎలా ఎదిగిపోయాడో మిస్టరీగానే మిగిలింది ఈనాటికీ. అనేక ఊహలు చలామణిలో ఉన్నాయి. అతను దొంగనోట్ల వ్యాపారంచేసి ఆ డబ్బు భారీ లంచాలకూ వాటికీ వాడి ఇంతవాడయ్యాడంటారు. మరికొందరు బంగారం, మత్తుమందుల దొంగవ్యాపారం ద్వారా కోట్లు గడించాడంటారు. ఇప్పటికీ అతనికి స్మగ్లింగ్‌తో సంబంధాలు పూర్తిగా తెగిపోలేదంటారు వాళ్లు. ఇంకొందరు అతను కీలకమైన వ్యక్తులకి అమ్మాయిలను తార్చి కంట్రాక్టులు ఒళ్ళోవేసుకొని అటు ప్రభుత్వానికీ, ఇటు ప్రజలకీ మోసంచేసి తను శిఖరం ఎక్కి కూర్చున్నాడంటారు. ఏమైతేనేం ఇప్పుడతను పెద్ద కంట్రాక్టరు కాదు చాలా పెద్ద కంట్రాక్టరు. ఇప్పుడు తన చేతులకు బురద అంటకుండానే కావలసిన ఛండాలపు పనులన్నీ నమ్మకమైన తాబేదార్ల ద్వారా చేయిస్తూ ఉంటాడు. ఈ ఊళ్లోనే ఆయనకి తానున్న బ్రహ్మాండమైన భవంతికాక ఇరవై ఇళ్లూ, ఒక సినిమా హాలూ, ఒక బియ్యపు మిల్లూ ఉన్నాయి. ఇంకా ఎన్నో కంపెనీల్లో వాటాలున్నాయి. ఇన్ని పనులు ఒక చేతిమీదుగా ఎలా నడిపిస్తున్నాడంటే ఆయనకి నమ్మకమైన బంట్లు ఉన్నారనుకున్నాం కదా. వాళ్లకి బాగా ముట్టజెబుతాడు కూడా. కానీ వీసమెత్తు తేడా వస్తే మాత్రం చంపిపాతర వేసినంత పనిచేస్తాడు. అందువల్ల ఒళ్లు దగ్గరపెట్టుకొని ఎంతో విశ్వాసంతో పనిచేస్తారు. ఆయన చేతిలో ఒక రౌడీ సైన్యం కూడా ఉంది. వాళ్లలో కొందరికి ఆ పూటకి మస్తుగా సారా తాగిస్తామంటే చాలు మనిషిని మసి చేసివస్తారు.

వరప్రసాద్ ఎప్పుడూ తాగే ఉంటాడు. అందుకే కళ్లు చింతనిప్పుల్లా ఉంటాయి. బుగ్గమీసాలు కూడా వాటికి తోడై ఎదుటఉన్నవాడిలో వణుకు పుట్టిస్తాయి. అతడు గొణుగుతాడే కానీ స్పష్టంగా మాట్లాడడు. ఆ గొణుగుడిని సరిగా అర్థంచేసుకొని ఇతరులకు వివరించేవారూ, ఆజ్ఞలు అందజేసేవారూ ఒకరిద్దరు ఎప్పుడూ అతనికూడానే ఉంటారు. అటువైపు ఆయన తన దానాలతో, విరాళాలతో సమాజాన్ని కట్టేసుకుంటాడు. ఆ ఇచ్చేటప్పుడు కూడా తనకి ఇదో లెక్కకాదన్నట్లు ఒక చేతివిసురుతో ఇస్తాడు. ఎంత గొప్ప చెయ్యో అనుకుంటారు




లబ్ధిపొందినవాళ్లు. అలా అడిగినవాళ్లందరికీ లెక్కలేకుండా ఇస్తే మేరు పర్వతమంతటి ఆస్తి ఎక్కువకాలం నిలబడదే అని ఆశ్చర్యపోవచ్చు. ఇక్కడ ఒక కిటుకు ఉంది. ఎవళ్లకైతే దానాలు, విరాళాలు ఇస్తే యజమానికి ప్రయోజనకరంగా ఉంటుందో, పేరుప్రతిష్టలు వస్తాయో, వాళ్లనే ఆయన సమ్ముఖంలోనికి పోనిస్తారు ఆయన నమ్మినబంట్లు. తక్కినవారు నిజంగా ఎంత ఆర్తిలో ఉన్న దీనులైనా - ఆ యింటి దాపులకు రాకుండా జాగ్రత్తపడతారు. అందువలన ఆయన దాతృత్వ లక్షణానికి అనంతకీర్తి లభిస్తూనే ఉంది.

ఇక రాజకీయనాయకులతో- ముఖ్యంగా మంత్రులతో ఆయనకి మంచి దోస్తీ అని వేరేచెప్పనక్కర్లేదు. బయటి ఊరినాయకులు ఆయన ఇంట్లోనే విడిదిచేస్తారు. మంత్రులతో, పెద్దనాయకులతో కూడా ఆయన అదే గొణుగుడుగా మాట్లాడతాడా అని నాకు సందేహం కలిగింది. వారి ముందు స్పష్టంగానే మాట్లాడతాడనే నాకు తోచింది. ఆ గొణుగుడు సామాన్యులకోసమే, అది ఆయన ప్రతాపం చాటిచెప్పే చిట్కాయే అనిపించింది. అధికారపక్షానికి ఘనంగా నిధులు సమకూరుస్తాడు. ఇతరవిధాలా (అంటే తన అంగబలంతో) సహాయపడతాడు కాబట్టి ఆయనకి అత్యున్నత మందిరాల్లోకి కూడా నేరుగా ప్రవేశం లభిస్తుంది. ఆయన ప్రతిపక్షాలలో కూడా కొందరు ఎన్నుకున్నవారికి నిధులు అందజేస్తాడట. అందుకే వారినుంచి కూడా సాధారణంగా ఆయనకి వ్యతిరేకంగా పెద్ద విమర్శలురావు. ఆయనపట్ల కృతజ్ఞతాభావంతో కౌన్సిల్ ఉన్నరోజుల్లో అధికారపక్షం ఆయనకి ఎం.ఎల్.సి పదవి ఇద్దామనుకొని, పునరాలోచనమీద అది ఆయనకి మరీ చిన్నపదవి అని ఆ ప్రతిపాదన విరమించుకుంది. ఎప్పుడో మంత్రి పదవే ఆయనను వరిస్తుందని భరోసా ఇచ్చింది. ఆయనే అంత సుముఖత వ్యక్తపరచలేదు. ఆయనకి ఇంగ్లీషు ఒకమాదిరిగా అర్థంఅవుతుందికాని అందులో మాట్లాడలేడు. తెలుగైనా ఆయన కూలీ రోజులభాషగానే ఉండిపోయింది. అది ఆయనకొక ప్రత్యేకతనే చేకూర్చిందనాలి. ఆయన మాట విచిత్రమైన వాడితోనూ, జీవత్వంతోనూ తొణికిసలాడుతుందని అభిమానులు శ్లాఘిస్తారు.

పోలీసు అధికార్లు ఆయనని తరచు కలుసుకొనిపోతూ ఉంటారు. లేకపోతే వాళ్లకు ట్రాన్స్‌ఫర్లు తప్పవని తెలుసు. గతంలో ఆయనకు కోపంతెప్పించిన అధికారులు, పోలీసులూ ఇతరులు ఊరువిడిచి పారిపోయారు. ఒకరిద్దరి జాడ ఇప్పటివరకూ తెలియలేదట. అవి హత్యలే అయి ఉంటాయనీ, వాటివెనక వరప్రసాదరావు హస్తముండి ఉండవచ్చుననీ ఊళ్లో వాళ్లు చెవులు కొరుక్కుంటారు. కాని ఏదీ రుజువుదొరకలేదు... దొరకదు కూడా. అందువల్ల వరప్రసాదరావు అంటే సందేహం, భయం, కొద్దిపాటి గౌరవం కలగాపులగమైన మిస్టీరియస్ వాతావరణం ఆయన చుట్టూ నెలకొని ఉంది.

అలాంటి ఆయనకొడుకు తండ్రిగుణాలు పుణికిపుచ్చుకుంటాడంటే ఆశ్చర్యం ఉండదు కదా. చిన్నప్పటినుంచి సురేశ్‌కి ఆజ్ఞాపిస్తున్నట్లు మాట్లాడటమే అలవాటు. తనకి నచ్చితేనే ఇతరులమాట వింటాడు. ఇతరులెవరైనా ఆజ్ఞాపిస్తున్నట్లు మాట్లాడితే మంచికైనా, చెడ్డకైనా తక్షణం తిరగబడతాడు. అతను హైస్కూల్లో చదువుతున్నరోజుల్లోనే ఒకమారు తన స్నేహితుడొకడికీ ఊళ్లోని ఒక పెద్ద దుకాణపు యజమానికీ ఏదో చిన్నతగాదా వస్తే తాను జోక్యంచేసుకొని తన ముఠాతో వెళ్లిపడి, షాపు యజమానినీ, పనివారినీ చితకకొట్టివచ్చాడు. పైపెచ్చు తన పాఠశాల విద్యార్థుల్ని రెచ్చగొట్టి ఆ షాపుమీద దాడిచేయించి సర్వనాశనం చేయించాడట. మొత్తంమీద అది విద్యార్థుల వ్యవహారంగా చలామణీ కావడంతో ఎవరికీ శిక్షలుపడలేదు. తదాదిగా సురేశ్ అంటే ఊళ్లో వాళ్ల గుండెల్లో దడబయలుదేరింది.

తండ్రికి బతికి ఉన్న మూడోభార్యకాక ఆ ఊళ్లోనే ఒక ఉంపుడుకత్తె ఉంది. దీనికితోడు విజయవాడ, హైదరాబాద్, మద్రాసుల్లోకూడా తలొక ఉంపుడుకత్తె ఉన్నారట. అది కూడా ఆయన ప్రతిష్ఠకి నిదర్శనమన్నమాట. ఆయన ముద్దులకొడుకు పదిహేనో ఏటనుంచే వేశ్యాగృహాలు దర్శించడం మొదలుపెట్టి ఒకరిద్దరు ఉంపుడుకత్తెల్ని కూడా ఏర్పాటుచేసుకున్నాడంటారు. విచిత్రమేమిటంటే, సురేశ్ డబ్బు చూసో, పలుకుబడి చూసో లేక కేవలం అతని





మగతనంచూసో కొందరు అమ్మాయిలు కూడా అతని వెంటబడకపోలేదు. ఇద్దరు కాబేలు అతనికి సర్వసమర్పణం చేసుకొని చిక్కులుతె చ్చుకున్నారు. అప్పుడు తండ్రి కొడుకునాదు కొని ఆ రెండు కుటుంబాలకూ బాగా డబ్బు ముట్టజెప్పిఆఊరు విడిచి వెళ్లిపోయేటట్లు చేశా డు. అంతా గుట్టుగా జరిగింది. కాని జనం చెప్పుకోవడం మానలేదు. అయినా స్పష్టమైన ఆధారాలు పైకి రాకపోవడంవలన వదంతులు రెక్కలు విరిగినపక్షులే అయ్యాయి. సురేశ్ జరిగినదానికి కించిత్తు కూడా బాధపడినట్లు లేడట. అతని దృష్టిలో, అతని తండ్రిదృష్టిలో ఆడది కేవలం భోగ్యవస్తువే, పరిచారికే. అందు వల్ల అందితే అనుభవించి వదిలెయ్యడం, అందకపోతే ఏడిపించి సరదాతీర్చుకోవడం అతనికి మామూలు.

ఇక కర్ణుడి సంగతి. కర్ణుడంటే ఆ మహాభా రత వీరాగ్రేసురుని నిరుపమాన దానశీలతా, ఔన్నత్యం గుర్తుచేసుకోకూడదు. ఈ 'దుష్టచతు ష్టయం'లో సురేష్ తరువాతివాడు కాబట్టి కర్ణు డయ్యాడుగానీ, అతని అసలు పేరు పూర్ణ చంద్రరావు. రూపంలో సురేష్కి విరుద్ధం. సన్నగా, పొడుగ్గా, తెల్లగాఉండి అందంగానే ఉంటాడని చెప్పాలి. కాని మేడిపండులా పై అందమేగాని లోపల అంతా కుళ్లు బుద్ధే.

పూర్ణచంద్రరావు పుట్టింది సురేష్లాకాక చదువూసంస్కారాలు కల కుటుంబంలోనే. వాళ్లు మొదటినుంచీ స్థితిపరులే. తండ్రి దశ రథరామారావు పెద్ద హోటలు యజమాని. ఆయనకు నలుగురు కొడుకులూ, ఇద్దరు కూతుళ్లు. అందరిలోకీ ఆఖరువాడే పూర్ణ చంద్రుడు. అందువల్ల అందరికీ అతనంటే అమితగారాబం. దశరథరామారావుకి ఊళ్లో రెండు పెద్ద హోటళ్ళు (లాడ్జిలతోసహా) రెండు సినిమాహాళ్లు ఉన్నాయి. వరప్రసాద రావు సినిమాహాలు మేనేజిమెంటు కూడా వాళ్లే చూస్తారు. వరప్రసాదరావు ఈయన హోట ళ్లలో కొంతపెట్టుబడి పెట్టి తన రౌడీసైన్యంలో కొంతభాగం ఈయన సేవకు వినియోగించాడు కూడా. ఇద్దరూ కలిసి ఎన్నో కంపెనీల్లో పెట్టుబ డి పెట్టారు. ఇద్దరూ కలిసి రెండు తెలుగు సినిమాలు తీశారు. అవి అంత బాగాపోలేదు. ఆ నష్టం వారికి చీమకుట్టడంలాటిది మాత్రంగానే అనిపించింది. కాని ఆ రంగంలో మాత్రం వారికి ఆసక్తి తగ్గిపోయింది. ఇలా రెండుకుటుంబాలకీ మధ్య ఎప్పటినుంచో ఘనిష్ఠ సంబంధాలు సాగుతున్నాయి.

దశరథరామారావు ముగ్గురు కొడుకులకీ, ఇద్దరు కూతుళ్లకీ ఘనంగానే పెళ్లిళ్లు చేశాడు. కట్నాలు ఇచ్చారు, రెట్టింపు పుచ్చుకున్నారు. తన కొడుకుల్నీ అల్లుళ్ళనీ కూడా తన వ్యాపా రంలో ప్రవేశపెట్టారు. ఇప్పుడు ఆయన ఆ ఊళ్ళో ఒక రెండునక్షత్రాల హోటలూ, రాజ ధానిలో ఒక మూడు నక్షత్రాల హోటలూ నిర్మించే ప్రయత్నంలో మునిగి ఉన్నారు. వాళ్లది చదువూసంస్కారాలు కల కుటుంబ మని ముందే అన్నాను కదా. తండ్రీ, కొడుకు లూ, కూతుళ్లూ, అల్లుళ్ళూ అందరూ గ్రాడ్యు యేట్లే. తండ్రి బి.ఎ అయితే కొడుకులు మాత్రం ఇప్పుడు వీస్తున్న గాలినిబట్టి బి.కాంలు. కూతుళ్లిద్దరూ బి.ఎస్.సీలు. అయినా వాళ్లకి ముప్పొద్దులా డబ్బుసంపాదన యావ తప్ప మరొకటి లేదు. అందువల్ల ఆఖరి వాడు ఏమిచేస్తున్నాడు, ఎలా తిరుగుతున్నా డు అన్నది పట్టించుకోవడానికి వారికి తీరికలే దు. దానికితోడు అమితగారాబం కళ్ళుగ ప్పిందాయె.

పూర్ణచంద్రరావుకి తను అందగాడినని తెలుసు. తను అందగాడు కాబట్టి తను కంటితో చిన్న సైగచేస్తేచాలు ఏఆడదైనా తన ఒళ్ళోకి వచ్చివాలాలని అతని అభిప్రాయం. కాబట్టి ఆడది కనిపించగానే ఆమె తనకు పనికివస్తుందా రాదా అని అంచనా వేసుకొని వ్యాఖ్యలు చేస్తూ ఉంటాడు. చోద్యమేమంటే అతనిలో కోరిక ఉన్నా అది తీర్చుకోగల సాహ సంలేదు. కొన్నిసార్లు సురేష్తోకలిసి వేశ్యాగృహా లకు వెళ్లినా నోరుకట్టడిపోయి, గుడ్లప్పగించి చూస్తూ ఉండిపోయాడు. ఇంతవరకూ ఏ అమ్మాయి మీదా చేయివేయలేదు. తిరగబడి చెంప పేలుస్తుందేమోనని భయం. అతడు గట్టిగా బూతుమాటలు ఉచ్చరించలేదు. అందువల్ల ఎప్పుడూ శృంగార స్వప్నాలు కంటూ ఆడపిల్లల్ని ఏడిపించడం ద్వారా కొంత సరదా తీర్చుకుంటాడు. బూతుఫొటోలు, కథలూ, వర్ణనలూ ఉన్న పత్రికలూ, పుస్తకాలూ

కొని చదివి తన స్నేహితులకు కూడా చూపిస్తూ ఉంటాడు. రూపవిన్యాసాలలో భిన్నధ్రువాలైన సురేష్, పూర్ణచంద్రులు పరస్పరాకర్షితుల య్యారంటే పెద్ద ఆశ్చర్యం లేదు. తనకి లేని బలం, ధైర్యం, చొరవా సురేష్‌ద్వారా లభించ డంవల్ల ఎప్పుడూ అతనిని విడిచి ఉండడు.

ఇక దుశ్శాసనుడు మరెవరోకాదు నర సింహులే. వీడిని విడిగా తీసి చూస్తే సున్నా లాంటి వాడు. మరొకనితో కలిసినప్పుడే వాడికి ఎక్కడలేని బలం వస్తుంది. వాడిలో ఏవిధ మైన ప్రత్యేకతాలేదు. నీతి నియమాలు అంటే ఏ పప్పుదినుసులు అని అడగగలతత్వం. నల్లనివారైనా అందంగా ఉండేవారెందరో ఉన్నారు. కాని ఇతని నలుపులో ఏ మెరుపూ లేదు. వివర్ణమైన నలుపంటే బాగుంటుందేమో. కను ముక్కు తీరులోకూడా ఆకట్టుకునేది ఏమీలేదు. సురేష్ విష యంలోలా ఒక బలమైన శారీరక వ్యక్తిత్వం అన్న భావంకూడా మనకి తోచదు. మామూలు పొడవూ, మామూలు లావూ, చదువులోమాత్రం సురేష్‌తో కలిసే అడుగేస్తున్నాడు. కాపీలు చేయడంలో దిట్ట. కాని ఏమిటికాపీ చేయాలి. ఎక్కడనుంచి ఎక్కడికి చేయాలి అన్నది తెలి యకపోవడంవల్ల కొన్నిసార్లు పానులిస్టులో నంబరు చూడలేకపోయేవాడు. అక్కడికీ మాస్ట ర్లని బెదిరించి మార్కులు వేయించుకొని పరీక్ష లు దాటిన ఘట్టాలు ఉన్నాయి. అయినా పడుతూలేస్తూ ఇప్పుడు సురేష్ తరగతిలోనే ఉన్నాడు. ఇన్ని 'సుగుణాలు' ఉన్నవాడు శ్యా మలలాంటి చక్కని చుక్కనెలా ఆశించాడని ఆశ్చర్యం కలగవచ్చు. మగవాడై ఉండటమే తనకున్న గొప్ప అర్హత అని అతని భావం. ఆ దృష్టితోనే ఆమెజీవితంతో చెలగాటమాడి అది అర్ధాంతరంగా ముగిసేటట్టు చేశాడు. అయినా ఏమైనా పశ్చాత్తాపపడుతున్నాడా అంటే అది తెలివితక్కువే. ఆడవాళ్లని వేధించడంలో ఇప్పుడు మరింత ఉత్సాహంతో పాల్గొంటున్నా డు. అతనికి ఆస్తిపాస్తులూ గొప్పగాలేవు. తండ్రి యాదగిరి వరప్రసాదరావు మీద ఆధారపడ్డ చిన్నకాంట్రాక్టరు. మొదట్లో ఏమోకాని తరు వాత వరప్రసాదరావు ఎన్నడూ తనేదౌర్జన్యం చేసిన దాఖలాలు లేవు. యాదగిరి అలాకాదు. తను రౌడీనని చెప్పుకుంటాడు. రౌడీలాగే వ్యవ హరిస్తాడు. ముందు ఒకటి వేసి మరీ మాట్లాడ తాడు. నోరు విప్పితే బూతులే. అందుకే జనం అతనిని చూస్తే ఏ పామునో చూసినట్లు దూ రంగా తప్పుకుంటారు.

ఇక ఆ 'దుష్టచతుష్టయం'లో మిగిలినవా డు నాగేంద్రం- మహాభారతంలోని శకుని అయితే మహా జిత్తులమారి. అసలు భారతం సగం కథ అతనిమీదే ఆధారపడుతుంది. నాగేంద్రునికి జిత్తులూ, తెలివితేటలూ అలా ఉంచి మామూలు బుర్రకూడా తక్కువ. చిన్న సైజు పర్వతంలా ఉంటాడు. నడకకూడా పర్వతం కదిలితే ఎలా ఉంటుందో అలాగే ఉంటుంది. అంత భారీశరీరానికి తల చాలా చిన్నది. వానరులతో మనకి సన్నిహిత సంబంధముందని చెప్పే పరిణామ సిద్ధాంతా న్ని రుజువుచేసేందుకన్నట్లుగా నుదురు వెన క్కి, మూతి ముందుకీ, పెద్ద పళ్ళూ, చిన్నగ డ్డం, నిక్కపొడుచుకునే వెంట్రుకలతో కోతివా లకం కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది. అతనికి స్వ యంగా ఆలోచించుకునే శక్తితక్కువకదా. ఎవ రినైనా కొట్టిరమ్మంటే వెనకాముందూ చూసుకో కుండా వెళ్ళి ఆపని చేసుకువచ్చేస్తాడు. మెడ బట్టుకు ఈడ్చుకురా అంటే అలాగే ఈడ్చుకు వచ్చేస్తాడు. అతని తండ్రి కిల్లీకొట్టు యజ మాని. వరప్రసాదరావు రౌడీసైన్యంలో ఒక సిపాయి. ఆయన తరఫున స్మగ్లింగ్‌లో పాల్గొంటాడని ప్రతీతి. నాగేంద్రంకూడా అప్పు డప్పుడు కిల్లీకొట్టులో కూర్చొని తక్కిన సమయ మంతా సురేష్‌తోనే గడుపుతాడు. అంత గొరి ల్లా లాంటివాడూ కంటికి కాస్త సదరుగా, ఆడది కనిపిస్తే చాలు ఇట్టేపసికట్టి ఆ పిట్టని గుర్తించిన వార్త 'బాస్'కి తెలియజేస్తాడు. ఆ పైన అంతా 'బాస్' ఇష్టం.

* * *

శత్రువు గురించి పైసమాచారమంతా ఒక మారు పునస్సమీక్షచేసి చూసుకున్నాను. ఒక్క సారిగా నన్ను భయం ఆవరించింది. అర్థ బలం, అంగబలం, రాజకీయపు పలుకుబడీ ఉన్న ఈ ప్రబల శత్రువుని నేనెదుర్కోవడమే మిటి? నాకెవరు తోడు వస్తారు? నాకుటుంబం ఏమికావాలి? ఇలా చాలాసేపు మనస్సులో గుంజాటనపడుతూనే ఉన్నాను. నాకు శ్యామల ప్రశ్న- "మాస్టారూ నాకు మాత్రం బతికే హక్కు

లేదా'' ఆ ప్రశ్న అడుగుతున్నప్పుడు ఆమె చూసిన చూపూ, పెల్లుబుకుతున్న కన్నీళ్లు హృదయంలోపొడుస్తూ ఉన్నాయి. చివరికి ఒక తెగింపుకి వచ్చి ఏమైనా సరే ముందుకు సాగవలసిందే అని నిశ్చయించుకున్నాను.



ముందు లక్ష్మీపతితో ప్రారంభిద్దామనుకున్నాను. ఆయన ఘటనాస్థలానికి దగ్గరగా ఉన్నవాడు, కొంతైనా శ్యామల విషాదగాథలో ఆసక్తిచూపినవాడూను.

లక్ష్మీపతి గుమ్మందగ్గర బెల్లుబటన్ నొక్కుతూ శ్యామల వాళ్ళ గుమ్మంకేసి చూశాను. అక్కడ సందడి ఏమీలేదు.

లక్ష్మీపతే తలుపుతీశాడు. "ఏమిటండోయ్ మాష్టారూ, ఇలా మామీద కరుణ కలిగింది! చాలాసంతోషం- దయచేయండి'' అన్నాడు లోపలికి దారితీస్తూ.

ఆయన కొత్తగా కొన్నదేదో నాకు చూపించాలని లాక్కుపోతే వెళ్ళడమేకాని నాఅంతట నేనెప్పుడూ ఆయన ఇంటికి వెళ్ళలేదు. అదే ప్రథమం. "ఏమిటి విశేషం? ఊరకరారు మహాత్ములంటారు'' అంటూ నవ్వాడాయన.

"నన్ను మహాత్ముడిని చేయకండి. బక్కబడి పంతుల్ని, అతిసామాన్యుణ్ణి. ఊరికేనే ఇటుపోతూ ఒకసారి మిమ్మల్ని చూసిపోదామనుకున్నాను'' అని చెప్పాను నేను.

అన్నదే తడవుగా- "ఏమైతేనేం, మామీద దయకలిగింది- అటుచూడండి'' అన్నాడాయన టీవీ ట్రాలీకేసి చూపిస్తూ.

నేను అటుచూశాను కాని ఆయన దేనిని ఉద్దేశించి అంటున్నాడో తెలియక ప్రశ్నార్థకంగా చూశాను.

"మధ్యఅరలో కనబడటంలేదూ? ఏమిటనుకున్నారు అది? వి.సి.పి అండీ''

"కొత్తగా కొన్నారేమిటి?'' అని అడిగాను.

"ఇంకా కొనలేదండీ, బేరం జరుగుతోంది. స్మగుల్డు. ఏడువేలు చెప్తున్నాడు. నేను ఆరువేలు అంటున్నాను. మరోమూల వి.సి.పి ఏమిటి వి.సి.ఆర్ కొనుక్కుంటే మంచిదేమో అనికూడా అనిపిస్తోందండీ'' అని ఆయన లేచి వెళ్ళి టీవీకి అటూఇటూ కిటికీల తెరలు లాగి కాసెట్టుపెట్టి స్విచ్ఆన్‌చేశాడు. తెలుగు సినిమా రాసాగింది. డాన్సులతోనే ప్రారంభమైంది. కొట్లాటలూ, కార్లుతరమడాలూ పుష్కలంగా ఉండేటట్లున్నాయి. ఇప్పుడు మూడు గంటలు ఈ ఫార్ములామసాలాచూడాలికాబోలురా దేవుడా! వచ్చినవిషయం ఎలా ఎత్తడం? అని నాలోనేను అనుకుంటూంటే అరగంట అయ్యేటప్పటికి ఇంట్లోనుంచి కాఫీ వచ్చింది.

ఆవంకన "సినిమా ఆపెయ్యండి, నాకు తెలుగుసినిమాలు అంతగా నచ్చవు, ఇలాంటివి మరీను'' అన్నాను. ఆయన చిరునవ్వు నవ్వి సినిమా ఆపుచేసి వచ్చాడు.

"శ్యామల పోయిన తరువాత ఆ ఇంట్లోవాళ్ళు ఎలాఉంటున్నారు?'' అని అడిగాను నేను అసలువిషయానికి ఉపక్రమిస్తూ.

"ఆ సవతితల్లీ, పిల్లలూ ఏదోఒకరోజు, ఎవళ్ళో పరామర్శకి వచ్చినప్పుడూ కల్లబొల్లిదీర్ఘాలు తీశారు. కాని వాళ్ళదారిలోనుంచి పెద్దఅడ్డంకి తొలగినట్లే అనుకుంటూ ఉంటారని వేరే చెప్పాలా? ఆయనమాత్రం-ఎంతైనా కన్నతండ్రికదండీ- రెండురోజులు పిచ్చివాడిలా తిరిగాడు కాని మెల్లగా సంసారతాపత్రయంలో తిరిగి పడి మామూలువాడైపోయాడు. ఆయన లేనప్పుడు ఇంట్లోనుంచి నవ్వులూ, కేరింతలు వినవస్తూ ఉంటాయి. ఇప్పుడా ఇంటికి వచ్చిన వారికి ఇటీవలే అక్కడ ఒక ఘోరం జరిగిందని తెలియనేతెలియదు'' అన్నాడాయన.

"ఆపిల్లకథ అంతటితో ముగియవలసిందేనా?'' అన్నాను నేను.

"అంతేఅనుకోవాలి. ఇక ఎవరైనా చేసేది ఏముందికనక?''

"ఆమె అన్యాయమైన చావుకి బాధ్యులైన





వారికి శిక్షపడొద్దూ-?''

''శిక్షపడితే మంచిదే, కాని ఎవరు శిక్షించేది? ఆశిక్షించేవాళ్ళే వాళ్ళచేతుల్లో ఉన్నారాయె. ఇక భగవంతుడంటారా, ఆయన కూడా ఈ కలియుగంలో వాళ్ళపక్షానే ఉండి ఉండాలి, లేకపోతే దీర్ఘనిద్రలోనైనా ఉండి ఉండాలి''.

''అలా అని కూర్చుంటే దారుణాలుచేసేవారు మరింత చెలరేగరూ?''

''మీరన్నది నిజమేకాని ఎవరేమిచేయగలం జరిగేది చూస్తూ ఉండడం, మనదాకా రాలేదుకదా అని సంతోషించడంతప్ప. ఇంతకీ అసలువాళ్ళకే లేనప్పుడు మధ్యలో మనకెందుకండీ ఈ బాధ. వాళ్ళయినా పోయినది ఎలాగైనా తిరిగిరాదు, ఉట్టిపుణ్యాన మరిన్ని బాధలు కొనితెచ్చుకోవడమెందుకని ఊరుకొని ఉంటారు,''అన్నాడాయన.

''అసలువాళ్ళంటే ఎవరండీ. ఆ సవతితల్లీ, పిల్లలకీ ఒకఅడ్డంకి తొలగిందన్న సంతోషం తప్ప వేరే ఉండదని మీరే అన్నారుకదా. ఇక ఆ తండ్రి ఒక్కడు నిస్సహాయుడు. ఆయన ఏమిచేయగలడని మనమాశించగలం? నేనడిగేది చుట్టూ ఉన్న సమాజం ఊరికే చూస్తూ కూర్చోవలసిందేనా అని. ఈవేళ ఆ కుటుంబం దాడికి గురైంది. రేపు మనకుటుంబాలమీదే దెబ్బపడవచ్చు. అప్పుడు మన పరిస్థితి ఏమవుతుంది?'' అన్నాను నేను.

ఆయన 'మనకుటుంబాలమీదే' అని నేనన్నప్పుడు ఒక్కసారి ఉలిక్కిపడ్డట్టయ్యాడు. కొంచెం గంభీరవదనంతో ఒక నిమిషం ఆలోచనలోపడి తరువాత అన్నాడు ''మాష్టారూ... కాసేపు మనం గ్రాడ్యుయేట్లం, ఉపాధ్యాయులం అన్నమాట మరచిపోదాం. గొప్ప విషయాలను గొప్పగా చర్చించిన, మనం చదివిన పుస్తకాలమాట కూడా మరచిపోదాం. సామాన్య మానవులంగా ఆలోచిద్దాం. అప్పుడు ఈ సమాజమంటారే అలాంటిది మీకేమైనా కనిపిస్తుందా నిజంగాచెప్పండి. నాకుమటుకు నాకు అలాంటిదేమీ ఎప్పుడూ ఎక్కడా కనబడదు. నాకు ఫలానా సుబ్బారావుగారూ, గోపాలరావుగారూ, నరసింహారావుగారూ, మల్లయ్యా, పుల్లయ్య వగైరాలుకనిపిస్తారేకాని మీరన్న సమాజం మాత్రం కనిపించదండి'' అన్నాడాయన.

''సమాజమనేది వేరే ఉండదుకదండీ! నలుగురూ కలిసికదిలితేనే సమాజం కనిపిస్తుంది'' అని నేను అంటూంటే

''ఎవరా నలుగురు? ఈ దేశంలో పాడెమొయ్యడానికి నలుగురు కలుస్తారేమోకాని ఇతరత్రా ఎన్నడూ కలవరన్నాడట ఎవరో మహానుభావుడు. అది అక్షరాలా నిజమనిపిస్తుంది. అవునంటారా... కాదంటారా?'' అని ఆయన అడ్డు ప్రశ్న వేశాడు.

''నలుగురు ఒక్కసారి కూడకపోవచ్చు. ఎవరో ఒకరు ముందు దారితీస్తే'' అని నేను ఇంకా చెప్పబోతూంటే ఆయన మళ్ళీ అడ్డు వచ్చాడు.

''ఎవరు ముందు దారితీయడం? పిల్లికి మెడలో గంట కట్టేదెవరు?''

''ఏం... మీరూ, నేనూ కావచ్చు. మనిద్దరం బయటికివచ్చి నిలబడితే మరో ఇద్దరు వచ్చి చేరతారు. ఆపైన మరో ఇద్దరు—''

''నేను చెప్పలేదూ- మీరు ఏదో పనిమీదే వచ్చారని'' అని బిగ్గరగా నవ్వాడు లక్ష్మీపతి - ''అయితే ఆ అమ్మాయి గురించి ఏదో చేయాలంటారు- అవునా?''

''అవునండీ... ఆ అమ్మాయి ఒక దుండగుడి తప్పిదానికి బలైపోవడమూ, దుండగుడు మాత్రం హాయిగా స్వైరవిహారం చేస్తూ ఉండటం- ఇది నాకు చాలా బాధ కలిగిస్తోందండీ! ఆ అమ్మాయి ప్రశ్నా ఆమె దీనత్వంతో నిండిన చూపూ నా కళ్ళముందెప్పుడూ ఆడుతూంటాయండీ''.

లక్ష్మీపతి కొంతసేపు మాట్లాడలేదు. తరువాత మెల్లగా అన్నాడు- ''మాష్టారూ... మీ హృదయం ఎంతో విశాలమైనది. మీ మనస్సు ఎంతో సున్నితమైనది. అందుకే ఈ విషయమై ఇంతగా బాధపడుతున్నారు. కాని మీకు జీవిత కఠిన యధార్థాలు ఇంకా అనుభవమైనట్లు లేదు. ఈ లోకంలో జీవించడానికి మీరు గుండెను గట్టిపరచుకోవలసేవస్తుంది; మనస్సుని కొంత మొద్దుబరచుకోవలసే ఉంటుంది. రోజూ వార్తాపత్రికల్లో ఎన్ని అన్యాయాలూ, దారుణాలూ గురించి చదువుతాం. అంతెందుకు... ఈ వీధి ఒక్కటే తీసుకోండి. ఈ

వీధిలో ఉన్నవాళ్లనందరినీ అడిగి చూడండి. ప్రతివాడూ ఏదో కష్టగాథా, అన్యాయమూ చెప్ప కుండా ఉండడు. ఈ లోకంలో జరిగే అన్యాయాలకూ, ఘోరాలకూ బాధపడుతూ ఏడుస్తూ కూర్చుంటే మన జీవితంకాదుకదా, వెయ్యి జీవితాలు కూడా చాలవు. మీరూ నేను ముందు వీధిలోకి వచ్చి నిలబడితే చాలునన్నారు మీరు. కాని మీరూ నేనూ ఎంతండి, సముద్రంలో కాకి రెట్టంత! మనవెనుక ఎవరూరారు. కావలిస్తే రాసి ఇస్తాను. మనమే అన్యాయంగా మసి అయిపోతాం. మాష్టారూ... మీరేకాదు మొదటిసారి ఇలా ఆలోచించినది. ఇంకా జీవితం పూర్తిగా అంతుబట్టకుండా ఉన్నప్పుడు ఏదైనా అన్యాయం చూస్తే ఏదో చేయాలని ఉబలాటపడటం సహజం. నేనూ మొదట్లో అలా అనుకున్నవాడినే. కాని మనం ఏమీ చేయలేమని తెలిసిరావడానికి ఎంతో సమయం పట్టదు. అందుకే . ఉన్నంతలో ఎవరిమట్టుకువారు జీవితం ఎలాగో అలా నెట్టుకురావడంలోనే లీనమైపోతారు. జరగనిదానికోసం ప్రయత్నించి ఆశాభంగంచెందడంకంటే అలాంటి ప్రయత్నం చేయకపోవడమే మంచిది. మనకు, ఎవళ్ళమట్టుకి వాళ్ళకు బోలెడన్ని సమస్యలూ, బాధలూ ఉండగా మరిన్ని తెచ్చి నెత్తినవేసుకోవడం దేనికి? ఆ అమ్మాయి మళ్ళీ తిరిగిరాదు; మీరామెకోసం చేసేదేమీ ఆమెను చేరదు. ఇక ఈ విషయంలో మీరు చేయగలిగిందేమీ లేదు. ఎప్పుడో అప్పుడు ప్రతివాడూ చావకతప్పదు. అది తలచుకొని ఇప్పటినుంచీ ఏడుస్తూ కూర్చోవడంకంటే జీవితం ఇచ్చే అందం, ఆనందం ఏమైనా ఉంటే అనుభవించడం మంచిది. రెండో విషయం: ఎన్ని వేదాంతాలు చెప్పినా కాదనరాని ఒక జీవితసత్యం ఉందండీ? అది డబ్బు. గొడ్డుకు తిన్నకొద్దీ బలం, మనిషికి ఉన్నకొద్దీ బలం- అన్న సామెత మీరు వినలేదా? ఆ డబ్బు పుష్కలంగా ఉండబట్టే ఆ పెద్దవాళ్ల కుర్రవాళ్ళు ఏమిచేసినా చెల్లుతోంది. డబ్బు మీద నడిచే ఈ లోకంలో డబ్బే గొప్ప అర్హతా, రక్షణా కూడా మాస్టారూ!. డబ్బు ఉంటే ఏదైనా చెయ్యవచ్చు, పొందవచ్చు. అధికారం, పలుకుబడీ కూడా కొనుక్కోవచ్చు. ఆఖరికి న్యాయం కూడా—"

ఆయన హితోపదేశం నాకు నచ్చలేదు. పైత్యజ్వరం ఉన్నవాని నోట్లో పంచదార పోస్తే చేదుగా తోస్తుందంటారు. అలా అనవచ్చు. లక్ష్మీపతి ఇంట్లో అంతటా ఎన్నో రూపాల్లో ఎన్నో అందాల్లో లక్ష్మి తాండవిస్తోంది. స్టీల్ అల్మైరాలు, సోఫాసెట్లు, డన్‌లప్ పరుపులతో డెకొలామ్ మంచాల సెట్లూ, ఫ్రిజ్, వాషింగ్ మెషీన్, కలర్ టి.వి, వి.సి.పి- ఒకటేమిటి ఆయన నిజంగా జీవితం ఇచ్చే సుఖభోగాలన్నీ అనుభవిస్తున్నాడు. ఆయన మొహంలో సంతృప్తి వెల్లివిరుస్తోంది. ఆయన ముందు నేను ఏమి వాదించినా ప్రయోజనం శూన్యం అని నేను గ్రహించాను. గౌరవంగా ఎలా పలాయనం చిత్తగించడమా అని నేను ఆలోచిస్తుంటే, ఎవళ్ళో చాలామంది బిగ్గరగా మాట్లాడుతూ లక్ష్మీపతి కోసం వచ్చారు. ఏ చందాకో, విరాళం కోసమో వచ్చినట్లు ఒకరి చేతిలో ఉన్న రసీదు పుస్తకంవల్ల తెలుస్తోంది. బెల్లం ఉన్న చోటే చీమలుచేరతాయి కదా. లక్ష్మీపతి కూడా మెల్లగా సమాజం శిఖరం ఎక్కుతున్నాడన్న మాట. ఏమైతేనేం, జనం రాక సాకుగా తీసుకొని ఆయన దగ్గర సెలవుతీసుకొని బయటపడ్డాను.

నేను గేటు దగ్గరకు వెళ్లబోతూంటే శ్యామల తండ్రి అప్పుడే బయటికి పోతున్నాడు. నేను వడిగా అడుగులు వేశాను. "నమస్కారమండీ... నేను- ఆరోజు మీ అమ్మాయి పరిచయం చేసిన మాష్టారుని. మీకు కలిగిన విపత్తుకి నేను చాలా బాధపడుతున్నానండీ. ఆమె జీవితం ఇలా అన్యాయమైపోతుందని ఊహించలేకపోయానండీ" అన్నాను నేను.

ఆయన ఆగి తెల్లబోతూ నాకేసి చూశాడు. నన్ను గుర్తు చేసుకున్నట్లున్నాడు. ఆయన కళ్ళలో నీళ్ళుబికాయి. "అంతా ఆ భగవంతుడి లీల బాబూ! ఎవరేమి చేయగలరు? మా రుణం తీర్చుకొని వెళ్లిపోయింది. అంతే మా ప్రాప్తం" అని ఆగి, "సెలవు బాబూ" అని తల వంచుకొని రెండోవైపు వెళ్ళిపోయాడు. నేను ఆయనకేసే కొంతసేపు చూసి మా యింటివైపు మెల్లగా, భారంగా అడుగులు వేశాను.

★ ★ ★

నాకు ఆరంభంలోనే ఆశాభంగం ఎదురైంది. నిరుత్సాహం చెందడం సహజమేకదా.





చిత్రమేమంటే 'ఒక అన్యాయం జరిగింది, దాని గురించి ఏదో చేయాలి' అన్న ఆలోచనేరా కూడదు కాని, ఒకసారి అది మనస్సులో నాటుకుంటే సులభంగా పోదు. మొండిమొక్కలా ఎప్పటికప్పుడు తలయెత్తుతూనే ఉంటుంది. మళ్ళీ ప్రయత్నం చేయకుండా ఉండలేకపోయాను. ఈమారు ఎవరిదగ్గరికి పోదామా అని ఆలోచించాను.

మా పేటలోనే ఒకాయన నాకు తోడ్పడవచ్చునేమో అనిపించింది. ఆయన ఏదో ప్రభుత్వ కార్యాలయంలో పనిచేస్తూ ఉంటాడు. ఉపవృత్తిగా ఉపన్యాసాలిస్తూ ఉంటాడు. ఒకసారి మా పాఠశాలలో మా విద్యార్థులనుద్దేశిస్తూ మాట్లాడాడు. దేశభక్తి, నీతినియమాలూ, క్రమశిక్షణా వగైరాల గురించి అనర్గళంగా ప్రసంగించాడు. ఎన్నో సంస్కృత శ్లోకాలూ, తెలుగు పద్యాలూ ఉదహరించాడు. తెలుగు పద్యాలు రాగయుక్తంగా కూడా పాడాడు. మా విద్యార్థులతోబాటు అక్కడ ఉన్న ఉపాధ్యాయులుకూడా అంతసేపూ మంత్రముగ్ధులైనట్లుండిపోయారంటే ఆశ్చర్యం ఏముంది?

నేను ఆయన ఇంటికి వెళ్ళి నన్ను నేను ఎరుకపరచుకున్నాను. "చాలా సంతోషం మాష్టారూ... మా యిల్లు పావనం చేశారు. మంచిది. ఏ పనిమీద వచ్చారో సెలవివ్వండి-వింటాను" అన్నాడాయన.

నేను శ్యామల కథ పూర్తిగా చెప్పి, రౌడీకుర్రాళ్ల ఆగడాల గురించి చెప్పి నారాక ఉద్దేశమేమిటో కూడా చెప్పాను. ఆయన సాంతం శాంతంగా విన్నాడు.

"ఎంతో ఆనందం వేస్తోంది మాష్టారూ... మీరు తలపెట్టింది సత్కార్యం. మీవంటివారు ఉండబట్టే ఈ సమాజం ఇంకా ఇలా నిలబడి ఉంది. మీరు ధైర్యంగా ముందుకు సాగండి. మీకు విజయం లభించాలని నేను భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను" అన్నాడాయన పంచదార అద్దినట్లున్న గొంతుకతో.

"ఈ కార్యక్రమంలో మీరు కూడా మాకు తోడ్పడాలని నా మనవి అండీ. మీరు మాకు అండగా నిలబడితే మేమేమైనా సాధించగలమని మా విశ్వాసమండీ" అన్నాను నేను.

"అయ్యా... పూర్వం రాజులూ, వీరులూ సైన్యం అగ్రభాగాన ఉండేవారట. ఎందుకంటే శక్తిహీనులూ, పిరికిపందలూ ముందు ఉంటే మొత్తం సైన్యమే మట్టిగరుస్తుంది. మీరు తలపెట్టింది గురుతర కార్యక్రమం, సాహసంతో కూడుకున్నదీని. మీలాంటివారినే నలుగుర్నైదుగురిని తీసుకొని నడవండి. మావంటి అల్పులం మీ వెనకాల వస్తాం. అంతేకాని మమ్మల్ని ముందుపెడితే మొదటికే మోసం వస్తుంది" అన్నాడాయన.

నేను ఆయనకు నచ్చజెప్పబోతోంటే లోపలినుంచి "ఏమండీ... ఇలారండి ఒకసారి" అని సాధికార స్త్రీ కంఠం వినిపించింది. ఆయన "క్షమించండి, ఇప్పుడే వస్తాను" అని లోపలికి వెళ్లాడు. లోపల చర్చ జరుగుతున్నట్లుంది. కాని గుసగుసలుగా సాగడంవల్ల స్పష్టంగా ఏమీ తెలియరాలేదు. మరికొంతసేపటికి ఆయన బయటికి వచ్చాడు. తప్పుచేసి బయటపడి, చీవాట్లు తిన్న కుర్రకుంకలా ఉంది ఆయన వాలకం. "మాష్టారూ—" అని ఆయన ఏమో చెప్పబోతూంటేనే ఆయన శ్రీమతే అయి ఉంటుంది తెర తెలగించుకొని రంగంమీదికి దుమికింది. "ఏమండోయ్... ఎవరో మీరు! ఇలాంటి అనవసరమైన గొడవల్లోకి మావారిని ఈడవకండి. ఆ చచ్చిందెలాగైనా తిరిగిరాదు. ఇంతకీ ఇంత ఆసక్తి చూపడానికి మీకూ, దానికీ ఏమిటి సంబంధం? ఆ సంబంధం ఉంటే మీరే చూసుకోండి. అంతే కాని మా బతుకులేవో బతుకుతున్న మమ్మల్ని ఇలా ముగ్గులోకి లాగకండి. మా ఆయన శుభాకాంక్షలూ, శుభాశీస్సులూ సింగినాదం అంటారు. అదంతా వట్టి వాగుడు. ఆయనకీ, మీ గొడవకీ ఏమీ సంబధం లేదు... వెళ్ళిరండి. మళ్ళీ మా గడప తొక్కకండి" అని గర్జించిందామె.

నేను ఆమెను చూసి కంగారుగా లేచి నమస్కరించబోయేలోగానే ఆమె మాటల బాణపరంపర మీదికి రావడంతో మధ్యలోనే ఆగిపోయి గుడ్లప్పగించి రాయిలా నిలబడి ఉండిపోయాను. ఒక సామాన్య గృహిణి ఎలా అపరచండి కాగలదో అప్పుడు చూశాను నేను. నాకు నిజంగానే భయం వేసింది. ఆ పురుష పుంగవుడితో "వస్తానండీ" అనైనా చెప్పకుండా వచ్చేశాను. ఇవతలకు వచ్చి మొహమంతా




పట్టిన చెమట తుడుచుకొని ఇంటివైపు అడుగులు లెక్కపెట్టసాగాను.

నాకు ఉత్సాహం నీరుకారిపోజొచ్చింది. సమాజంలో ఏ ఒక్కరూ చేయూత ఇవ్వనప్పుడు నేనొంటరిగా ఎంతదాకా నిలబడగలను? ఏమి చేయగలను? ఒక అన్యాయం కళ్ళ ఎదుట చూసి కూడా, అదైనా ఒక సంఘటనతో పరిమితంకాక ఇంచుమించుగా నిత్యం జరుగుతున్నా [illegible] ఈ సమాజమంతీ నాకు చాలా అసహ్యం వేసింది. అటువంటివాళ్ళని గురించి నేనెందుకు పట్టించుకోవాలి? అందునా వ్యక్తిగతంగా నాకేమీ నష్టంకాని, నష్టంకానీ కలిగడం లేదుకదా. అయినా ఈ అంతరాత్మజ్వరం పట్టుకుంటే త్వరగాపోదని ముందే విన్నవించానుకదా. శ్యామల ప్రశ్నా చూపూ, కన్నీళ్లూ పొడుస్తూనే ఉన్నాయి. కాని ఏమిచేయాలి? అదే పెద్ద ప్రశ్న.

ఇలా ఏ దారీతోచక నేను అయోమయంలో పడిపోయినట్లుండగా ఒకరోజు ఒక సంఘటన జరిగింది.

పెద్ద బజారులో కొన్ని సరుకులు కొని సంచిలో వేసుకొని నడిచి వస్తున్నాను. కొద్దిదూరంలో ఆ దుష్టచతుష్టయం కనిపించారు. వాళ్ళమామూలు మృగయా వినోదంలో ఉన్నట్లున్నారు. ఒక అమ్మాయి చిక్కినట్లుంది. ఆమె అటు పరుగెడితే అక్కడ ఒకడు అడ్డుకొంటున్నాడు. ఇటు పరుగెడితే ఇక్కడ ఒకడు అడ్డుకొంటున్నాడు. ఒకడు పైటకొంగు గుంజాడు. ఆమెపైట గుండెల దగ్గర అదిమి పట్టుకొని, బిత్తరచూపులు చూస్తూ అటూఇటూ పరుగెత్తుతూ ఎలాగో అలా పారిపోవడానికి చూస్తోంది. జనం వస్తున్నారు, పోతున్నారు కాని ఎవరూ పట్టించుకోవడంలేదు. కొందరు ఇది కుర్రాళ్ల సరదా అని తలచారు కాబోలు, చిరునవ్వు నవ్వుకుంటూ పోతున్నారు.

అటువంటప్పుడు నేనేమి చేయను? సినిమా హీరోలా ముందుకు దూకి, ఒక్క గంతులో నలుగురినీ నాలుగు దిక్కులకు తన్ని ఆ అమ్మాయిని విడిపించనా? కాని పరిణామమేమిటో ముందే తెలుస్తోంది. నాకు కుస్తీలూ, ఫైటింగులూ రావు. నేను సినిమా హీరోనికాను. వాళ్ళలో ఏ ఒక్కరితోనైనా పోరాడి నెగ్గగల శారీరక బలములేదు, సామర్థ్యమూలేదు. పైగా ఎవళ్ళతోనో కలబడటం, వాళ్లచేత నాలుగుతన్నులు తినిరావటం పదిమందిలో లుగా నాకు చెప్పరాని అపఖ్యాతి తెచ్చిపెడతాయి. నా అశక్తతకి నన్ను నేనే నిందించుకుంటూ, ముందుకూ వెళ్ళలేక అటు వెనక్కి అడుగూ వేయలేక నిలబడిపోయాను. అది చూసి ఆ అమ్మాయి- "ఏమండీ- నన్ను రక్షించరూ" అంటూ నాదగ్గరికి పరుగెత్తుకు [illegible] నేను అంగుళం [illegible].

గొరిల్లా ముందుకు దూసుకువచ్చాడు. "ఏమిటి బాబూ... ఆ అమ్మాయేం చేసింది? ఆమెదారిని ఆమెని వెళ్ళనియ్యి బాబూ" అన్నాను నేను ఎంతో సౌమ్యంగా.

కాని వాడికి మంచీమర్యాదా అన్నవి తెలిస్తే కదా. "ఎవడురా నువ్వు, మాకడ్డపడతావు! నువ్వు సినిమా హీరోవా ఏంటి! ఇప్పుడే తేలుస్తాను నువ్వెవడివో" అంటూ పిడికిలి బిగించి ముందుకు వచ్చాడు వాడు.

నాయకుడు సురేశ్ దుర్యోధనుడన్నమాట - కొంచెం దూరంలో నిలబడి ఒకసారి మాత్రం మాకేసిచూసి, ఇది చాలా చిన్నవిషయం, తనవంటివాళ్లు పట్టించుకోవలసినది కాదన్నట్లు తిరస్కారభావంతో పక్కకు చూస్తూ నిలబడ్డాడు.

కర్ణుడు – అదే పూర్ణచంద్రుడు - మామూలు నవ్వుమొహంతో చూస్తూ నిలబడి ఉన్నాడు.

దుశ్శాసనుడు నరసింహాలు ముందుకు వచ్చాడు. వాడిని చూస్తేనే నాకు కంపరం పుట్టుకువచ్చింది. నాకే మూడోనేత్రం ఉంటే వాడిని అప్పటికప్పుడు భస్మీపటలం చేసేసేవాడిని.

"ఉండరా నాగూ... నేను కనుక్కుంటాను. ఎవరివయ్యా నువ్వు? ఈ ఊరికి కొత్తగా దిగబడ్డావా?" అంటూ వచ్చాడు వాడు.

ఈలోగా ఆ అమ్మాయి - ఆమె మొహమైనా నేను సరిగా చూడలేదు - అదే అదనుగా అనుకొని పారిపోయింది. నేను తేలికపడ్డాను. ఇక అప్పుడు రౌడీలతో గొడవ పెట్టుకోకుండా వచ్చేద్దామనుకొని, చిరునవ్వు తెచ్చుకొని- "ఇక్కడ

ఒక హైస్కూలులో బి.ఇడి టీచరుని. మీతో నాకేమీ తగాదాలేదుకదయ్యా! ఆ అమ్మాయిని ఆమె దారిన పోనిమ్మని మంచిగా చెప్పాను- అంతే'' అన్నాను నేను.

''బడిపంతులివా? మేమెవరమో తెలిసినట్లులేదు నీకింకా, మా సత్తా ఏమిటో చూస్తే బట్టలు తడుపుకుంటావు. బడిపంతులివి కాబట్టి ఈసారికి వదిలివేస్తున్నాం. నీ పాఠాలేమిటో నువ్వు చెప్పుకో- అంతేకాని మా జోలికి రాబోకు, మట్టి కరిపించేస్తాం'' అన్నాడు వాడు నావైపు గుచ్చురుముతూ.

అశుద్ధం మీద రాయివేస్తే ముఖమంతా చిందుతుందన్నట్లు వాళ్లతో అప్పుడు తగాదా పెట్టుకోవడం నాకే హాని అని గుర్తించి ఇవతలికి నడిచి వచ్చేశాను.

నా మనస్సు అవమానంతో కుతకుతలాడిపోయింది. నా అల్పత్వం, అశక్తత పుండుమీద కారంపెట్టి రుద్దినట్లు నాకు తెలియజేసినట్లైంది. ఆ రాత్రి నాకు చాలాసేపు నిద్ర పట్టలేదు. కాని చిత్రంగా పొద్దున్న నిద్రలేవగానే నాలో ఏమైనాసరే దీని అంతుచూడవలసిందేఅన్న పట్టుదలే పైకి వచ్చింది. ఈసారి మరోదారినపోయి చూద్దామనిపించింది. అది ఎవరైతే ఈ రౌడీకుర్రాళ్ల ఆగడాలకు గురి అవుతున్నారో వారిద్వారానే అంటే, ఆడవారిలోనే ఒక కదలికవచ్చేటట్లు చేయడం. అందుకు తగ్గసాధనం కూడా సమకూర్చుకోవలసిఉంది. తెలిసిన మగాళ్లతోనే నేను ఏమీ సాధించలేకపోయాను, అటువంటిది స్త్రీలు, పురుషులూ దగ్గరగానే మసులుతున్నా అతి స్వల్పంగా మాత్రమే పరస్పర సంబంధాలు ఉండే రెండువేరుకూటములుగా ఉండే మన సమాజంలో స్త్రీలను నేను నాభావాలకు అనుగుణంగా తిప్పగలగడం అసంభవం. పరస్త్రీని నేరుగా పలకరించడం, మాట్లాడడమే నేరంగా తోచే వాతావరణం. అందువల్ల ఈమారు మా శ్రీమతినే ఈ కార్యసాధనకుపయోగిద్దామనుకున్నాను.

నా కృష్ణవేణి ఉత్తమ సాధనమా అంటే సందేహమే. కాని ఉన్న పరిస్థితుల్లో ఆమె తప్ప మరోసాధనం లేదుకదా. ఆమె నేను కోరిచేసుకున్నదే అయినా లోకందృష్టిలో అంత అందగత్తెగా అనదని ముందే చెప్పాను. ఆమె నలుపుగా నాలాగే ఉండటం అందుకు కారణంకావచ్చనీ, అదే ఆమె రక్షణవలయమై ఉండవచ్చుననీ కూడా అనుకున్నాను. ఆమె పదవతరగతివరకూ చదివింది. ఉత్తమశ్రేణిలో కాకపోయినా, సగటుకన్న కాస్త ఎక్కువ మార్కులతోనే పరీక్షపాసైంది. ఆమె చదువులో ఉన్నత లక్ష్యమేమీలేదు. ఉద్యోగం చేయాలని ఎన్నడూ కలకనలేదు. పోనీ ఇంట్లో కూర్చునే బి.ఎ పరీక్షకు తయారుకమ్మంటే ఆమె ఉత్సాహం చూపలేదు. నన్ను వివాహమాడటమే ఆమె అంతిమలక్ష్యమన్న మాట. మా సంసారశకటానికి ఒకచక్రంగా ఉండటం మీదే ఇప్పుడామె ధ్యాస అంతా. చెపితే త్వరగా అర్థం చేసుకుంటుంది. నా ఆలోచనలో తోడ్పడుతుంది. అంతకన్న నాకేమికావాలి? నామట్టుకు నాకు ఆమె 'కార్యేషుదాసీ, కరణేషు మంత్రీ, శయనేషురంభా కులధర్మపత్నీ' అన్న సంస్కృతశ్లోక వరుడిమాట నిజంచేస్తుందనే అనిపిస్తుంది.

కాని విడ్డూరమేమంటే ఇంత అనుకూలవతి అయిన నాభార్యలో కూడా అనుమానం పొడమకుండా ఉండదని నమ్మకం లేదు. ఇదివరకొకసారి ఆమె కళ్లలో ఆ ఛాయ తోచిందని, ఇకముందుకు వెళ్తే అపాయమని గుర్తించి నేనే వెనక్కి తగ్గాననీ ముందే చెప్పాను. అయినా ఈవేళ పరిస్థితిని నేరుగా ఎదుర్కొని అటో ఇటో తేల్చుకోవాలనుకున్నాను.

ఆరాత్రి ఆమెను కూర్చోబెట్టి శ్యామలకథ పూర్తిగా చెప్పాను. ఆరౌడీ కుర్రాళ్లచరిత్రా, వ్యవహారమూ, ముందు రోజు జరిగిన సంఘటనా అన్నీ వివరించాను. ''ఇది ఘోరమైన అన్యాయమంటావా కాదా చెప్పు'' అని ప్రశ్నించాను చివరికి.

''ఘోరమా మరీ ఘోరమా! వాళ్ళు మనిషి పుట్టుక పుట్టారంటారా? ఇలా ఆడవాళ్లనేడిపించడమేమిటి? వాళ్లకి తల్లులూ, అక్కలూ చెల్లెళ్ళూ లేరా? వాళ్లని ఇంకొకళ్లు అలాగే చేస్తే! ఆ రౌడీ వెధవలని చావచితకగొట్టి, గుండుగీయరూ, మొహం నలుపుచేసి, సున్నపుచుక్కలు పెట్టి గాడిదమీద ఊరేగించాలండీ. అప్పుడేమైనా బుద్ధివస్తుందేమో వాళ్లకి'' అంది కృష్ణ.

''అది బాగానే ఉంది కాని, ముందునీకు

నామీద లేశంకూడా అనుమానం లేదుకదా?'' అని అడిగాను.

''అయ్యో... నామీద ఒట్టండీ'' అని నా చెయ్యి తీసుకొని తన నెత్తిమీద పెట్టుకొంది. తరువాత మంగళసూత్రం పైకితీసి రెండుకళ్ల కీ అద్దుకొంది.

నాకు ధైర్యంవచ్చింది. అప్పుడు నేను చేయ దలచుకున్నదేమిటో, అంతవరకు నా ప్రయత్నాలు ఏమయ్యాయో వివరించాను. ఆడవారి నుంచే కదలికవస్తే మంచిదని తలచానని చెప్పి, నేను ఆమెకివ్వదలచుకున్న పాత్ర పరిచయంచేశాను. ఆమె భయపడి వెనక్కితగ్గబోయింది. ఎలాగో ఆమెకు ధైర్యం చెప్పి ఒప్పించాను. మెల్లగా ఆమెలోనే ఉత్సాహం లేచింది.

నా ప్రణాళిక అమలుపెట్టడానికి ఆమెకి మరునాడే అవకాశం వచ్చింది. మా పాఠశాల లోనే హెడ్ గుమస్తా సూర్యారావుగారింట్లో చిన్న పిల్లాడి పుట్టినరోజు సందర్భంగా ఆయన భార్యావాళ్ళు వచ్చి మా ఆవిడను పేరంటానికి పిలిచారు. మా ఆవిడ వెళ్లివచ్చింది. ఆమె నివేదిక ఇది:

★ ★ ★

''నేను పక్కింటి పద్మావతమ్మగారిని పేరంటానికి వస్తారా ఒకత్తెనీ వెళ్లడానికి నాకదోలా ఉంటుందండీ అని అడిగానండి. ఆవిడ 'అలాగే తప్పకవస్తాను, మాయింటికిరండి, ఇద్దరం కలిసే వెళ్దాం' అంది. అందువల్ల నేను తయారై ఆవిడింటికి వెళ్లానండి. ఆవిడ సిద్ధంగా ఉంటారేమో అనుకున్నాను- ఊఁహుఁ నేను వెళ్లిన తరువాతే ఆవిడ మొదలుపెట్టింది ఒళ్లు చక్కబరచడం. పేరంటానికి వెళ్లివచ్చేవరకూ ఆగడానికి కూడా వీలులేని అర్జంటుపనులా అని నాకాశ్చర్యం వేసిందండి. ఒక నిమిషం ఒక నిమిషం అంటూనే అరగంట చేసిందండీ. ఆపైన ముస్తాబు మరో అరగంట. పౌడరు ఎంతమందాన పట్టించి రుద్దిందో - అయినా సంతృప్తిపడలేదు. చెవుల కిందా, మెడదగ్గర పౌడరు పౌడరుగానే ఉండి పోయింది. అయినా తుడుచుకోలేదండీ. పగటి వేషగాళ్ళా తయారైందంటే నమ్మండి''

ఒకానొకప్పుడు మా శ్రీమతి కూడా తెల్లదా నిగా కనిపించాలని తాపత్రయపడకపోలేదు. తెలుపే అందం, నలుపుకాదు అని ఎక్కడా లేదు. తెచ్చిపెట్టుకున్న అందంతేలిపోతుంది. పౌడరు చక్కగా రాసుకోవడమంటే పౌడరువాడినట్లు తెలియకుండా జాగ్రత్తపడటమే అని నచ్చజెప్పిన తరువాతే మా ఆవిడ అలంకరణలో మోతాదూ, రుచీ ప్రదర్శించసాగింది. అందువల్లే ఇప్పుడీ వ్యాఖ్యలు!

''తరువాత చీరల సెలక్షను. నేను లేకపోతే నచ్చినదేదో కట్టుకు తయారయ్యేదేమో. నేనున్నానుకాబట్టి చీరలన్నీ పట్టుకువచ్చి నా ముందువడేసి ఏది కట్టుకుంటే బాగుంటుందో చెప్పమంటుంది. పోనీ నేను చెప్పితే నచ్చదు. తనూ త్వరగా తేల్చుకోలేదు. ఆవరస చూస్తే తనకి అన్ని చీరలున్నాయని తెలియజెప్పడానికి అలా చేస్తోందేమో అనిపించిందండీ నాకు. చివరికి ఎలాగైతేనేం మూరెడు వెడల్పు జరీఉన్న చీర ఎంచుకొని కట్టుకుని నిలువుటద్దంలో పదేపదే చూసుకొని బయటపడింది. నేనొక పెద్ద నిట్టూర్పు విడిచి ముందుకు నడిచాను. ఇంతలో పద్మావతమ్మగారు- ''ఉండండి... కామేశ్వరమ్మగారు కూడా వస్తారేమో కనుక్కొని వస్తాను'' అని గబుక్కున ఆవిడ ఇంట్లోదూరింది. అక్కడ మరో ముప్పావుగంట.

''మేము వెళ్లేసరికి పేరంటం అయిపోయి చాలామంది వెళ్లిపోయి ఉంటారేమో, మనమనుకున్నపని చేసే అవకాశంఉండదేమో అని భయపడ్డాను కాని అప్పుడే చాలామంది పేరంటాళ్ళు రాసాగారండి. అందరూ మెరిసిపోయే చీరలతో, ఆభరణాలతో, అలంకరణలతో మిడిసిపోతున్నారు. వాళ్లమధ్య నాలాంటి ఇద్దరు ముగ్గురం హంసల మధ్య కాకుల్లాఉన్నామంటే నమ్మండి. కళ్లు నేలకానని అమ్మలలో ఎవరైనా నన్ను ఏ పనిమనిషిగానో భ్రమించవచ్చని కూడా భయంవేసిందండి. అందుకే నేను పద్మావతమ్మగారిని అంటిపెట్టుకునే కూర్చున్నాను. ఒకళ్లనొకళ్లు పలకరింపులు, పరిచయాలు చేసుకోవడం మొదలుపెట్టారు. ఇట్టే సంభాషణ నగలమీదకి వెళ్లిపోయింది. ఒకరిద్దరు కొత్త నగలు చేయించుకున్నారు. ఇక వాళ్లు మెడతిప్పుకునేతీరు చూడా

ల్సిందే! తరువాత చీరలమీదికి జరిగింది సంభాషణ. ఒకావిడ నేరుగా కాశీనుంచి తెప్పించిందట పట్టుచీర. ధగధగ మెరిసిపో తోంది. ఇంకొక ఆవిడ కాశ్మీరుసిల్కు చీర ధరించింది. అది ఆవిడ భర్త స్వయంగా కాశ్మీరునుంచి పట్టుకువచ్చాడట. ఇద్దరికీ ఆ చీరలు నప్పలేదు. ఆ చీరలకు వాళ్లు తగ్గట్లు లేరంటే ఇంకా బాగుంటుందేమోనండీ! అయినా తామప్పుడే స్వర్గంనుంచి దిగిన అప్స రసలమయినట్లు వ్యవహరించసాగారండీ! వాళ్లకళ్లలో గర్వం, అహంభావం తొణికిసలాడు తుంటే చుట్టూ చాలామంది అసూయతో చుర చురచూపులు చూడసాగారు. కామేశ్వరమ్మగా రు అననేఅంది... ''ఆఁ- ఏముంది- మా ఆయ నకూడా అష్టమైన గడ్డితిని సంపాదించడం మొదలుపెడితే నేనూరోజుకొక బనారసు చీర కొని కట్టుదును''

వివరం అడిగితే ఆవిడ చెప్పింది కాశ్మీరు సిల్కు చీర మొగుడు బాగా లంచాలుముట్టి



వన్నుల విభాగంలో ఆఫీసరట. బనారసుచీర కొన్నాయన అసలు వ్యాపారానికి మూడురెట్లు దొంగవ్యాపారంచేస్తుంటాడట- అని ఆవిడ ఈ మాటలు అంటుంటే పద్మావతమ్మగారు తనకే మీ వినబడనట్లు కూర్చుంది. ఆవిడ వాల కంచూస్తే నాకు ఏదో అనుమానం వేసింది. తరువాత కామేశ్వరమ్మగారే నా చెవిలో పడే సింది. పద్మావతమ్మ భర్త కూడా బల్లకింద చేతుల సంపాదనలో దిట్టఅని. సంభాషణ ధరల మీదికి ఎక్కింది. నేను మనవిషయం ఎలా ప్రస్తావించనా అని ఆలోచించసాగాను.

"అంతలో ఇంటివారు పంచడానికి పాకెట్లు పట్టుకువచ్చి ఒక బల్లమీద పెట్టారు. అందరి దృష్టి వాటిమీదపడింది. సంభాషణల జోరు కొద్దికొద్దిగా తగ్గింది. అదే అదననుకొని నేను పద్మావతమ్మగారితో, కామేశ్వరమ్మగారితో హాలులో అందరికి వినిపించేటంత బిగ్గరగా– "చూశారా పిన్నిగారూ... బజారులో ఒంటరి ఆడది కనిపిస్తే నానాఅల్లరీ చేస్తున్నారట కొందరు రౌడీవెధవలు. ఈ వేల ఆ రౌడీలే పావం ఒక అమ్మాయిని పట్టుకొని ఏడి పిస్తూంటే మావారు వెళ్లి అడ్డుపడి ఆమెను రక్షించారట. లేకపోతే పట్టపగలే ద్రౌపదీ వస్త్రావహరణంలా చేద్దురేమో" అన్నానండి.

మా ఆవిడ నాగౌరవం నిలబెట్టడానికి చిన్న అబద్ధం ఆడిందని తెలుస్తూనేఉందికదా? కాని అలాచెప్పిఉండకపోతే ఆమాత్రం ప్రభావం ఉండదేమో.

"దానితో వాళ్ళిద్దరూ- అవునమ్మా... ఆవెధ వలెవరోకాని వాళ్ల ఆగడాలు మితిమీరిపోతు న్నాయటమ్మా. ఆడది వీధిలో అడుగుపెట్టడా నికి వీలులేకపోతోంది అంటూ వాళ్ల అను భూతి చెప్పసాగారు. చుట్టుపక్కలవాళ్ళూ దగ్గ రికి చేరి వాళ్లూచెప్పసాగారు. రౌడీల ఆగడాల గురించి మెల్లగా హాలులో ఉన్నవాళ్లందరూ గుమిగూడి ఎవరి అనుభవాలు వాళ్లు చెప్పసా గారు. అంతవరకూ అందరూ తనకేమీ ఆవి షయం తెలియనట్లే ఎలా నటించారో చూ డండి. అంతా రొదగా తయారైంది. ఒకరిద్దరి కంఠాలు అందరికన్నా బిగ్గరగా వినిపించసా గాయి. రొద కొద్దిగా తగ్గుతున్న సమయంలో నేను శ్యామల మాట ఎత్తానండీ! చాలా మంది– "అవునమ్మా... పాపం తల్లిలేని పిల్ల, భయపడిపోయి ప్రాణంతీసుకుందట" అని సానుభూతి చూపితే ఒకటి రెండు అపశృతు లు వినబడకపోలేదు. "దానికెవడితో ఏదో సంబంధముందంటారు. ఏదో జరిగి బండారం బట్టబయలు అయ్యేస్థితి వచ్చి ఉంటుంది. అందుకే ఆపని చే సిఉంటుంది"అన్న వ్యాఖ్య వినబడింది. నాకు చాలాబాధవేసింది. వెంటనే అంటించకుండా ఉండలేకపోయానండి. "ఆడవాళ్లమై ఉండి సాటి ఆడదానిపట్ల సానుభూతి చూప డంపోయి ఆధారంలేని అపవాదులు వేయడం ఏంబాగుంటుంది. రేపు మనమీదే అలాంటి అభాండాలువేస్తే- అన్నాను. దానితో ఇద్దరు కాబోలు మూతులు విరిచేసుకొని వంద వంకరలుతిరిగి దూరంగా జరిగిపోయారు.

అంతలో పేరంటం కార్యక్రమం ప్రారంభ మైంది. దానితో ఆ విషయం అక్కడితో ఆపవ లసి వచ్చిందండి. మంగళహారతి అయి పాకె ట్లు పంచగానే ఎవరిమట్టుకువాళ్లు వెళ్లిపోసా గారు. మనమనుకున్నది అసంపూర్తిగా ఉండి పోతుందేమోనని భయపడి, నేను త్వరగా గుమ్మం దగ్గరికి నడిచి- "ఏమండీ ఆ రౌడీల విషయంలో ఏమిచేస్తే బాగుంటుందంటా రు?" అని అడగసాగాను. "మనమేమి చేయగ లమమ్మా. మగాళ్లు పూనుకోవాలి కాని" అంటూ వెళ్లిపోసాగారు వాళ్లు. కొందరు నా ప్రశ్న విననట్టే వెళ్లిపోయారు. అంతలో పద్మావ తమ్మగారూ, కామేశ్వరమ్మగారూ వస్తే నేనూ వాళ్లతో బయటికి వచ్చివేయకతప్పలేదు.

అంతలోనే ఈ గొడవ జరిగిందండీ. పే రంటాళ్లు అందరూ ఇంచుమించుగా ఒకసారే బయటికి వచ్చారుకదా. ఒక గుంపు అటుపోతే మరో గుంపు ఇటుపోసాగింది. అంతలో పెద్ద కలకలం వినబడి మేమంతా వెనక్కి తిరిగి చూశాం. అటువైపు పేరంటాళ్లు కెవ్వున కేకలే స్తూ వెనక్కి పరుగెత్తుకు వచ్చేస్తున్నారు. వాళ్ల వెనకాలె ఆ రౌడీమూక ఈలలు వేస్తూ బిగ్గరగా నవ్వుకుంటూ వస్తున్నారు. అవతలి గుంపువా ళ్లు అలా పరుగెడుతుంటే మా గుంపువాళ్లూ అరుస్తూ అటూఇటూ పరుగెత్తసాగారు. కొంద రు అరుగులెక్కేశారు. కొందరు కనబడ్డ గు మ్మంలోకి దూరేశారు. ఆ తోపిడిలో నేను కింద




పడిపోయినంత పని అయిందండి. ఆ రౌడీలు నిజానికి ఏమీ చేయలేదు. అలాగే ఈలలు వేస్తూ బిగ్గరగా కబుర్లు చెప్పుకుంటూ, నవ్వుతూ ముందుకు పోయారు. అంతే. వాళ్ళు కొద్ది దూరం సాగగానే ఒక పెద్ద ముత్తయిదువ తిట్లు లంకించుకుంది. "అమ్మకీ నాన్నకీ పుట్టినవాళ్ళు కారురా మీరు? మీ అమ్మకడుపుకాలా! ఎప్పుడు చస్తారు రా, వెధవల్లారా" ఆ తిట్లు వినిపోతున్న రౌడీలు వెనక్కి తిరిగారు. చుట్టూ ఉన్న ఆడవాళ్ల గుండెల్లో మళ్లీ రైళ్లు పరుగెత్త సాగాయి. కాని ఆవిడ ఎవరో వాళ్లని ఊరంత గొంతుక చేసుకొని తిడుతూనే ఉంది. ఆ రౌడీలు [illegible] అక్కడి నుంచి ఇట్టే అదృశ్యమైపోయారు. ఇదండీ జరిగినది. మనమనుకున్నదేమీ జరిగినట్లు లేదు. జరిగేటట్లూ లేదు" అంది కృష్ణవేణి.



మా శ్రీమతి చెప్పినది విన్న తరువాత నాకు మళ్లీ ఆశాభంగం కలిగింది. నిజంగా బాధితుల్లో తీవ్రమైన ప్రతిస్పందన కనిపిస్తే, ఆ విధంగా నా ఉద్యమానికొకదారి ఏర్పడుతుందనుకున్నాను. కాని అదీ మూసుకుపోయింది. కొంతసేపు అలాగే నీరసంగా కూర్చుండిపోయాను. అంతలో ఆ చీకటిలోనే ఒక ఆలోచన మెరిసింది. ఇంగ్లీషు సామెత 'స్ట్రైక్ వైల్ ది ఐరన్ ఈజ్ హాట్' జ్ఞాపకం వచ్చింది. అంటే ఇనుము వేడెక్కి ఉన్నప్పుడే దానిని కోరినరూపంలోకి సాగకొట్టవచ్చు. రౌడీలు రావడం, పేరంటం నుంచి తిరిగివస్తున్న ఆడవాళ్లు భయంతో చెల్లాచెదురు కావడం జరిగి అట్టేసేపు కాలేదు. అందువల్ల ఆ చుట్టుపక్కలవారి మనస్సుల్లో ఇంకా ఆందోళన చల్లారదు. అక్కడక్కడ చర్చలు జరుగుతూ ఉంటాయి. ఏదైనా చేయదలిస్తే ఇదే అదననుకొని వెంటనే దుస్తులు మార్చుకొని వీధినపడ్డాను. నేననుకున్నట్టే ఒకచోట నలుగురు చేరి మాట్లాడుకుంటున్నారు. దగ్గరికి వెళ్లి వింటే వాళ్లు అదే విషయం ఆందోళనతో చర్చించుకుంటున్నట్లు తెలిసింది. నన్ను నేను పరిచయం చేసుకొని- "మీరు ఆ రౌడీల ఆగడం గురించే చర్చిస్తున్నారుకదూ. ఇప్పుడే మా ఆవిడ చెప్పింది ఆ రౌడీలు పేరంటం నుంచి తిరిగివస్తున్న ఆడవాళ్లని భయపెట్టిపోయారట అని" అన్నాను.

అందులో ఒకరన్నారు- "[illegible] మాట్లాడుకుంటున్నామండి ఏం చేయాలో అర్థంకావడంలేదండీ. వాళ్ళు అన్యాయానికి [illegible] స్తున్నారాయె. ఈ పేట విడిచివెళ్లడం మినహా మరో దారి లేనట్లుంది".

"కాదండీ... మనం ఏమీచేయలేం అని తెలియబట్టి వాళ్లు ఇలా వ్యవహరిస్తున్నారేమో. మనం గట్టిగా ఎదురు తిరిగితే వాళ్లు తోకముడవవచ్చు" అన్నాను నేను.

"అలా చేస్తారని తోచడం లేదండీ. వాళ్లు రౌడీలు కదా. మనం వాళ్లతో కొట్లాటకి దిగలేంకదా" అన్నాడు మరొక ఆయన.

"కొట్లాటకి తయారుకానక్కరలేదు. మనం ఊరుకోబోవడం లేదు, ఏదో చర్య తీసుకోబోతున్నామని తెలిసినా వాళ్లలో కొంత దూకుడు తగ్గితీరుతుంది" అన్నాను నేను.

"అయితే ఏంచేద్దామంటారు?"

"ముందు పోలీసులకి చెపుదాం. వాళ్ల ప్రతిస్పందనని బట్టి ఆపైన ఏంచేయాలో తరువాత ఆలోచిద్దాం"

"పోలీసులకా? వాళ్లూవీళ్లూ సరికి, అవుతుంటారుకదండీ. దానికన్నా వెళ్లి ఆ రౌడీల తండ్రుల్ని కలిసి చెప్పడమే మంచిది" అన్నారొకరు.

"అదసలు వద్దండీ. వాళ్లు రౌడీల బాబులన్నమాట మరచిపోయారేమిటి. వీళ్లు కుర్రరౌడీలైతే వాళ్లు రాటుదేలిన రౌడీలు. తమ కొడుకుల్నే వెనకేసుకువచ్చి మనమీద ఏ అఘాయిత్యమైనా చేయవచ్చు కూడా" మరొక అభిప్రాయం.

"నన్నడిగితే ఈ ఊరు ఎమ్మెల్యేని కలుసుకొని చెప్పడం మంచిది"

"ఆయన కోసం పడిగాపులు కాసేప్పటికి మన పని అయిపోతుంది. పైగా ఆయన మొహమాటాలు ఆయనకుంటాయి"

"అన్నిటికన్న మంచి ఉపాయం ప్రతిపక్షాల నాయకుల సాయంతీసుకోవటం. ఏ హడావుడైనా చేయడానికి కాస్త అవకాశం దొరికితే చాలునని కానుకుకూర్చుని ఉంటారుకదా. వాళ్లనుంచి మనకి వెంటనే మద్దతు లభిస్తుంది"

అక్కడ చేరిన నలుగురిలో అప్పుడే అయిదు భిన్నాభిప్రాయాలు వినవచ్చాయి. పరిస్థితి చేయదాటిపోయేటట్టుంది. "అయ్యా... దయచేసి నా మాట వినండి. మీరు చేసిన సూచనలన్నీ మంచివే. అవసరాన్నిబట్టి ఆచరణలో పెడదాం. కాని మనం మెల్లగా అడుగులు వేద్దాం. ముందు పోలీసులకి చెప్పి చూద్దాం. వాళ్లు ఏమీ చేయకపోతే మీరు చెప్పినట్లే ఏదో చేద్దాం" అని నేను అర్థించాను.

"పోలీసుల దగ్గరకి ఎవరు వెళ్తారు?"

"ఏం... మనమే"

"మనం నలుగురమేనా? అలావెళ్తే ఏమీ ప్రభావం ఉండదండీ. కనీసం పది పదిహేనుమందైనా ఉండాలి"

"ముందు మనం బయలుదేరదాం. దారిలో ఎవరికి తెలిసినవాళ్లని వాళ్లు పిలుద్దాం. మనల్ని చూసి వాళ్ళలో కొందరైనా మనతో వస్తారు"

"అయితే మనం బయలుదేరవలసిందేనంటారా?"

"ఇక సందేహం, గుంజాటనా వద్దండీ-కార్యరంగానికి దిగుదాం. శుభస్యశీఘ్రం అంటారు కదా" అని నచ్చజెప్పాను నేను.

నా అదృష్టంబాగుంది ఆ నలుగురూ నాతో బయలుదేరారు. దారిలో ఎవరికి తెలిసినవారిని వాళ్లు పిలిచారు. నేను పేరంటం జరిగిన ఇంటి గుమాస్తానీ, లక్ష్మీపతినీ కేకేశాను. గుమాస్తా వచ్చాడు. నరే... లక్ష్మీపతి ఏ కళనున్నాడో తనూ వచ్చాడు. చివరికి పదిహేనుమందిమి అయ్యాం. నా ప్రాణం లేచివచ్చింది. అంతకు ముందు గుంజాటన ఆడిన నలుగురూ ఇప్పుడీ లోకాన్నే నవాలు చేస్తామన్న వాలకంతో కదలసాగారు.

పోలీసుస్టేషనుకి చేరుకున్నాం. సెంట్రీలోపలికి వెళ్లనివ్వలేదు. మేమెందుకు వచ్చామో వివరిస్తూ ఉండగా ఒక సబ్ఇన్స్పెక్టరు వచ్చాడు. ఆయనకే చెప్పాం విషయం. "సర్కిల్‌గారు వస్తారు... కాసేపు కూర్చోండి" అని హాలులోకి వెళ్లమన్నారు మమ్మల్ని. అక్కడ ఒకపక్క చిన్న బల్లమాత్రం ఉంది. ఎక్కువసేపు నిలబడలేని ఇద్దరు ముగ్గుర్ని దానిమీద కూర్చోమని తక్కినవాళ్లం నిలబడే ఉన్నాం. కొంతసేపటికి సర్కిల్ ఇన్స్పెక్టరు వచ్చాడు. కాని ఆయన మావైపు ధ్యానం చూపక ముందు తను చేయవలసిన సంతకాలూ వగైరాచేసి, ఫోనులో ఎవళ్లతోటో పిచ్చాపాటీవేసి చివరికి మావైపు తిరిగాడు.

మమ్మల్ని వచ్చిన విషయం చెప్పమన్నాడు. మాలో ఐదారుమంది ఒక్కసారే మాట్లాడటం మొదలుపెట్టారు.

"ఆగండి ఆగండి... మీరందరూ ఒకసారే మాట్లాడితే ఎలా? ఎవరో ఒకరే నాయకత్వం వహించండి" అన్నాడు సి.ఐ.

అనుకోకుండా ఇంతమందిమి కలిసిరావడంతో మాలో ప్రతివాడిలో ప్రపంచాన్నే ఎదిరించి నిలబడగలమన్న ధీమా వచ్చింది. కాబట్టి ప్రతివాడికీ నాయకత్వపు ఉత్సాహమే. నేను ముందుకు వస్తే మహానాయకుడు బయలుదేరాడు అన్నభావన వస్తుంది. అందువల్ల నేను మౌనంగానే ఉండిపోయాను. లక్ష్మీపతే ఒక పరిష్కారం చూపించాడు. అయ్యా... "మా శేఖరం మాష్టారు మొదటినుంచీ ఈ విషయంపై శ్రద్ధ వహిస్తున్నారు. ఆయనని మాట్లాడనిద్దాం" అన్నాడు.

"శేఖరం మాష్టారు ఎవర"న్నారు ఒకరిద్దరు. అందరికీ తెలియదుకదా. లక్ష్మీపతి నన్ను అందరికీ పరిచయం చేశాడు.

"నరే... ఆయనని మాట్లాడమనండీ" అన్నారు ఇష్టంలేకపోయినా అనుమతి ఇస్తున్నట్లు.

అప్పుడు నేను ముందుకువచ్చి సర్కిల్ ఇన్స్పెక్టరుకి శ్యామల వృత్తాంతం మాత్రం విడిచి రౌడీల ఆగడం, మా పేటవాసుల





బాధలూ గురించి చెప్పాను.

సర్కిల్ ఇన్‌స్పెక్టరు పెద్దగానవ్వేశాడు. "మీరింతమంది ఉన్నారు. ఆ నలుగురు రౌడీలనె దురించలేరా? మావరకూ రావాలా?"

ఆయన అలా మమ్మల్ని పిరికివాళ్లగా జమ కట్టి హేళనచేయడం నాకు చాలా కోపం తెప్పించింది. మా బృందంలోనివాళ్ల ఉత్సాహంకూడా ఒక్కసారిగా నీరుకారిపోయినట్ల యింది. నన్ను నేను నిగ్రహించుకొని ఎంతో సౌమ్యంగా ఇలా చెప్పాను "అయ్యా... రౌడీలకీ శాంతికాముకపౌరులకీ తేడాలేదంటారా? అశుద్ధంమీద రాయివేస్తే మొగమంతా చిందుతుందని సామెత. వాళ్ళు అన్నిటికీ తెగించినవారు. మేము సమాజంలో భార్యాబిడ్డలతో బాధ్యతకల పౌరులం. మేము రౌడీలతో కలబడలేముకదా. వాళ్లలా బూతులు కూడా తిట్టలేం. అది అలా ఉంచి చట్టాన్ని మా అంతట మేము మా చేతుల్లోకి తీసుకోకూడదని మీరూ అంగీకరిస్తారనుకుంటాను"

సర్కిల్ ఇన్‌స్పెక్టరు కొద్దిసేపు మౌనం వహించాడు. తరువాత అన్నాడు- "మావద్ద ఫిర్యాదుచేయడం తప్పనడంలేదండీ. ఇంతకూ ఎవరా రౌడీలు? వాళ్ల వివరాలు చెప్పగలరా? అవసరంవస్తే వాళ్లని గుర్తించగలరా?"

మావాళ్లెవరూ మాట్లాడలేదు. నా దగ్గరే సంపూర్ణసమాచారం ఉందికాబట్టి నేను సవివరంగా వాళ్లగురించి చెప్పాను. సర్కిల్ ఇన్‌స్పెక్టరు మొహంలో మార్పుకొట్టొచ్చినట్టు కనబడింది. కొంతసేపటికిగాని మాట్లాడలేదు. తరువాత అన్నాడు- "సరే... మీరు చెప్పారుకదా. మేము త్వరలోనే తగుచర్య తీసుకుంటాం"

అంటే ఏ చర్యా తీసుకోడని అర్థమవుతోంది.

"క్షమించండి... మేమింతమంది వచ్చినది మీనుంచి ఒక స్పష్టమైన వాగ్దానం పొందగలమనే ఆశతోనే కదా. మిమ్మల్ని కలుసుకున్నందుకు పర్యవసానంగా ఆ దుండగుల ఆగడాలు వెంటనే ఆగిపోవాలి. మాపేట ఆడవాళ్లు - యువకులూ పెద్దవారుకూడా నిర్భయంగా సంచరించగలగాలి. దయఉంచి ఇది తేలికైన విషయంగా తీసుకోకండి. ఇది ప్రాణాలతో చెలగాటం. ఎంతో తెలివైనదీ, చలాకీ అయినదీ, మంచిదీ ఒక అమ్మాయి నిండుజీవితం ఈ దుర్మార్గుల్లో ఒకడి చర్యవల్ల అంతమైపోయింది" అన్నాను నేను శ్యామల విషయం ప్రస్తావిస్తూ.

"ఏమిటి మీరనేది" అన్నాడు ఆ అధికారి సున్నితంగా చెప్పిన విషయాన్ని అర్థంచేసుకోక.

"ఒక అమ్మాయి ఆత్మహత్య చేసుకుందండీ" అతి స్పష్టంగా చెప్పాను నేను.

"ఆత్మహత్యా... ఎవరు? ఎప్పుడు? మాకు రిపోర్టుచేశారా?"

శ్యామల తల్లిదండ్రు వివరాలిచ్చి ఆమె ఫలానారోజున కిరసనాయిలు పోసుకుని అంటించుకు చచ్చిపోయిందని చెప్పాను.

ఆయన తన రికార్డులు పరిశీలించాడు. శ్యామల మరణం గురించి ఒకచోట ఉంది- "ఏదో కుటుంబసమస్యలవల్ల ఆత్మహత్యచేసుకున్నట్టు. మరొకరి ప్రమేయం ఏమీ లేనట్లూ ఆమె మరణవాఙ్మూలం రికార్డు అయిందే" అన్నాడు.

"చచ్చిపోతూ తన జీవితం బజారుపాలై నగుబాటుకుగురి అవకుండా ఉండటానికి అలా చెప్పివుంటుంది కాని జరిగింది ఇది" అని ఆమె కథ పూర్తిగా చెప్పాను.

అంతా విన్నాక ఆయన తేలికగా కొట్టివేశాడు "ఒకకుర్రాడు సరదాగా ఒక ప్రాక్టికల్‌జోక్‌చేస్తే దానినంత సీరియస్‌గా తీసుకొని ప్రాణం తీసుకోవాలా? మేము నమ్మం... దీనివెనుక ఇంకా కథ ఉంటుంది"

"మర్యాదస్తుల కుటుంబంలోని పిల్ల జీవితంతో ఆట ఆడితే ఆమెకు ఇక పెళ్లిఅవుతుందంటారా? ఆమె భవిష్యత్తు ఏమికావాలి? మన సమాజంలో ఆడదాని రాత ఎలా ఉంటుందో అందరికీ తెలిసినదే- అందుకే ఆమె సిగ్గూ, అభిమానం విడిచి బతకలేక ప్రాణం తీసుకుంది" అన్నాను నేను.

"అయితే ఆమె కేసు మళ్లీ తిరగదోడించాలనుకుంటున్నారా?" అని అడిగాడాయన.

"లేదండీ... ఆమెకు జరిగిన అన్యాయానికి ప్రతిక్రియ ఉండాలంటాను. ఆమెనాస్థితిలోకి తోసినవాడికి శిక్షపడాలంటాను—" అని




నేనంటూండగా-

"మీకు ఆ అమ్మాయి విషయంలో ఇంత ఆసక్తిఎందుకూ? ఆమె మీకు దగ్గర బంధువా??" అని అడిగాడు సి.ఐ

"మా విద్యార్థిని అని చెప్పానుకదా నన్ని హితంగా మెలిగింది. అది అలా ఉంచి మరె వరి విషయంలోనైనా నేను అలాగే ప్రతిస్పంది స్తానండి"అన్నాను.

ఇంతలో మాలో ఒకాయన అన్నాడు- "రామాయణంలో పిడకల వేటలా మధ్య ఈ గొడవ ఎందుకండీ? సి.ఐ గారూ... మాపేటలో ఈ రౌడీల బాధలేకుండా, మా ఆడవాళ్ళు స్వేచ్ఛగా మనలడానికి ఏమి హామీ ఇస్తారో చెప్పండి."

సి.ఐ మాట్లాడలేదు

మాలో ఇంకో ఆయన గొంతుపెంచి అడిగాడు- "మీరు చేస్తామనో, చేయననో ఏదో ఒక నమాధానమివ్వండి. మీరు చేయలేకపోతే మేము ఈ ఊరి ఎం.ఎల్.ఎగారి దగ్గరికిపోతాం"

దానితో సి.ఐ అన్నాడు "అయితే నాదగ్గరికెందుకు వచ్చారు? ఎం.ఎల్.ఎగారి దగ్గరికే పొండి, కాకపోతే ముఖ్యమంత్రిగారి దగ్గరికిపోయినా నాకభ్యంతరంలేదు. వెళ్లండి... ఆపని చేయండి- మాటైము వేస్టేచేయకండి"అన్నాడు తీవ్రస్వరంతో.

నేను మాలోని ఆయననే నముదాయించబోయాను "మీరెవరండీ... నాకు చెప్పడానికి. మిమ్మల్ని ఎవరూ నాయకుడిగా ఎన్నుకోలేదే! నేను మొదటే చెప్పాను ఎం.ఎల్.ఎ దగ్గరికి వెళ్దామని ఎవరూ నామాట వినిపించుకోలేదు. నామాట విననప్పుడు మీరెలా తగలడితేమాత్రం ఎవడిక్కావాలి! నేను పోతున్నాను. ఇక్కడ మీకేమీ అవదని చెప్పి మరీ పోతున్నాను" అని వినవిసా నడచివెళ్లిపోయాడు

మేమంతా స్తబ్ధుఅయిపోయాం. సి.ఐ మొహంకూడా ఉక్రోషంతో ఎర్రబారిపోయింది. ఆ పరిస్థితిలో ఆయనని మాట్లాడించడం ప్రమాదకరమని తెలుసు. మూకని తీసుకువచ్చి పనిచేయబోవడం ఎంత ఇబ్బందోకూడా నాకు అవగతమయింది.

ఒక నిముషం తరువాత నేను సి.ఐతో మెల్లగా అన్నాను "ఏమండీ... మమ్మల్ని వెళ్ళమంటారా?"

సి.ఐ తేరుకొని తన్నుతాను సంబాళించుకొని, మళ్ళీ అధికారస్వరంతెచ్చుకొని అన్నాడు "ఎవరు ఫిర్యాదు చేయదలచుకున్నారో వారు ఎవరిమట్టుకు వారు తమకు కలిగిన బాధఏమిటో, కష్టం ఏమిటో రాసి యివ్వండి. అప్పుడు మీరాత ఫిర్యాదుల మీద మేము తగుచర్యతీసుకుంటాం"

కాని ఎవరు రాసిస్తారు? ఏమని రాసిస్తారు? ఇది అందరూ ఉమ్మడిగా పడుతున్న అవస్థ; విడిగా తమకి ఫలానానమయంలో ఫలానా విధంగా జరిగిందని ఎలా రాయగలరు? ఏమి దాఖలాలు చూపించగలరు?

సి.ఐ వెటకారంగా అన్నాడు "ఫిర్యాదురాసి ఇవ్వడానికి జంకేవాళ్ళు ఇంతదూరం ఎందుకువచ్చారు? ఏ ఆధారంలేకుండా చెప్పుడు మాటల్నిబట్టి చర్యలు తీసుకోవడానికి మేము బేవారునులం కాదుకదా. బాధ్యతలు కల అధికార్లం?".

"క్షమించండి... ఇది ఏ ఒక్కరో దాఖలాలతో సహా ఫిర్యాదు చేసేది కాదుకదా. ఇది కొందరు దుష్టులవల్ల నమాజం ఎదుర్కొంటున్న ఉమ్మడినమన్య. అది మీదృష్టికి తీసుకురావడం మాబాధ్యతని ఇలాచేశాం. అది అలాఉంచి విజయవాడలో, హైదరాబాదులో ప్రజలనుంచి ప్రత్యేక ఫిర్యాదులు అక్కర్లేకుండానే పోలీసులు ఆడవారిని వేధించేవాళ్లని స్వయంగా పట్టుకొని శిక్షించడం గురించి ఎన్నో వార్తలు చదువుతున్నాంకదా" అని నేనింకా చెప్పబోతుండగా-

"మా డ్యూటీను మాకు తెలును. మాకు మీనుంచి నేర్చుకోవలసిన పనిలేదు. మీరు స్పష్టమైన ఫిర్యాదులు రాసి యిస్తే ఇవ్వండి లేకపోతే ఇక్కడనుండి వెళ్లిపొండి" అన్నాడు సి.ఐ. కర్కశంగా.

నాకు చాలా కోపం వచ్చింది; ఆయనను గట్టిగా ఎదిరించాలనిపించింది. కాని నా వెనుక ఎవరూ నిలబడరని గుర్తించి- "అయితే వస్తామండి" అని ఇవతలకి వచ్చేశాను. అందరూ కూడా నావెనకేవచ్చారు. వచ్చేటప్పుడున్న ఉత్సాహం ఎప్పుడో ఎగిరిపోయింది.





ఎవరిమట్టుకువారు మౌనంగా నడుస్తున్నారు. కొద్దిసేపటికే వీడ్కోలు అయినా చెప్పకుండా ఎవరిదారిన వారు వెళ్ళిపోయారు. నేనొక్కడినే భారంగా అడుగులు వేస్తూ మాయింటివైపు నడిచాను.

నామనస్సంతా గజిబిజిఅయిపోయింది. మళ్ళీ ఒక ప్రయత్నం బుగ్గిపాలైపోయింది. కాని అంతలో మరోకదృష్టితో చూస్తే వైఫల్యమే చివరికెదురయినా ఒక అడుగుముందుకు వేసినట్లేకదా అనిపించింది. ఎన్నడూలేనిది పదిమందిని కలుపుకొని కదలగలిగానుకదా; మనము మరొక ప్రయత్నం తోచవచ్చుకదా అనుకున్నాను. కాని మన ఆలోచనలకన్నా సంఘటనలు ముందుకు కదులుతాయని తెలిసింది. దుష్టులకొకవిధమైన తెలివితేట లుంటాయి. పెద్దపులి ఎంతతెలివిగా తప్పించుకోగలదో, దాడి చేయగలదో పెద్దపులిని వేటాడేవాళ్లకు అవగతమే. అలాగే ఈ నరహంతక [illegible] ఏదోప్రమాదం రావ

తోందని సూచనకలిగినట్లుంది. అందుకే ముందే పంజావిసిరారు. దాడిచేయటమే ఉత్తమ రక్షణ అన్న సిద్ధాంతం ఆచరణలోపె డుతూ.

తెలిసోతెలియకో తాచుపాముతోక తొక్కితే ఏమవుతుందో తెలియనివారెవరూ లేరు. నేను నరభక్షకుల్లాంటివారితో వ్యవహరిస్తున్నానని నాకు తెలుసు. వారిమీద పోలీసులకు ఫిర్యాదుచేయబోవడం, దానికోసం నలుగురినీ కూడ గట్టడం తాచుతోక తొక్కడంలాంటిదే అయినప్పుడు నేను అన్ని జాగ్రత్తలు తీసుకొని ఎంతో మెలుకువగాఉండవలసింది. ఎందుకో ఏమరుపాటు వహించాను. ఫలితం తక్షణం అనుభవించాను. పోలీసులకు ఫిర్యాదు చేసినతరువాత ఇంటికి వచ్చిన కొద్దిసేపటికి ఇంట్లో కాఫీపొడి నిండుకుందని తెలిసింది. నేను కొంచెమైనా ఆలోచించకుండా కిరాణాకొట్టుకు బయలుదేరాను. మాశ్రీమతి కూడా నన్ను వారించలేదు. మాయింటికి రెండురోడ్లు అవతల ఉన్న కొట్టుకివెళ్లి కాఫీపొడి పాకెట్టు తీసుకొని ఇంటికి తిరుగుముఖం పట్టాను. బాగా చీకటిపడింది. వీధిలైట్లు వెలిగాయి కాని ఒకచోట వరుసగా రెండుదీపాలు వెలగడం లేదు. పరధ్యానంలో నేను ఆ చీకటిలోనే నడిచివస్తున్నాను.

కీచుమంటూ పెద్దశబ్దం వచ్చిన తరువాతే నేను ఉలిక్కిపడి చూశాను. నాపక్కన ఒక కారు ఆగింది. కారుకేసి చూడటమేమిటీ, తలుపు తెరచుకోవడం, ఎవరో బయటికిరావడం, నామొగం మీద ముసుగువేసి లోపలికి లాగివేయడం క్షణకాలంలో జరిగిపోయాయి.

నన్ను గింజుకోకుండా గట్టిగా నొక్కిపట్టేశారు. నోటిమీద కూడా చెయ్యిపెట్టి నొక్కివేయసాగారు. ఊపిరాడనట్లవుతోంది. దవడలు విరిగిపోతాయేమోననిపించింది. బాధ భరించలేక కాళ్లుగట్టిగా విదిలించసాగాను. నేను ఊపిరాడక చస్తాననుకున్నారో ఏమో కొంచెం పట్టుసడలించారు. నోటిమీద చేయికూడా తీశారు. నేనొక్కసారి గాలిపీల్చుకొని అరుద్దామనుకుంటుండగా గబుక్కున ముసుగు కింద నుంచే నానోట్లో గుడ్డలు కుక్కారు. నేను నిస్సహాయుణ్ణైపోయాను.

కొంతసేపటికి కారు ఒకచోట ఆగినట్లయింది. కారు తలుపు తెరచి నన్ను బయటికి లాగి తలమీద ముసుగుతోనే ఎక్కడికో నడిపించసాగారు. గదుల్లో ప్రవేశించినట్లయింది. కాని నేను గుర్తుపెట్టుకోకుండా ఉండేందుకు కాబోలు నన్ను నాలుగైదుసార్లు అన్ని గదుల్లో తిప్పి, చివరకి ఒకచోట వదిలిపెట్టారు. తలుపులు వేసినట్లు చప్పుడైంది. తరువాత నా తలమీదనుంచి ముసుగుతీసి నోట్లోకుక్కిన గుడ్డలు కూడా లాగేశారు. కొంతసేపు ముసుగు కింద చీకటిలో ఉండటంవల్ల హఠాత్తుగా వెలుతురు మిరుమిట్లు గొల్పినట్లయి ఏదీ కనబడలేదు. మెల్లగా వెలుతురు సర్దుకోగానే నలువైపులా చూశాను. విశాలమైన హాలు బోసిగానే వుంది. ఒకవైపు మాత్రం పెట్టెలమీద పెట్టెలు పేర్చివున్నాయి. రెండు ట్యూబ్‌లైట్లు వెలుగుతున్నాయి. అదేదో గోదాము అయివుంటుందనుకున్నాను. చుట్టూ ఆ దుష్టచతుష్టయమే ఉన్నారు, మరో ఇద్దరు ఉన్నారు. వాళ్లు పచ్చిరౌడీలని చెప్పకుండానే తెలుస్తోంది. ముందు ఏమిఉందో గ్రహించడానికి నాకు అట్టేసేపు పట్టలేదు.

'దుర్యోధనుడు'- అంటే సురేశ్ ఇదివరకు లాగే నాకు కొద్ది దూరంలో నిలబడి రాజఠీవితో నాకేసి చూస్తున్నాడు. వాడిపక్క పూర్ణచంద్రరావు నిలబడి ఉన్నాడు. దుశ్శాసనుడు నరసింహులూ, నాగేంద్ర నావైపుకు వచ్చారు.

నరసింహులే అన్నాడు- "ఏంపంతులూ... బుద్ధిగా నీ పాఠాలేవో నువ్వు చెప్పుకో, మా జోలికిరాబోకు అని వార్నింగిచ్చాంకదా. అప్పుడే మరచిపోయావేంటి? నీకు బుద్ధి ఉన్నట్టులేదే. మేమెవరమనుకున్నావు? మేం తలచుకుంటే నువ్వు ఈ ఊళ్ళోకాదుకదా, ఈ రాష్ట్రంనుంచే ఉడాయించవలసివస్తుంది. మామీద పోలీసులకి ఫిర్యాదు చేస్తావా? ఎన్ని గుండెలు నీకు? అయినా ఆ పోలీసులెవరు? మాచేతికింద మనుషులే- తెలుసా? నువ్వెంత మందిని పోగుచేసుకొని పోతే ఏమయిందో చూశావుకదా?"

నేను వాడితో మాట్లాడకపోవడమే మేలనుకున్నాను.

"ఏంటీ... నేనిన్ని ప్రశ్నలు వేస్తుంటే జవాబి

 

వ్వవేంటీ?'' అని అరిచాడు వాడు.

అయినా నేను మౌనమే పాటించాను.

నాగేంద్రం ముందుకువచ్చాడు- "ఉండరా, నేను జవాబు చెప్పిస్తాను'' అని నా చెంపమీద గట్టిగా కొట్టాడు. "ఇప్పుడు మాట్లా డతావుకదూ? లేక మందు ఇంకో డోసు కా వాలా?'' అని ఉరిమాడు వాడు.

ఆ దెబ్బకు నాకు పగలే చుక్కలు కనిపించి నట్లయింది. అయినా నా బింకం సడలించకూ డదన్న పట్టుదల నాలో పెరిగింది.

వాడి దెబ్బకు కూడా నేను బెదరకపోవడం నాగేంద్రానికి అవమానంతో తోచినట్లయిందను కుంటాను. నన్ను ఈ చెంపా, ఆ చెంపా కొట్టికొట్టి మెడపట్టుకని గట్టిగా నొక్కివేయసాగా డు. నాకు ఊపిరాడటం కష్టంకాసాగింది. ఎప్పుడూ దెబ్బలుతిని ఎరగనేమో ఏడ్చే సినంత పని అవుతోంది. నేను ఏడ్చినా, ఏడ్వక పోయినా వాళ్ళు చేసేది చేయకమానరు. నేను కొంచెమైనా లొంగుబాటు కనబరిస్తే వాళ్ళు నన్ను తమ కాళ్ళు పట్టుకునేవరకూ వదలరని తెలుస్తోంది. కాని బాధ భరించడమెలా? అంతలో 'ఆగరా నాగూ' అని సురేశ్ ముందు కువచ్చాడు. నాగేంద్రం నన్ను వదిలిపెట్టాడు. నేను ఒక్కసారి గుండెలనిండా ఊపిరి పీల్చు కొని నిలబడ్డాను.

ఈసారి నేనే ముందు అడుగువేయాలనుకు న్నాను. సురేశ్‌కేసే చూస్తూ- "ఎందుకు నన్ను మీరు ఇలా తీసుకువచ్చి కొడుతున్నారు? ఏం వచ్చింది మీకు? ఇది గొప్పతనం అనుకుంటు న్నారా? నేను బలాఢ్యుణ్ణీ, వీరుణ్ణీ అని చెప్పుకో వడంలేదు. కాని పిరికివాణ్ణికాను. నాకన్నా బలహీనులమీదా, నిస్సహాయులమీదా నేనెన్న డూ చేయెత్తలేదు. అసలు నేనెన్నడూ ఎవరినీ కొట్టినపాపానపోలేదు. కాని మీరింతమంది చేరి నన్నొక్కడినిచేసి బలవంతంగా తెచ్చి కొడుతు న్నారు. ఇది మీకు వీరత్వంగా తోస్తే కొట్టండి. కాని నా ప్రాణంపోయిననరే మీకు లొంగేదిమా త్రం లేదు. ఇంతకీ నేనేమి చేశానని నన్ను కొడుతున్నారు?'' అని ప్రశ్నించాను నా గొంతుక అంతకంతకు పెంచుతూ. నాలో పొంగుతున్న ధైర్యం చూసి నాకే ఆశ్చర్యం వేసింది.

నేనలా పైకి నిర్భయంగా నిలబడి మాట్లా డటం సంస్కారవంతులమీద కొద్దిగానైనా ప్ర భావం చూపకమానదు. కాని నాగేంద్రం, నర సింహులు బాపతు జనానికి ఔన్నత్యం, ఔదా ర్యంవంటివి అర్థంకావు. అందువల్ల "ఏం కూస్తున్నావురా... మా బాస్‌నే నిలదీస్తావురా?'' అంటూ చేతులెత్తి మీదికివచ్చారు. రౌడీలు కూడా నావైపు అడుగులు వేశారు. కాని గుడ్డిలో మెల్లన్నట్లు వారిలో సురేశ్‌కి - నాయకుడుకదా- కొద్దిపాటి అవగాహన ఉన్నట్లుంది. "మీరా గండిరా'' అని నావైపు తిరిగి "ఏంచేశానని మమ్మల్ని అడుగుతావేంటి? మామీద పోలీసు లకి కంప్లెయింట్ ఇవ్వలేదూ?'' అని అడిగాడ తను.

"ఏమని ఇచ్చాను? ఎందుకు ఇచ్చాను?'' అని మళ్ళీ నేనే ఎదురుప్రశ్న వేశాను.

సురేశ్ నాకేసి తెల్లబోయి చూశాడు. అంతలో సర్దుకొని నా ప్రశ్నలకు సూటిగా జవాబివ్వకుండా- "మేం వార్నింగిచ్చినా మా దారికెందుకడ్డొస్తున్నావు? మేము నీకు ఏంచే శాం- చెప్పు'' అన్నాడు.

"నేను సంఘంలో మనిషినికాబట్టి. నేను నా ఒక్కడిని గురించీ, నా స్వార్థంగురించీ ఆలో చించను. నా చుట్టూవున్నవారికి కష్టం కలిగితే నాకూ కష్టం కలిగిందనుకుంటాను. నాకు చేత నైతే నలుగురికీ సాయపడతానుకానీ నలుగు రినీ బాధపెట్టి నేనానందించను. ఎందుక య్యా మీరు నలుగురినీ బాధపెడ్తారు? వారు మీకేం చేశారని? దారినపోయే ఆడవాళ్ళని ఏడిపించడం, వాళ్ళు భయపడితే బాధపడితే మీరానందించడమా? ఏమిటయ్యా ఆ ఆనందం! అదే మీ చెల్లెళ్ళనో, అక్కలనో, అమ్మ లనో మరొకళ్ళు అలా ఏడిపిస్తే మీకెలా ఉంటుంది?'' అని అడిగాను నేను నా ఎదురు దాడిని ఉధృతం చేస్తూ.

"మా చెల్లెళ్ళూ, అక్కలజోలికి రావడానికి ఎవడికి దమ్ములున్నాయి? అలా ఎవడైనా చేస్తే మేం వాడి అంతు చూస్తామని మరిచిపోకు'' అన్నాడు సురేశ్ ధిక్కారపూర్వకంగా.

"అంటే మీరు ఇతరులమీద దౌర్జన్యం చే యవచ్చు. ఇతరులుమాత్రం మీవాళ్ళమీద దౌ ర్జన్యం చేయకూడదు. అంటే మీరు బలాఢ్యు



లూ, ఉన్నవారూ, పలుకుబడి కలవారూ కాబట్టి మీరేమిచేసినా సరిఅయినట్లేకదూ? అయితే నిస్సహాయులమీద మీ ప్రతాపం చూపిస్తారన్నమాట! అందుకు సిగ్గుపడవలసిందిపోయి ఘనకార్యంలా, మగతనంలా చెప్పుకుంటున్నారయ్యా! మీ దురాగతానికి ఒక నిండుప్రాణం బలి అయ్యిందికదయ్యా. ఆమె జీవితం ఎందుకలా అంతమవ్వాలి?" అని నేను గద్దించాను ఎదురుదాడిలోనే నాకు భద్రత ఉందని గుర్తించి.

ఇలా జరుగుతుందని వాళ్ళు ఊహించి ఉండరు. వాళ్ళలో కొంత గందరగోళం తోస్తోంది. అదే అదననుకొని జోరు పెంచాను.

"ఎవరు ప్రాణం తీశారు? తనే తీసుకుంది. చిన్న ప్రాక్టికల్ జోక్ చేస్తే దానికోసం ఆత్మహత్య చేసుకోవాలా?" అని అడిగాడు అంతవరకు ఊరుకున్న పూర్ణచంద్రరావు.

"తల్లిలేని పిల్ల. పెళ్ళి కావలసినది. పేద కుటుంబంది. ఆమెమీద ప్రాక్టికల్ జోక్ ప్రయోగిస్తే ఆమె జీవితం ఏమవుతుంది? సిగ్గూలజ్జా లేనివాళ్ళు ఏమీ పట్టించుకోకపోవచ్చు. ఆమె అభిమానం కలది. అందుకే అలాచేసింది. నీ అక్కలమీద ఎవరైనా ప్రాక్టికల్‌జోక్ వేస్తే నువ్వూరుకుంటావయ్యా" అని అడిగాను నేను.

అతను వెనక్కి తగ్గాడు. కాని నాయకుడు మరీ అవకాశం ఇచ్చి మీదకితెచ్చుకున్నాననుకొని, నామీద దెబ్బవేయాలనుకున్నట్లున్నాడు. "ఏమయ్యా మాష్టారూ... నీకూ ఆ చచ్చినదానికీ ఏమిటి సంబంధం? ఆమె చావుకి మమ్మల్ని శిక్షించాల్సిందేనన్నావట. ఎవరికీ లేనిది నీకెందుకొచ్చింది దానిపట్ల ఇంత ఆసక్తి. ఏం... సాగించావేమిటి నీ సొంత ప్రేమాయణం?"

చివరి వాక్యం వాడన్నదికాదు. అది పచ్చిబూతు వాక్యం. వాడన్నదానికి నేను నా గుండె లోతులకంటా చల్లార్చుకుపోయాను. కాని ఆ దెబ్బ నన్ను దిమ్మతిరిగేటట్టు చేసిందని వాడికి తెలిస్తే ఇకమీద వాళ్లు విజృంభిస్తారని తెలిసి నన్ను నేను నిగ్రహించుకొని ఎంతో శాంతంగా అన్నాను- "మీరు ఏదైనా అనుకోవచ్చు, అనవచ్చు. కాని నా హృదయంమీద చేయివేసి చెప్పగలను నా ఆసక్తి జరిగిన అన్యాయంపట్లే కాని, మరొకరకం కాదని. అందువల్ల ఎవరి ఆరోపణలకీ బెదరను. అలా శుభలేఖలు వేసినవాడూ, ఆమె జీవితంతో చెలగాటమాడినవాడూ ఈ పెద్దమనిషి. ఆ అమ్మాయి తండ్రి కులబంధాలు కూడా తెంచుకొని తనకే ఇచ్చి పెళ్ళిచేయడానికి సిద్ధపడితే ఎందుకు జంకినట్టు? వీధిలో అమ్మాయిలముందు పులీ. ఇంట్లో తండ్రి ముందూ పిల్లి అన్నమాట"

నరసింహులు వెర్రిచూపులు చూశాడు. "అడిగిన ఆడవాళ్ళల్లా పెళ్లి చేసుకోవడమేమిటి?" అని గొణిగాడు.

"అయితే నీ ప్రేమ అన్నది ఉత్త బూటకమన్నమాట. అసలు ప్రేమ అనేమాటకు అర్థం తెలుసునయ్యా? అడవిలో క్రూరమృగాలు కూడా ఆకలివేస్తే కాని వేటాడవు. మీరు ఒట్టిపుణ్యాని కి కనిపించిన ఆడపిల్లనల్లా వేటాడుతున్నారు" అని నేనంటూండగానే-

"ఏంపంతులూ... మాటలు జాగ్రత్తగా రానియ్యి. పళ్లూడగలవు. మమ్మల్ని అడవి మృగాలంటావా?" అని రంకెపెట్టాడు సురేశ్. మళ్లీ నాగేంద్రం, నరసింహులు మీదికి రాబోయారు.

"గుమ్మడికాయ దొంగలంటే భుజాలు తడుముకున్నట్లుంది మీవ్యవహారం. నేను మిమ్మల్ని అడవిమృగాలనలేదే. అవి ఆకలివేస్తేనే వేటాడతాయన్నాను"

"ఇదుగో పంతులూ... నీ తెలివితేటలు మామీద ప్రయోగించబోకు. పెళ్లి కానంతవరకూ ఏ ఆడపిల్ల అయినా మగాడికి వేటవస్తువే. నువ్వేదో సత్యకాలపు కబుర్లు చెప్పకు. ఈ నీతి గీతి సత్తాలేనివాళ్ల కబుర్లు. వేటలో ఉన్న సరదా నీకేం తెలుస్తుందయ్యా. నీకు తాగుడు మజా తెలుసా. సిగరెట్టు కాలుస్తూంటే ఎంత హాయిగా ఉంటుందో తెలుసా? పరాయి ఆడదాని ఆనందం నువ్వెప్పుడైనా ఎరుగుదువా? నీకు జీవితం ఏంతెలుసునయ్యా! మేం నీలా నపుంసకులంకాదు. మగాళ్లం. అన్నీ ఉన్నవాళ్లం. అన్నీ అనుభవిస్తాం. మజాచేస్తాం. నీ పిచ్చికబుర్లకు బోల్తాపడం. ఒకటే చెపుతున్నాను పంతులూ... మాజోలికి ఎన్నడూ రాకు. నీ దారిన నువ్వు పడిఉండు. మా మాట వినకపోయావొ పుత్రవధ చేసి, కాల్చి భస్మం చేసి నీళ్లలో కలుపుకొని తాగేస్తాం. మళ్లీ ఒక పాఠం చెప్పాలంటే ఇక ముందెప్పుడూ మనవైపు





కన్నెత్తైనా చూడకుండా ఉండేటట్లు" అని వాళ్లతో చెప్పి మళ్లీ నావైపు తిరిగి- "ఈసారి మళ్లీ ఆ సి.ఐ. దగ్గరకి పోతావో, తిన్నగా డిజిపి దగ్గరికే పోతావో, ముఖ్యమంత్రి దగ్గరకే పోతావో పోయి చెప్పుకో. మాకేం భయం లేదు" అని "రారాచంద్రం" అని పూర్ణచంద్రరావుని తీసుకొని విసురుగా అక్కడినుంచి వెళ్లిపోయాడు సురేష్.

ఇక నా ఎదుట వచ్చి రాక్షసత్వం నిలబడి ఉన్నట్లు గుర్తించాను. నాగేంద్రం, నరసింహులు విజృంభించి నన్ను తమ కసితీరా కొట్టారు. ఆ పైన రౌడీ జంటకు సైగ చేశారు. కొద్దిసేపటి లోనే నేను ఆ రౌడీల చేతిలో మైనపుబొమ్మలా అయిపోయాను. కొంతసేపటికి వాళ్లు నా మొహంమీద నీళ్లుచల్లి నేను ఎక్కడ ఉన్నానో తెలియని స్థితిలో విపరీతమైన బాధతో మూలుగుతూ ఉంటే నన్ను మోసుకు వచ్చి కారులో పడేసుకొని మాయింటికి పదిగజాల దూరంలో రోడ్డుపక్కన చీకటిలో పడిలేసి వెళ్లిపోయారు.



నేను ఎంతసేపు అలా ఉండిపోయానో నాకు గుర్తులేదు. మెల్లగా కళ్లు తెరచి చూశాను.

చిమ్మచీకటి. వీధి దీపాలు దూరంగా అక్కడొకటీ అక్కడొకటీ వెలుగుతున్నాయి. పది గజాల దూరంలో ఏదో ఇంటినుంచి వెలుతురు బయటపడుతోంది. నిదానించి చూస్తే అది మాయిల్లే అని గుర్తువచ్చింది. నా శ్రీమతి ఇంకా మెలకువగా ఉండి నాకోసం ఎదురుచూస్తోందన్నమాట.

నేనెలాగో ఓపిక తెచ్చుకొని బాధతోనే మాయింటివైపు అడుగులు వేయసాగాను. గుమ్మానికెదురుగా వచ్చాను. కృష్ణకి జోగు వచ్చినట్లుంది నారాక గమనించలేదు. నా భారపుటడుగుల సవ్వడి దగ్గర కాగా ఉలిక్కిపడి లేచి నన్ను చూసి ఎదరకు పరుగెత్తుకు వచ్చింది.

దగ్గరకి వచ్చిన తరువాత నా రూపం చూసి కొద్దిక్షణాలు నిశ్చేష్టురాలైంది. తరువాత- "ఏమిటండీ, ఏంజరిగింది? ఇలా ఉన్నారే మిటి? ఈ దెబ్బలేమిటి?" అని ఆదుర్దాతో అడుగుతూంటే- "కంగారుపడకు. గట్టిగా మాట్లాడకు... చుట్టుపక్కలవాళ్లు లేస్తారు. లోపలకి రానియ్, అంతా చెపుతాను" అని ఆమె భుజం ఆసరాతీసుకొని గుమ్మం దగ్గరికి నడిచాను. అప్పటికే చుట్టుపక్కల కొన్ని దీపాలు వెలిగాయి. మేము వాళ్లదృష్టిలో పడ్డామన్నమాటే. నేను శ్రీమతి ఆసరాతో లోపలికి నడిచి తలుపు గడియ వేశాను.

దగ్గర మంచం ఉంటే దానిమీద కూలబడ్డాను. కృష్ణ ఏడుపు ఆపుకోలేకపోయింది. "ఏం జరిగింది అంటే చెప్పరేం" అంటూ నన్ను వాటేసుకొని వెక్కివెక్కి ఏడవసాగింది.

"ఊరుకో... నువ్వేమీ భయపడకు. నేను ఇంటికి తిరిగివచ్చానుకదా. నా అంతట నేను నడచివచ్చాను కదా" అని ఊరుకోబెట్టడానికి ప్రయత్నం చేశాను.

ఆమె ఏడుపు ఉధృతం తగ్గింది.

అప్పుడు చెప్పాను నేను జరిగినది.

"ఎవరూ అడ్డుపడలేదూ, ఎవరూ మీకు సాయం రాలేదూ?" అంది ఆమె.

"ఎవరు చూశారు నన్నెత్తుకుపోవడం? నేనక్కడ ఒంటరివాడినికదా"

"వెంటనే ఏ పోలీసుకైనా చెప్పవలసిందేమో?"

"నిన్ననే మేమంతమంది వెళ్లి , చెపితే ఏమైందో నీకు తెలుసుకదా. అసలు దాని పర్యవసానమే ఇది"

"అయితే ఈ ఊరినుంచి వెళ్లిపోదామండి. మరో ఊరు ట్రాన్స్‌ఫర్ చేయించుకోండి. మనకిక్కడ చుట్టాలా, స్నేహితులా? ఆఖరికి ఉద్యోగం పోయినా ఫరవాలేదు. బతికుంటే బలుసాకుతిని వుండొచ్చంటారు" అంది.

"అలాగే- అవి అన్నీ తరువాత తీరికగా ఆలోచించివేద్దాం. ముందు ఈ దెబ్బలకి చికి

త్సా చూడాలి. నేనొకసారి ఒళ్ళు కడుక్కొని వస్తాను. ఈలోపుగా వేడినీళ్లు మరగించు. దెబ్బలు కాచి తరువాత ఆయింట్‌మెంట్ రాద్దువుగాని" అని స్నానాలగదికి వెళ్లాను. వచ్చి నాదగ్గర ఎప్పుడూ వుండే హోమియోపతి మందుల్లో రెండు ఎంచుకొని అరగంట అరగంటకో వాడటం మొదలుపెట్టాను. గాయాలైనచోట ఒక ఆయింట్‌మెంట్ రాశాను. మా శ్రీమతి రముకు దెబ్బలకు కాపడంపెట్టి నేను చెప్పిన ఆయింట్‌మెంట్ మర్దనా చేసింది.

"నువ్వలా ఒకత్తెవీ ఇంత రాత్రివేళ తలుపు తీసి గుమ్మందగ్గర కూర్చున్నావేమిటి? చుట్టుపక్కలవాళ్లు ఎవరూ రాలేదా?" అని అడిగాను నేను.

"రాకేం... నేను మీగురించి ఆదుర్దాగా అందరినీ అడుగుతుంటే కొంతసేపటికి నలుగురూ మన గుమ్మందగ్గర చేరారండీ. కానీ వాళ్లు చెప్పిన కబుర్లు విని నా ప్రాణం అల్లల్లాడిపోయిందండి. భయం పోగొట్టబదులు మరింత భయపెట్టారు. అది చెయ్యాలి, ఇది చెయ్యాలి అంటారు కాని చేసేవాళ్లు ఎవరూ కన్పించలేదండి. చివరికి 'ఇంత రాత్రివేళ చేసేది ఏమీలేదు. రాత్రికి మీవారు వస్తే మరీ మంచిది, అంతగా పొద్దున్నకీ రాకపోతే పోలీసులకి రిపోర్టు ఇవ్వడమో మరొకటో చేద్దాం' అని ఎవరిదారిన వాళ్లు వెళ్లిపోయారండీ" అని చెప్పింది శ్రీమతి.

"సరేలే... ఇక నిద్ర వస్తుందేమో ప్రయత్నిద్దాం" అని నేను మంచంమీద వాలగా మా శ్రీమతి కాళ్లు పిసకడం మొదలుపెట్టింది. మెల్లగా నేను నిద్రలోకి జారిపోయాను.

మర్నాడు పొద్దుటికి రాత్రి వాడిన హోమియోపతి మందులవల్లనేత్తైనేమి మా ఆవిడ చేసిన పరిచర్యలవల్లనైతేనేమి నా దెబ్బల ఉధృతం తగ్గింది. కాని ఇంకా ఒళ్లు నొప్పిపెడుతూనే వుంది. ఆ దెబ్బలతో బడికి వెళ్లడం కుదరదని తలచి రెండురోజులు సెలవుచీటీ రాసి లక్ష్మీపతిగారిని హెడ్‌మాష్టారికి అందజేయమని చెప్పి ఆయనకిచ్చి రమ్మని మా కుర్రవాడిని పంపాను.

మరికాసేపటికి లక్ష్మీపతే మా యింటికి వచ్చాడు. "నిన్న సాయంత్రమేగా కలిసినది. ఈలోగా ఏమి జరిగింది సెలవు పెట్టడానికి? ఇది కాగితంమీద చూపించే నుస్తీయా?" అంటూ లోపలికి వచ్చి నన్నుచూసి కొంతసేపు మాటలేకుండా వుండిపోయాడు.

నేనే అన్నాను- "కంగారుపడకండి లక్ష్మీపతిగారూ నేను బతికేవున్నానుగా- అలా కూర్చోండి" అని ఆయనకు కుర్చీ చూపాను.

ఆయన అలాగే మౌనంగానే కుర్చీలో కూలబడి తరువాత తేరుకొని అడిగాడు. "ఇంతకీ ఏమైంది? ఇవి కొట్టిన దెబ్బలేనా? ఎవరు కొట్టారు? ఎందుకు కొట్టారు?"

"ఎవరు కొడతారు! ఆ రౌడీలే. ఎదురుదెబ్బవేయడమే మంచి ఎత్తుగడ అనుకొని వుంటారు. వాళ్లకి చేతనైంది కూడా అదేకదా?" అని జరిగింది టూకీగా చెప్పాను నేను.

ఆయన అంతా మౌనంగావిని తరువాత అన్నాడు- "మాష్టారూ, నేను ముందే చెప్పాను. అటువంటివారితో వైరం పెట్టుకోవద్దని. వాళ్లింతటితో వదిలారు సంతోషం. తలచుకుంటే వారు ఇంకేమైనా చేయగలుగుదురు. వాళ్లు దేనికైనా సమర్థులు. ప్రాణాలు పోగొట్టుకొని మనం సాధించేదేమిటి? ఈ ప్రజాసేవలూ, త్యాగాలు ఎవరు మెచ్చును? ఈ ప్రజలెవరు? వాళ్లలో ఎవడి స్వార్థం వాడు చూసుకోని వాడొక్కడిని చూపించండి చూద్దాం. ముక్కూమొగమూ తెలియని వాళ్లకోసం మీరెందుకండీ దెబ్బలు తినడం? మనం మన శక్తికి మించినవాటిజోలికి పోకూడదండీ. ఇక జరిగింది మరిచిపోయి మీ కుటుంబమేదో, మీ స్కూలు మాష్టరీ ఏదోగా గడపండి, మీకేమి కష్టమూరాదు, నష్టమూరాదు. నా మాటవింటే మీరు నాలాగే అన్నిసుఖాలూ అనుభవించడంలో సాయంచేస్తాను కూడా. మీ సహాధ్యాపకుడిగా, స్నేహితుడిగా, హితైషిగా చెవుతున్నాను. ఈదారిన వెనక్కి మళ్లీ మళ్లీ మామూలుదారిలో సాగండి, వస్తాను- సెలవు" అని త్వరగా లేచివెళ్లిపోయాడు.

★ ★ ★

వార్త ఇట్టే వ్యాపించివుంటుంది. మా స్కూల్లో మాష్టార్లూ, ఇతరులూ, పరిచితులూ, చుట్టుపక్కలవాళ్లూ అదేపనిగా రావడం మొదలుపెట్టారు. అందరూ 'ఎంత దారుణం జరిగింది, ఎంత చెలరేగిపోతున్నారు ఆ దుర్మార్గులు'




అంటూ మొదలుపెట్టి చివరికి 'ఎంతైనా వాళ్లు బలాఢ్యులూ, డబ్బూ పలుకుబడీ కూడా కల వాళ్లు. వాళ్లతో వైరంతెచ్చుకోవడం చిట్టెలుక వెళ్లి సింహాన్ని ఎదిరించినట్లే వుంటుంది. మీరు వ్యక్తిగతంగా సంబంధంలేని విషయాల్లో జోక్యంచేసుకోకపోవడం మంచిదండీ! మన వంటివాళ్లు మన బతుకేదో మనం బతకాలి గాని లోకాన్ని ఉద్ధరిద్దామని బయలుదేరకూడ దు. అటువంటి పనికి నాయకులున్నారు, వారే చూసుకుంటారు. ఇక మీరు పాతకథకి ఫుల్ స్టాపు పెట్టండి. త్వరగా కోలుకొని మీ ఉద్యోగం మీరు చేసుకోండి-' అంటూ సలహా ఇచ్చేవారే.

నన్ను ఓదార్చడానికి వచ్చినవారందరూ చివరికి నన్ను నీరసపెడుతున్నవారే అయ్యా రు. నేనింతవరకూ చేసిన ప్రయత్నాలూ, తిన్న దెబ్బలూ, నేను ప్రదర్శించానని సంతోషించిన ధైర్యసాహసాలూ అంతా వ్యర్థమైనట్లే అని పించింది. అలా తెలిసినవాళ్లూ తెలియనివా ళ్లూ అందరూ వస్తూనే వున్నారు; పిరికిమందు పోస్తూనే వున్నారు. నాకు చిరాకు వేసుకువ చ్చింది. ఇక తలుపులు బిడాయించుకొని ఎవ రినీ రానివ్వకపోవడం మంచిదనిపించింది కాని మర్యాద అలా చేయనివ్వదుకదా.

మధ్యాహ్నానికి రాకపోకలు తగ్గాయి. నేను భోజనం చేసి విశ్రాంతి తీసుకున్నాను. తరు వాత లేచి ఏదోపుస్తకం చదువుకోసాగాను. అంతలో శ్రీమతివచ్చి "ఎవరో వచ్చారండి మళ్లీ" అంది. 'నేను నిద్రపోతున్నాను' అని చెప్పి పంపివేయమందామనుకున్నాను కాని ఒక నిట్టూర్పువిడిచి "ఒకే... లోపలికి రమ్మను" అన్నాను.

ఆయన వచ్చాడు. ఆయనని ఎప్పుడూ చూసినట్టు గుర్తులేదు. పాతిక ముప్పైఏళ్లు వుండవచ్చు. మామూలు ఎత్తులో బక్కపల చగా వున్నాడు. బక్కమేక అంటే బాగుంటుందేమో. ఈయన ఇంకెంత సోదిచె ప్పి నీరుకారుస్తాడో అనుకున్నాను.

"క్షమించండి... నన్ను మీరు ఎరగరు. నిన్న పోలీసుస్టేషనుకి మీతోకూడా వచ్చినవాళ్లలో నేనూ వున్నానండి. తమ పరిచయంచేసు కుందుకు అవకాశం లేకపోయింది. నా పేరు సుబ్రహ్మణ్యం అండీ. ఈ పేటలోనే అవతలివీ ధిలో వుంటాను" అని పరిచయం చేసుకున్నా డాయన.

నేను ఆయన మొహంలోకి తేరిపారజూశా ను. ముందురోజు వచ్చినవారిలో ఆయనని చూసినట్లు గుర్తువచ్చింది. "చాలా సంతోషం - మిమ్మల్ని చూసినట్లు గుర్తువుంది. మీరన్నట్లు మనం ఒకరికొకరం పరిచయం చేసుకునే అవ కాశం లేకపోయింది. మీరేం చేస్తూంటారు?" అని అడిగాను.

"నేను చిన్నవాడినండి. కాఫీపొడి తయారు చేసి ఇంటింటికి తిరిగి ఖాతాదార్లకు అమ్ము తుంటాను. సైడ్‌బిజినెస్‌గా అప్పడాలూ, పిండి వడియాలూ, సాంబారుపొడీ, చారుపొడీ కూడా తయారుచేసి అమ్ముతూ వుంటాను. మా ఇంటి ల్లిపాదీ ఆ పనిలోనే వుంటామండి. ఏదో పొట్ట గడిచిపోతోందండి- అంతే" అన్నాడాయన.

"మీరు నిజంగా అదృష్టవంతులండీ సుబ్ర హ్మణ్యంగారూ! ఒకరి దయాదాక్షిణ్యాలమీద ఆధారపడక ఒకరిచేత ఆజ్ఞాపించబడనక్కర్లే కుండా మీ కాళ్లమీద మీరు నిలబడి జీవితం గడపగలుగుతున్నారు. అంతకన్నా ఏంకా వాలి? ఇతరుల కష్టం దోచుకొని మేడల్లో మిద్దె ల్లో కులికేవారికన్న తమ కష్టంమీద తాము బతికేవారు పేదవారైనా గొప్పవారేనండి, వారే నిజంగా గౌరవపాత్రులండీ" అని నేనాయనని అభినందించాను.

"మాష్టారూ... మీ హృదయం ఎంత విశా లమో మరొకసారి రుజువయిందండీ. మీతో ఇదివరకే పరిచయమైవుంటే ఎంత బాగుండునో అనిపిస్తోందండీ నాకు. నేను అల్పుణ్ణి. నావల్ల ఇతరులకు ఒనగూడే ప్రయో జనమూ అంతగా వుండదు. కాని మీవంటి వారివెనక నిలబడితే కనీసం నా జీవితానికి ఒక సార్థకత ఏర్పడుతుందనుకుంటానండీ" అన్నాడాయన.

ఈ పరస్పర ప్రశంసాపర్వం నా బాధలో కూడా నాకు కొంచెం నవ్వు తెప్పించింది. కాని నాపట్ల ఇలా మాట్లాడినవాడిని ఆయనొక్కడినే చూశాను. అందువల్ల ఆయన మాటలు నాకు కొంత ఆనందం కలగజేశాయని ఒప్పుకోక తప్పదు. నేనన్నాను- "నాపట్ల ఇంత సద్భావం ప్రకటించినవారిని ఇప్పటివరకూ మిమ్మల్ని ఒక్కరినే చూశానండి. అందుకు ధన్యవాదాలు.

కాని మీరు నన్ను మరీ ఆకాశానికెత్తేస్తున్నారు. నేనూ మీలాంటి అల్పజీవినే... కాదంటే ఒక మెట్టుపైన వున్నానేమో! అంతే- నా గొప్పతనం ఏమిటో, నా నాయకత్వం ఏమైందో నిన్న మీరే చూశారుగదా''

''నిన్న జరిగినదానికి నేనూ విచారిస్తున్నానండి. ప్రజాసేవకులనబడే అధికార్లే అలా వ్యవహరించడం చాలా శోచనీయమండీ. చేసిన ప్రయత్నం ఫలించకపోయినా అది మన వైఫల్యమని ఎందుకనుకోవాలి? మనం చేసింది సదాశయంతోనేకదా'' అన్నాడాయన.

నేనెవరో బక్కజీవి అనుకున్నవాడు అటువంటి ఉదాత్తభావాలు వ్యక్తపరచడం నాకాశ్చర్యం వేసింది. అంతలో మా శ్రీమతి ఇద్దరికీ టీ తెచ్చింది. నేను టీ తీసుకోబోతూ నొప్పితో కొద్దిగా మూలిగాను.

''అయ్యో... నేనెంత మూర్ఖుణ్ణండీ. మీకు





దెబ్బలు తగిలాయని తెలిసికూడా ఆ విష యమే మరిచాను. మీకు దెబ్బలు తగలనట్టే వ్యవహరించారు. అది మీ గొప్పతనంకాదండీ? ఇంతకీ ఎవరు మిమ్మల్ని కొట్టారు? ఎందుకు కొట్టారు? చాలా బాధపెట్టి వుంటారు మిమ్మ ల్ని?'' అన్నాడు సుబ్రహ్మణ్యం.

''ఆ రౌడీలే, ఇంకెవరు! వాళ్లకడ్డు వచ్చా మనీ, వాళ్లమీద ఫిర్యాదు చేశామనీ కొట్టారు. చేతికి వచ్చినట్టు కసితీరా కొట్టారు. బాధించ డంలో ఆనందం వున్నవారు ఎలా కొడతారో అలా కొట్టారు. ఎటువచ్చీ ప్రాణాలతో వదిలిపె ట్టారు- అదే మహద్భాగ్యమనుకోవాలి'' అని చెప్పాను నేను.

''ఎంత దారుణం! ఇలాంటివి అడ్డగించే మార్గమేలేదా? ఎవరైనా ఏదైనా చేద్దామనుకో డంలేదండీ?'' అని అడిగాడు.

''అందరూ సానుభూతి చూపిస్తున్నారు- అంతే! అందరూ చెప్పేది దుష్టులకు దూ రంగా వుండమనే. ఇతరుల వ్యవహారంలో జోక్యంచేసుకోవద్దనే. ఇక పోలీసులకు ఫిర్యాదు చేయడం వ్యర్థం అని ముందే తేలిపోయింది కదా'' అన్నాను నేను.

''అవునండి. అంతేకాదు వాళ్లు ఎదురెత్తు మీమీద కేసుపెట్టవచ్చు. మీరే కొట్టారని సాక్ష్యంకూడా పుట్టించవచ్చు'' అన్నాడాయన. కొద్దిసేపు ఆగి మళ్లీ అన్నాడు- ''ఈ సమా జంలో ధర్మాధర్మవిచక్షణ క్రమంగా అంత రించిపోతోందండీ. ఒకవేళ ఇది ధర్మం ఇది అధర్మం అని తెలిసినా ధర్మంపక్షాన, అధర్మా నికి వ్యతిరేకంగా నిలబడేధైర్యం ఎవరికీ లేదండీ? ఇక ఆ జ్ఞానం వుండిమాత్రం ప్రయో జనం ఏమిటి? ఆచరణలోకి రాని జ్ఞానం అజ్ఞానంతో సమానమే''

కాఫీపొడి అమ్ముకుంటూ అల్పజీవినని చె ప్పుకునే అతనినుంచి ఆ మాటలు రావడం నాకు ఆశ్చర్యం గొలిపింది.

నా కళ్లలో ఆశ్చర్యం గమనించినట్లున్నాడు. తనే వివరించాడు- ''క్షమించండి... నేను కాలే జిమొహం ఎరగనుకాని మా నాన్నగారు నాచేత రామాయణమహాభారతాలు చదివించారు. నాకు స్వామి వివేకానందుని రచనలు కూడా ఇష్టమండీ. అవి చాలావరకు చదివానండి. తరుచు మననం చేసుకుంటానండి. నాకు కాస్త తీరిక దొరికినప్పుడు ఇతర పుస్తకాలు కూడా చదువుతానండి''

ఈ సుబ్రహ్మణ్యం గురించి నా అభిప్రాయం పూర్తిగా మారిపోయింది. వటువింతయైనట్లు మొదట్లో బక్కప్రాణిలా తోచినవాడు నాదృష్టిలో అంతకంతకు ఉన్నతంగా ఎదిగిపోసాగాడు. అతనే మళ్లీ అన్నాడు:

''క్షమించండి- నా సొంత విషయం చెప్పవ చ్చా?''

''చెప్పండి'' అన్నాను నేను.

''మా నాన్నగారు ఎలిమెంటరీ స్కూలు టీచరండి. ఇద్దరు కొడుకులు, ఇద్దరు కూతు ళ్లు. మా అన్నయ్యకి ముందు పెళ్లి అయింది. వేరే ఊరులో ప్లీడరు గుమాస్తాగా బతుకు సాగిస్తున్నాడు. మా నాన్నగారు పేదవారుకాబ ట్టి ఆడపిల్లల పెళ్లి సమస్య అయికూర్చుంది. మా స్వగ్రామంలో ఒక పాతపూరిల్లు, చిన్నభూ మి చెక్కా అమ్మివేసి ఆ డబ్బులో నగంపెట్టి మా అక్క పెళ్లిచేశారు. మిగిలిన సగం మా చెల్లెలి పెళ్లికోసం వుంచారు. వెంటనే అవ సరం లేదుకాబట్టి మా దగ్గరబంధువు మాటన మ్మి అతను నెలనెలా మంచి వడ్డీ ఇస్తాడన్న ఆశతో ఆ డబ్బు అతనిదగ్గర దాచారండి. ఆ బంధువు మొదట్లో నెలనెలా వడ్డీ టంచనుగా ఇచ్చేవాడు- దానితో మానాన్నగారు చాలా సంతోషించేవారు, కాని క్రమంగా ఆ మనిషి వడ్డీ ఎగగొట్టడం మొదలుపెట్టాడు. చివరికి అసలుకే ఎసరుపెట్టాడు. మా నాన్నగారు నానా ప్రయత్నాలు చేశారు. వాళ్లనీ వీళ్లనీ ఆశ్ర యించారు. కాని లాభం లేకపోయింది. మా నాన్నగారు మనిషిమీద నమ్మకం ముఖ్యమను కుని రాతకోతలు సరిగా చూసుకోలేదు. అందు వల్ల తన ప్రాణాధారమైన ఆ సొమ్ముతిరిగిరా దని తేలిపోయింది. దానితో మా నాన్నగారు బెంగపెట్టుకుపోయి చిక్కిశల్యమైపోయారు. ఇంతలో రిటైర్మెంట్ కూడా వచ్చింది. ఆ నంద ర్భంగా వచ్చిన పెన్షనుబకాయీ, గ్రాట్యుటీ ఖర్చుచేసి మా చెల్లెలి పెళ్లికూడా ఎలాగో జరిపించి తన కర్తవ్యం నెరవేర్చారు. మా నాన్నగారిపట్ల సానుభూతి చూపినవారే అరుదై నప్పుడు సాయంచేసేవారెవరుంటారు? పైగా అలాటివాడిని ఎవరు నమ్మమన్నారు అని మా




నాన్నగారినే నిందించారండీ చాలామంది. అవతలివాడిని తప్పుపట్టినవారెవరూ లేకపోయారు. పైగా ఎలాగో అలా నాలుగు డబ్బులు చేసుకొని దర్జాగా జీవితంగడుపుతున్నాడు కాబట్టి అతనిని పెద్దమనిషిగానే భావించి అలాగే వ్యవహరించసాగారు. ఆవిధంగా వాడికి వచ్చిన నష్టమేమీలేదు, మేమే నష్టపోయాం. మా నాన్నగారు ఇదంతా మనసులోపెట్టుకొని మా చెల్లెలి పెళ్లిచేసిన కొద్దికాలానికే కాలంచేశారు. ఫలితంగా నా చదువు పదోతరగతివరకు మాత్రమే సాగిందండీ. ఉద్యోగం లభించే ఆశలేక చివరికి ఈ వృత్తి అవలంబించాను. నేను నాదగ్గర కాఫీపొడి, అప్పడాలువగైరా కొని నాకు సాయం చేయమని ఎవరినీ అర్థించను. నా సరుకు బాగుంటేనే కొంటారు. అందువల్లనే నేను ఎవరి దయాదాక్షిణ్యాలమీద ఆధారపడటంలేదండీ. ఒకవేళ ఇక్కడ గడవదనుకోండి- మరో ఊరు పోతాను. ఈ వృత్తిలో గడవకపోతే మరో వృత్తి చేబడతాను. అవసరమైతే రిక్షాతొక్కడానికీ నేను సిద్ధమేనండీ'' అన్నాడతను.

అతని మాటలు వింటూంటే నాకంతకంతకు ఆశ్చర్యం ఎక్కువైపోసాగింది. ఏమి మాట్లాడాలో నాకు తెలియలేదు.

అతనే ఇంకా అన్నాడు- ''మా నాన్నగారు లోకం దృష్టిలో ఓడిపోయిన మనిషండీ. కాని నాదృష్టిలో ఆయన ఆరాధ్యదైవమండీ. ఆయన ఎన్నడూ ఎవరి సొమ్ము పైసా తినలేదు. మాటతప్పడం ఆయన ఎరుగడు. శక్తిమేరకు ఇతరులకు సాయపడ్డానికే ప్రయత్నించేవారు తప్ప స్వార్థమే చూసుకొని ఇతరులను మరచిపోయేవారు కాదు. ఎవరికైనా ఒక మంచిమాట చెప్పడానికే సిద్ధంగా ఉండేవారు. అంతేకాకుండా జీవితంలో ఉన్నత విషయాలను గురించికూడా ఆలోచించాలని మాకెప్పుడూ చెపుతూఉండేవారు. అలాగే నేను రామాయణ మహాభారతాది గ్రంథాలు వివేకానందుని రచనలు వగైరా చదవడం జరిగింది. మానాన్నగారికి కలిగిన కటువైన అనుభవాల తరువాతకూడా 'బాబూ, మనమలందరూ ఒకటికాదు, అనేకులు దుర్మార్గులు, మోసగాళ్ళూ ఉండవచ్చు.. వాళ్ళేఎక్కువ సంఖ్యలో ఉండవచ్చునుకూడా అయినా మానవతపట్ల విశ్వాసం పోగొట్టుకోకు. సమాజం ఎంతదారుణంగా తోచినా మొత్తం సమాజాన్ని ద్వేషించకు. ఆ సమాజంలోనే మనలాంటివాళ్లు కూడా ఉంటారు. కాబట్టి ఎవరెలా ఉన్నా ఏమిచేసినా, నీమట్టుకు నువ్వు నీ బతుకు బతుకుతూనే ఇతరుల గురించి ఆలోచిస్తూనేఉండు. చేతనైన సాయం చేస్తూనే ఉండు. ఎప్పుడూ ధర్మంపక్షానే ఉండు. అధర్మానికి తలవంచకు' అని నాకు బోధించారండి. ఆ ఆదర్శమే నేను నాముందుపెట్టుకుంటాను. అది అందుకోలేకపోతూ ఉండవచ్చు. అప్పుడప్పుడు వైఫల్యాలు కూడా ఎదురవచ్చు. కాని ఆ ఆదర్శంకోసమే ప్రయత్నిస్తూ ఉంటానండి. అందుకే అటువంటి ఆదర్శం మూర్తీభవించిన మీరు నాకు దొరికారు. ప్రాణంలేచివచ్చినట్లైంది. నన్ను కూడా మీ అనుచరుల్లో ఒకరిగా ఎంచండి''.

సుబ్రహ్మణ్యం నన్నేదో ఆదర్శమూర్తినని భావించడం నాకు సిగ్గువేసింది. నిజంగా ఆదర్శవ్యక్తి అతనే. అందుకే అతనికి స్పష్టంగా తెలియజేశాను. ''సుబ్రహ్మణ్యంగారూ, నేనిన్నాళ్ళు ఒంటరివాడననుకుంటూవచ్చాను. ఇప్పుడు మీరునాకు లభించారు. ఇంతకుముందు నేను మీకన్నా ఒకమెట్టుపైన ఉన్నానేమో అన్నాను. నిజానికి మీరే ఒకమెట్టుపైన ఉన్నానాలి. మీనాన్నగారిని చూసేభాగ్యం నాకులేదు. కాని ఇకముందు ఆయన నాకుకూడా ప్రేరణ ఇచ్చే మహావ్యక్తే. సుబ్రహ్మణ్యంగారూ, ఇకముందు మనమిద్దరం స్నేహితులం సమానమైనవాళ్ళం. నాకిప్పుడు ఒంటిబాధ పోయినట్లైందండిమళ్ళీ ఉత్సాహం పుంజుకుందండి'' అన్నాను నేను.

అంతలో మాశ్రీమతి వచ్చి ఎవరోవచ్చారండీ మీకోసం అని చెప్పింది. ఆమె వెనక్కివెళ్ళి పిలుచుకువచ్చేలోపునే ఆ వ్యక్తి లోపలికి వచ్చేయనే వచ్చేశాడు. నేనొకక్షణం తెల్లబోయాను. తరువాత గుర్తువచ్చింది శ్యామలతండ్రి అని. ''దయచేయండి'' అని నేనులేవబోయాను. అంతలో సుబ్రహ్మణ్యంగారు ''మీరుండండి, మాస్టారు లేవకండి'' అని తను కూర్చున్న కుర్చీలోనుంచి లేచినిలబడి ''అయ్యా దయచేయండి'' అని ఆ కుర్చీ చూపించాడు.

ఆయన ''నేను కూర్చోడానికి రాలేదు'' అని

అలాగే నిలబడి- "అయ్యా మాస్టారూ, మీరు మా అమ్మాయికి జరిగిన అన్యాయాన్ని సరిదిద్దడానికే పోలీసు కంప్లైంట్ ఇవ్వడానికివెళ్ళారట. ఇంకా ఏవేవో చేద్దామనుకుంటున్నారట. అభాగ్యురాలు మా అమ్మాయి జీవితం అర్థాంతరంగానే ముగిసింది. అది మాకర్మ అనుకుంటాను. పోయినది ఎలాగైనా తిరిగిరాదు. కనీసం దాని ఆత్మనైనా శాంతంగా ఉండనివ్వండి. మీరుచేసే ప్రయత్నాలవల్ల చచ్చిపోయిన తరువాతకూడా దానిమీద అపవాదులు ఏర్పడుతున్నాయి. దయవుంచి, ఇక మా అమ్మాయి పేరు ఎత్తకండి. ఇదే మీరు మాకుచేయగల మహోపకారం. నా ప్రార్థనమన్నించండి. ఇవి చేతులుకావు కాళ్ళనుకోండి" అని నాచేతులొక్కసారి స్పృశించి "మరిసెలవు" అని చెప్పి వెళ్ళిపోయాడాయన.

కొంతసేపు దిగ్భ్రమలో పడిపోయానునేను. తేరుకొని చూసేటప్పటికి నేను కొండఎత్తునగాక గోతి అట్టడుగున ఉన్నట్లు గమనించాను. సుబ్రహ్మణ్యంకేసి చూశాను. ఆయన అన్నాడు- "ఆమెకి జరిగిన అన్యాయాన్ని మరచిపోతేనే ఆ దుర్మార్గుల్ని స్వేచ్ఛగా వదిలితేనే ఆమె ఆత్మకు శాంతి కలుగుతుందా? ఎంత విడ్డూరం! అయినా మాస్టారూ కన్నతండ్రే అలా అంటునప్పుడు మనం ఇక ఆ అమ్మాయి పేరుఎత్తకోలేమోనండి"

"అవును...అలాగే తోస్తోంద"న్నాను నేను.

అంతలో లక్ష్మీపతి లోపలికివచ్చాడు! నేను చోద్యంగా చూశాను.

"మీపక్కింటి యజమానితోపని ఉండివచ్చాను. ఇలా వచ్చానుకదా ఒకసారి చూసిపోదామనుకున్నాను.ఇప్పుడెలా ఉంది? కొంచెం నయమైందా? నేను చెప్పినదాని గురించి ఆలోచించారా" అని ఆగి "అన్నట్టు ఆ అమ్మాయి తండ్రి ఇటువచ్చినట్లున్నాడు. మీదగ్గరికేమైనా వచ్చాడా?" అని అడిగాడు.

"అవునండీ, ఆయనే ఇక్కడికి వచ్చారు ఇకముందువాళ్ళ అమ్మాయి మాట ఎత్తవద్దని చెప్పి వెళ్లాడు" అని చెప్పాను నేను.

"అలాగా" అని ఊరుకున్నాడు లక్ష్మీపతి ఆయనకేదో తెలిసినట్లుంది.

"ఆయన పనికట్టుకొని ఇలావచ్చి చెప్పివెళ్లడమేమిటి?" అని అడిగాను నేను.

లక్ష్మీపతి నోరువిప్పాడు- "ఆ వరప్రసాదరావు ఈయనను పిలిపించి కథ అంతా సాంతం విని, ఎంతో సానుభూతి చూపి కూతురుపోయినందుకు నష్టపరిహారంగా, సహాయంగా మూడువేల రూపాయలు ఇచ్చాడట. పేదవాడి కంతసొమ్ము చూస్తే ప్రాణం లేచింది ఆయనకు మళ్ళీమళ్ళీ నమస్కారాలు పెట్టి 'నాతల్లి చనిపోయిన తరువాత కూడా మమ్మల్ని ఆదుకుంటోంది' అని కళ్లనీళ్ళు పెట్టాడట" అని చెప్పిన తరువాత మీకుబాగా నయంగాఉందికదూ? అని అడిగి, నాచేత అవుననిపించుకొని "వస్తానని" చెప్పి వెళ్లిపోయాడు. సుబ్రహ్మణ్యం ఎవరు, ఏమిటి అని కూడా అడగలేదు.

ఆయన వెళ్లిపోయిన తరువాత సుబ్రహ్మణ్యం అన్నాడు"డబ్బు, న్యాయమూ ఆత్మశాంతి కూడా కలగచేస్తుందన్నమాటండీ!"

"సుబ్రహ్మణ్యంగారూ, ఇకనుంచి మనలో ఎవరమూ శ్యామల పేరుఎత్తవద్దు. అయినా ఆమె నాకళ్ళముందు ఉంటూనేఉంటుంది. అన్యాయానికీ అధర్మానికీ వ్యతిరేకంగా పోరాటం మానవద్దని చెప్తూనే ఉంటుంది. అటు మీ నాన్నగారూ పైనుండి మనకి ఆదర్శం బోధచేస్తూనే ఉంటారు. మనం కలిసే ఉద్యమిద్దాం" అన్నాను నేను.

"తప్పక మాస్టారూ" అన్నాడాయన.

★ ★ ★

మరి రెండురోజులకే సమాజం మా సేవకోసం ఆగలేదనీ, తన ఏర్పాట్లు ఏవో తనే చేసుకుందనీ తెలిసింది. ఏమంటే మా పేటలో కొందరు పెద్దలు ఆ సురేశ్ కాళ్లు పట్టుకొని, కొంత డబ్బు కూడా ఇచ్చి, మా పేట వాళ్ళని వదిలెయ్యమని ప్రార్థించారట — పురవాసులు బకాసురిడితో ఒప్పందం కుదుర్చుకున్నట్టు. సురేశ్ 'అలాగే ఇక మీకేం భయంలేద'ని వాళ్లకి ధైర్యమిచ్చాడట. 'మా పేటవాసులు స్వేచ్ఛగా ఊపిరి పీల్చుకోసాగారన్నమాట. కాని ఈ విధమైన ఏర్పాటువల్ల పెద్దపులి మారలేదనీ, దాని స్వైరవిహారాలు యథేచ్ఛగా సాగుతూనే ఉన్నాయనీ, ఎటువచ్చీ ఇప్పుడు మరొక పేటవాసులు దాని దాడులకు గురి అవుతున్నారనీ అర్థమన్నమాట, 'ఇదేం ఏర్పాటయ్యా'




అంటే, 'వాళ్ళ బాగు వాళ్ళు చూసుకుంటారు, మనకెందుకు? మనం అపాయం నుంచి బయటపడ్డాంకదా, అంతేచాలు మనకి' అని సంతోషిస్తున్నారు మావాళ్ళు.

నాకూ, సుబ్రహ్మణ్యానికీ ఈ వ్యవహారం చూసి నవ్వాలో, ఏడవాలో అర్థంకాలేదు. సుబ్రహ్మణ్యం అన్నాడు— "చూశారా మాష్టారూ, ఒకవైపు రైళ్లూ, విమానాలూ, రేడియో, టెలివిజన్ వగైరాల ద్వారా ప్రపంచం ఒకటైపోతూంటే, మరోవైపు ప్రజలు ఎంత సంకుచితమైపోతున్నారో! ఈ పరిస్థితుల్లో మనం మాత్రం చేయగలిగిందేముంది? కాని నరభక్షకులకు నీతినియమాలు ఉంటాయా? వారు ఇచ్చేమాటకి ఎంత విలువ ఉంటుంది? వారు తమ స్వభావం ఎందుకు మరిచిపోతారు? మళ్లీ ఇంకోవిధంగా దెబ్బ తీయకమానరు. అటువంటి దెబ్బ చక్రవర్తీతోసహా అన్నట్లుంటుంది. అప్పుడేమి ఏర్పాటు చేస్తారో చూద్దాం".

బయట లోకం మాట ఎలా ఉన్నా నాకు ఆత్మీయుడైన మిత్రుడు దొరికాడు. ఆదర్శాలూ, భావాలలో ఏకత్వమే కాకుండా ఇద్దరికీ పుస్తకపఠనంలో ఆసక్తికూడా ముఖ్యమైన బంధమైంది. ఊరికే పుస్తకాలు చదివి పారెయ్యడంకాదు, ఆ చదివిన దానిని గురించి ఆలోచించడం, దానిని జీవితానికి సమన్వయం చేసుకోవడం ముఖ్యం. ఈ దిశలో మేము ఒకరి అభిప్రాయాలు ఒకరికి తెలియపరచుకుంటూ చర్చించుకుంటూ ఉంటాం. మా చర్చల్లో వేడికి తావులేదు. అందుకే మా స్నేహం దినదిన ప్రవర్ధమానం కాసాగింది. కాని చిత్రంగా మా స్నేహం ఇతరులకు విడ్డూరంగా తోచింది. మాతోటి మాష్టార్లు— "అదేమిటండీ మీరు బి.ఎ.బి.ఇడి, హైస్కూలు టీచరు. అతను పదో తరగతి వరకు మాత్రమే చదివినవాడు. పైగా ఇంటింటికీ తిరిగి కాఫీపొడి, అప్పడాలూ అమ్ముకునేవాడు. అతనితో స్నేహమేమిటి? హోదా, స్థాయీ చూసుకోవద్దా" అని ఆక్షేపించారు. కొందరైతే— "ఈయన వెర్రి మరీ ముదిరిపోతోంది. మాష్టార్ల మర్యాద మంటగలిపేస్తున్నాడు" అని ఛీత్కరించడం కూడా నాకు తెలియవచ్చింది.

కాని వారి విమర్శలను నేను పట్టించుకోలేదు. అంతేగాక మా శ్రీమతినీ, పిల్లలనీ ఆయన శ్రీమతి, పిల్లలకీ పరిచయం చేశాను.

నాకు సంతోషం కలిగించిన విషయమేమంటే మా శ్రీమతి, సుబ్రహ్మణ్యం శ్రీమతి ఇద్దే అక్కచెల్లెళ్ళు కలిసిపోయారు.

ఈ పరిణామం ఊహించనివిధంగా చాలా మంచిదీ, అవసరమైనదే అయింది. ఎందుకంటే ఊళ్ళో ఒక అనుకోని సంఘటన (కాని ఈరోజుల్లో సామాన్యమైనదే) జరిగింది. పోలీసులు దొంగతనం చేశాడన్న అనుమానం మీద రామగోపాల్ అనే వ్యక్తిని అరెస్టు చేసి లాకప్పులో పెట్టారు. లాకప్‌లో దారుణంగా కొట్టి ఉంటారు. చిత్రహింసలు పెట్టి ఉంటారు. ఆ మనిషి కాస్తా చచ్చిపోయాడనుకున్నారు. దానితో కంగారుపడి పోలీసులు శవాన్ని ఆసుపత్రిని చేర్చి, అక్కడే చచ్చిపోయాడనిపించి, పోస్టుమార్టమ్ తతంగం కూడా పూర్తిచేసి రామగోపాల్‌కి దహనకాండ కూడా జరిపించేశారు.

రామగోపాల్ తల్లిదండ్రులకి, ఇతర బంధువులకీ, స్నేహితులకీ రామగోపాల్ తప్పనిసరిగా వచ్చేసమయానికి తిరిగి రాకపోతే వెళ్ళి పోలీస్‌స్టేషనులో ఫిర్యాదు చేశారు. అక్కడ పోలీసులు మొదట చూపిన తత్తరపాటు చూసి వాళ్లకనుమానం తలయెత్తి— "మా రామయ్యా ఏమయ్యాడ"ని గట్టిగా నిలదీశారు.

పోలీసులు మాకేమీ తెలియదని బుకాయించారు.

వాళ్ల బుకాయింపే వీళ్ళ అనుమానాన్ని మరింత పెంచింది. దానితో వెనక్కిపోయి తమ పేటవాళ్లని రెండుమూడు వందల మందిని తీసుకువచ్చి పోలీసుస్టేషన్‌ని చుట్టుముట్టారు. అప్పటికీ పోలీసులు మీ రామగోపాల్ ఎవడో మాకు తెలియదన్నారు.

ఎవరో అందించిన సమాచారం ఆధారంగా— "ఈవేళ పోలీసు లాకప్పులో చచ్చిపోయిన మనిషి ఎవరు?" అని అడిగారు వాళ్లు.

"పోలీసుస్టేషనులోకాదు, ఆసుపత్రిలోనే చచ్చిపోయాడ"న్నారు పోలీసులు.

"అదే...ఆ మనిషిని ఏంచేశారు?" అని జనం గద్దించారు.

"అతనివాళ్ళు ఎవరి అడ్రసూ తెలియక పోస్టుమార్టమ్ తరువాత శవాన్ని దహనం చేసివేశామ"న్నారు పోలీసులు.

"ఆ వ్యక్తి ఫొటో చూపించమ"ని గద్దించారు జనం.

పోలీసులు వెంటనే మాట్లాడలేదు.

వాళ్ల మౌనం, బిత్తరచూపులూ, జనం అనుమానాన్ని దృఢపరిచాయి. దానితో వారు రెచ్చిపోయారు.

చివరికి పోలీసులకి ఫొటో చూపక తప్పలేదు. అది చాలా అస్పష్టంగా వుంది. అయినా అందులో రామగోపాల్ పోలికలు స్పష్టంగా గుర్తుపట్టారు అతనివాళ్లు. దానితో ప్రళయం చెలరేగింది. స్టేషనుమీద రాళ్ళు విసరడం మొదలుపెట్టారు. గోడ కూల్చి, తలుపులూ, కిటికీలూ బద్దలుకొట్టసాగారు. దానితో పోలీసులు లాఠీ ఛార్జి చేశారు. దాని ప్రభావం అంతగా లేకపోయింది. మరింత జనం చేరి రాళ్లవాన మరింత ఉధృతమై ఒక సబ్‌ఇన్‌స్పెక్టరూ, ఒక హెడ్‌కానిస్టేబులూ, నలుగురు కానిస్టేబుళ్ళూ గాయపడ్డారు. దానితో కాల్పులు జరిగాయి. కాల్పుల్లో ఒక వ్యక్తి అక్కడికక్కడే చచ్చిపోయాడు. పదిమంది గాయపడ్డారు. వారిలో ముగ్గురు తీవ్రంగా.

ఇంకేముంది, ఊరే అంటుకుంది. బస్సులు ధ్వంసం చేయటం, ట్యూబ్‌లైట్లు పగలగొట్టడం, ప్రభుత్వకార్యాలయాలమీద దాడి, అన్నీ జరిగాయి. ప్రతిపక్షాలవారు నడుంబిగించి ముందుకు దూకారు. సంఘవ్యతిరేకశక్తులు అంతకుముందే దిగారు రంగంలోకి. లూటీలూ, గృహదహనాలూ ప్రారంభమయ్యాయి. పౌరజీవనం స్తంభించిపోయి, అస్తవ్యస్తమైపోయింది. ముందర 144 సెక్షను ప్రకటించి, పరిస్థితి అంతకన్నా మించిపోయిందని తెలిసి నగరంలో చాలాభాగంలో కర్ఫ్యూ విధించారు. అయినా లూటీ, హింసాకాండా జరుగుతూనే ఉంది. ఆ సందర్భంలో పదులకొద్దీ మనుషుల్ని నిర్బంధంలోకి తీసుకున్నారు. వారిలో నేనొకణ్ణి.

* * *

నేను అరెస్టుకావడం పిడుగుపాటులాగే అయిందినాకు. నాకూ, ఈ సంఘటనకీ ఏమి సంబంధం? ఏ విధంగా చూసినా నన్ను అరెస్ట్‌చేయడానికి కారణం ఊహించలేకపో




యాను. పోలీసుల దృష్టిలో నేనంత అపాయ కర వ్యక్తినయిపోయానా? పైగా నన్ను అరెస్టుచేసిన పద్ధతి కూడా విచిత్రంగా ఉంది. మధ్యాహ్నం రీసెస్‌లో స్కూలునుంచి ఇంటికివచ్చి టిఫిను తీసుకొని కొద్దిసేపు విశ్రమించి తిరిగి బడికి వెళ్తూంటే దారిలో ఎవరోవచ్చి నన్నుతమ అయ్యగారు రమ్మంటున్నారని పిలుచుకువెళ్లాడు. తీరాచూస్తే పోలీస్ సబ్ ఇన్‌స్పెక్టర్, ఇద్దరు కానిస్టేబుళ్ళు ఉన్నారు. "మీతో కొంచెంపనుంది. మాతో పోలీస్ స్టేషన్‌కురండి" అని నన్ను జీపులో ఎక్కించుకొని పోలీస్ స్టేషనుకు తీసుకుపోయారు.

అక్కడ ఎవరూ నన్ను పట్టించుకున్నవాళ్ళే లేకపోయారు. అక్కడ కానిస్టేబుల్సునిఅడిగినా వాళ్ళు ఏమీచెప్పలేదు. ఆ సబ్‌ఇన్‌స్పెక్టరు మళ్ళీ కనిపించలేదు. చివరికి ఐదుగంటలకి ఒక హెడ్ కానిస్టేబులు నడిగితే- "మీరు అరెస్టయినట్లే" అని చెప్పాడు.

"ఈవిషయం ముందే చెప్పవచ్చుకదా. మాయింట్లో వాళ్ళకి చెప్పివద్దును. వాళ్ళు నాకోసం చాలా ఆందోళన పడతారు" అన్నాను నేను.

హెడ్‌కానిస్టేబులు మారుపలకలేదు. సాయంత్రం ఆ సబ్ ఇన్‌స్పెక్టరు వచ్చాడు. అప్పుడు నాకు వారంటుఇచ్చారు. అందులో- "ప్రజల్ని హింసాకాండకు పురికొల్పుతున్నందుకు అరెస్ట్ చేసినట్టు" ఉంది.

"ఈవారంటు నాకు ముందే ఇవ్వవచ్చుకదా. నేను ప్రజల సలహా తీసుకొనే అవకాశం ఉండాలికదా. మీరు అవలంభించిన పద్ధతి సరియైనదేనా?" అని నేనడిగాను.

"మీ ప్లీడరు ఎవరూ?" అని అడిగాడు ఎస్.ఐ.

నేనెవరని చెప్పను? నాకింతవరకు ఏ ప్లీడరుతో పరిచయంలేదు. "నాకింకా ఎవరితో పరిచయంకాలేదు. కాని మీరు వారంటు చేసినప్పుడు నేను ఎవరినైనా ప్లీడరుని సంప్రదించి నన్నునేను సమర్ధించుకుందుకు నాకు హక్కు ఉందికదా?" అన్నానునేను.

"అయితే రేపాలోచిద్దురుగానిలెండి" అని ఆ ఇన్‌స్పెక్టర్ వెళ్ళిపోయాడు.

మరికొంతసేపటికి నన్ను తీసుకొని వెళ్ళి ఒక జెయిలుగదిలో పెట్టారు. నాపేరు ముందుగా నమోదుకాలేదుకాబట్టి నాకాపూట ఆహారం తీసుకునే అవకాశం కూడా లేకపోయింది. కొంచం నీళ్ళు తాగి సంతృప్తిపడవలసి వచ్చింది.

ఆ గదిలో మరో ఐదుగురు ఉన్నారు. వాళ్ళు ఆవారాగాళ్ళూ, పోలీసుల దృష్టిలో సంఘవ్యతిరేకశక్తుల్లా తోచేవాళ్లూ అంటే క్లీనర్లూ, వీధిలో అమ్మకాలు సాగించే వాళ్ళూ, సినిమా టికెట్టు బ్లాకులో అమ్మేవాళ్ళూ వగైరా. వాళ్ళు నన్ను చూసి నేనెవరో తెలుసుకొని నన్ను గౌరవంగానే చూడటం మొదలుపెట్టారు. అది నాకు కొంత సంతోషమే కలిగించింది. దానితో నేను వాళ్లని ఒక్కొక్కళ్లని పరిచయంచేసుకొని వాళ్ళని మాట్లాడించి వాళ్లకథలు వింటూ కూర్చున్నాను. వాళ్ళు మనిషిని నమ్మితే నిజంచెప్పేస్తారు. వాళ్లలా ఎందుకు తయారైందీ, వాళ్ళు ఏయే నేరాలు, తప్పులూ చేస్తున్నదీ దాచకుండా చెప్పివేశారు. వాళ్లకథలు వింటూంటే నాకు మంచి కాలక్షేపమేఅయి, నా ఆందోళన కొంత తగ్గినట్లయింది.

మాజైలుగది ఆరుగంటలకు బయట నుంచి తాళంవేశారు. మర్నాడు ఉదయం 6 గంటల వరకూ తిరిగి తెరవమని చెప్పారు నాగది అనుచరులు. వాళ్లలో కొందరికి ఇదంతా పాత అనుభవమే. లోపల లఘుశంక తీర్చుకోవలసినా, గురుశంక తీర్చుకోవలసినా ఒక కుండే దారి. మాలో ఒకడికి విరేచనాలు కూడా పట్టుకున్నాయి. దానితో మరీ ఇబ్బంది అయింది. ఆ కుండ జోలికిపోలేకపోయాను. కాని చాలాసేపు ఆపుకున్నా చివరికి ఉబ్బుకువచ్చి మరోదారిలేక ముక్కుమూసుకొని లఘుశంక తీర్చుకొని పడుకున్నాను.

మర్నాడు మాగది తాళాలు తెరిచారు. నిత్యకృత్యాలు తీర్చుకునేందుకన్నమాట. నాదగ్గర మరో బట్టల జత, తువ్వాలు కూడాలేవు. అక్కడ స్నానాలగదుల చాలా అధ్వాన్నంగా ఉన్నాయి. ఇంక మరుగుదొడ్ల పరిస్థితి చెప్పనక్కరలేదు. పాతికగజాలదూరంనుంచే దుర్వాసన కొడుతున్నాయి. నేను స్నానం చేయక నీళ్ళతో ఊరికే కడుగుకొని తుడుచుకున్నాను. ఎనిమిదింటికి అన్నంవచ్చింది. ఆ దృశ్యం



తలచుకుంటే ఇప్పటికీ నాకు కడుపులో దేవుతుంది. అందువల్ల వివరాల్లోకిపోను. ఓపిక ఉండాలికాబట్టి ఎలాగో నాలుగు మెతుకులు కతికాను. పదింటికి మమ్మల్ని వాహనాల్లో ఎక్కించి మేజిస్ట్రేటు కోర్టుకు తీసుకుపోయారు. ఆయన పదకొండు గంటలకు కాని కోర్టుహాలులోకిరాలేదు. కొంతసేపు ఏవో ఇతర కాగితాలు, వ్యవహారాలు చూసి తరువాత మా కేసుకు వచ్చాడు. పబ్లిక్ ప్రాసిక్యూటర్ కాబోలు ఏదో చెప్పాడు. మేజిస్ట్రేట్ తలవూపి ఏదో కాగితంపై సంతకంపెట్టాడు. ఏమి జరుగుతున్నదీ మాకు తెలియరాలేదు. మమ్మల్ని తిరిగి బయట వాన్‌దగ్గరకి నడవమన్నారు. అప్పుడు చూశాను దూరంగా జనంలో ఉన్న సుబ్రహ్మణ్యాన్ని. అతను నావైపుచూస్తూ చెయిఊపుతూ ఫరవాలేదు మేం చూస్తాం అన్నట్టు సైగ చేశాడు. నేను తలఊపి అప్పటికే పోలీసులు తొందరచేస్తూ ఉండటంవలన ముందుకు కదిలి వానులోకి ఎక్కికూర్చున్నాను.

సాయంత్రం నాలుగింటికి నన్ను మళ్ళీ పిలుచుకువెళ్లారు. మళ్ళీ మేజిస్ట్రేటు ముందు హాజరుపరిచారు. సుబ్రహ్మణ్యం ఒక ప్లీడరుగారి పక్కన నిలబడ్డాడు. ఆ ప్లీడరుగారు మేజిస్ట్రేటుతో ఏదో చెప్పారు. తరువాత నాచేత కాగితాలమీద సంతకాలు పెట్టించారు. నన్ను బెయిలుమీద విడిచిపెడ్తున్నట్లు చెప్పారు.

సుబ్రహ్మణ్యం, నేనూ ఆటోతీసుకొని మాయింటికి బయలుదేరాం. "నన్నెందుకు అరెస్ట్‌చేశారు? నాకింతవరకు బోధపడటంలేదండీ. ఇప్పుడు బెయిల్‌మీద విడుదలకి మీ కృషే కారణమనుకుంటాను. ఆ ప్లీడరుగారిని మీరే పెట్టారా? చాలా ఖర్చయిఉంటుందికదూ?" అన్నాను నేను.

"అదంతానేను తరువాత తీరికగా చెపుతాను. ముందు మీ శ్రీమతిగారినీ, పిల్లల్నీ కలుసుకోవడానికి సిద్ధపడండి" అన్నాడు సుబ్రహ్మణ్యం.

మరి రెండునిమిషాల్లోనే ఆటో మాయింటికి చేరింది. సుబ్రహ్మణ్యం నాచేతిలో చేయివేసి కూడా నడుస్తుండగా మా శ్రీమతీ, పిల్లలు, సుబ్రహ్మణ్యం శ్రీమతీ పిల్లలు ఆటో చప్పుడికి గుమ్మంలోకి వచ్చి నిలబడ్డారు. సుబ్రహ్మణ్యం అన్నాడు- "చూశారా అక్కగారూ, మాస్టారు కులాసాగానే ఉన్నారు. దగ్గరఉండి తీసుకువచ్చాను"

నేను గుమ్మంలోకి అడుగుపెట్టేవరకూ కృష్ణవేణి ఎలాగో ఊరుకుంది. లోపలికి అడుగుపెట్టగానే నన్ను చుట్టేసి బోరున ఏడ్చేసింది. ఆమె శాంతించిన తరువాత సుబ్రహ్మణ్యం అన్నాడు "మాస్టార్లు నిన్నటి నుంచి సరిగా తిండి తినిఉండరు. ముందు ఆయనకు కడుపునిండా భోజనం పెట్టండి"

నాకు నిజంగానే చాలా ఆకలిగాఉంది. నేను బెయిలుమీద విడుదల అయి వస్తానని ముందే అనుకున్నట్లుంది. వంట తయారు చేసి మైసూర్‌పాక్‌కూడా చేసింది. మైసూర్‌పాక్ అందరికి పంచిపెట్టగా నేను తృప్తిగా భోజనంచేశాను.

అప్పుడు చెప్పాడు సుబ్రహ్మణ్యం జరిగినది. "మీరు ఇదిగో వస్తారు, ఇదుగో వస్తారు అనుకుంటూ కృష్ణవేణక్కగారు చీకటిపడేవరకూ ఎదురుచూశారండి. అప్పటికీ రాకపోయేసరికి కంగారుపుట్టి మాకు కబురుచేశారు. స్కూలు మాస్టర్లను విచారిస్తే మీరు మధ్యాహ్నం బడికి రానేలేదని తెలిసింది. ఇంక ఎవరిని అడిగినా ఏమీతెలియరాలేదు. మిమ్మల్ని ఇంటిదగ్గరకాకుండా బడిదగ్గర కాకుండా అరెస్టుచేయడంవల్ల మాకు బేజారెత్తింది. ఆ రౌడీలు ఏ అఘాయిత్యమైనా చేశారేమోనని హడలిపోయాం. మా ఆవిడనీ, పిల్లలనీ మీ యింట్లోనే ఉండిపొమ్మన్నాను. కాని అక్కగారిని ఊరడించడం ఎవరివల్లా కాకపోయింది. ఆ రౌడీలు చేయవలసిన దారుణం ఇదివరకే చేశారు. కొత్తగా మీరు వాళ్లకి కోపంతెచ్చేపని ఏమీ చేయలేదు. అందువల్ల మీకేమీ అపాయముండదని నేను నచ్చజెప్పబోయానుకాని నన్నే కొంత సందేహం పీకసాగింది. ఊళ్లో స్వేచ్ఛగా తిరిగే అవకాశంలేదు, అందులోనూ అంతరాత్రివేళ మరీనూ. అందువల్ల నిన్నరాత్రి కాళరాత్రిలాగే నడచిందంటే నమ్మండి. ఈవేళ పొద్దున్న నాకు తెలిసిన ఒక పెద్ద లాయరుగారిని పట్టుకొని ఆయన ద్వారా విచారిస్తే మీరు అరెస్టయినవారిలో ఉన్నట్లు తెలిసింది. మా ప్రాణం కొంత లేచివచ్చింది. మన ప్రాంతంలో కర్ఫ్యూలేదుకాబట్టి నాకు తెలిసిన అనేక మందిని కలుసుకొని లాయరుగారికి మరి కొందరిచేతకూడా చెప్పించి మీ బెయిల్‌కోసం భగీరథ ప్రయత్నంచేయవలసివచ్చిందండీ. అన్నీ సిద్ధమనుకున్న తరువాత వ్యక్తిగతమైన హామీయివ్వడానికి ఇద్దరు పెద్దమనుషులు మాకు దొరకలేదండీ. లక్ష్మీపతిగారితోసహా మీ ఉపాధ్యాయులెవరూకానీ మీ ఇరుగుపొరుగులు ఎవరూకాని అలాంటి హామీపత్రాలపై సంతకంపెట్టడానికి సిద్ధంకాలేదు. చివరికి నేనే ఎలాగో ఇద్దరు పెద్ద మనుషుల్ని అందుకు ఒప్పించాను. ఇందాక కోర్టులో వారిద్దరూ ఉన్నారు. పనిఉండి త్వరగా వెళ్లిపోయారు. మిమ్మల్ని తీసుకొనివెళ్లి వారికి పరిచయంచేస్తాను. మన కృతజ్ఞతలు తెలియచేద్దాం"

"సుబ్రహ్మణ్యంగారూ, నేను అంతకంతకి మీకు ఎక్కువగా రుణపడి ఉంటున్నాను. మీరులేకపోతే నా పరిస్థితీ, నాకుటుంబ పరిస్థితీ





ఏమయ్యేదో. కాని మీరు ఇంత ఎలా చేయగలిగారు?" అని నేనడిగాను.

నేను చిన్నవాణ్ణి అని చెప్పానుకదా, మాష్టారు. నేను చిన్నవాణ్ణి కావడంవల్లేనేమో చాల మంది అభిమానం సంపాదించాననిపిస్తుంది. నేను కేవలం అమ్మకమే సాగించనండీ. వెళ్లిన ప్రతియింటివారిని అప్పుడప్పుడు పలకరిస్తూ, యోగక్షేమాలు కనుక్కుంటూ ఉంటానండి. ఒకరిద్దరు మరీ అహంభావులు - దనవంతులు తప్ప తక్కినవారు మంచి ప్రతిస్పందన చూపిస్తూఉంటారండీ. కొందరు తమ సొంత విషయాలు కూడా నాతో చర్చిస్తారండీ. నేను మరి ఎక్కువగా వారి వారికి తగినవిధంగా మంచిమాటలు చెప్పుతానండి. అప్పుడప్పుడు పిల్లలకు చాకలెట్లో బిస్కట్లో పెడుతూ ఉంటానండి. దీనివల్ల అటు నా వ్యాపారం నమ్మకంగా, బాగాసాగుతూఉంటుంది. ఇటు ఎందరో నాకు బంధువులయ్యారు. ఈ స్నేహ ప్రపంచమే నాకు అక్కరకివచ్చింది" అని సుబ్రహ్మణ్యం చెప్పాడు.

సుబ్రహ్మణ్యానికి అబ్బిన ఈ లక్షణాలు ఏ చదువు చెపుతుంది. ఏ ఉద్యోగం ప్రసాదిస్తుంది.

సుబ్రహ్మణ్యమే ఇంకా అన్నాడు "మీరు చాలా ఖర్చు అయి ఉంటుందేమో అన్నారు. ఏమీకాలేదండి. ఆ ప్లీడరుగారికి ఫీజు ఇవ్వాలంటే మనలాంటివాళ్లం వందమందికలిసినా చాలదు. ఆయనతో నేనెప్పుడు మాట్లాడలేదు కూడా. కాని దృష్టిపరిచయం మాత్రం ఉంది. ఆయన భార్య అన్నపూర్ణమ్మగారి ద్వారాను, ఆయన తండ్రి గోవిందరావుగారి ద్వారాను చెప్పించానండి. మరికొందరు చేత కూడా చెప్పించానని ముందే అన్నానుకదా. ఆయన కదలనే కదలరుకాని, కదిలితే ఆయనకు తిరుగులేదు. పోలీసులకు కూడా ఆయనంటే హడలు. ఏమయితేనేం మన పని అయిందికదా. సరే... ఈవేళకి పూర్తి విశ్రాంతి తీసుకోండి. ఇక మా శ్రీమతినీ, పిల్లలనీ తీసుకువెళ్తానండీ, కృష్ణవేణక్కగారూ" అని చెప్పి ఆయన భార్యా పిల్లలతో వెళ్లిపోయాడు.

మా శ్రీమతి చెప్పింది సుబ్రహ్మణ్యం భార్యా పిల్లలు తనకెంత ఆనరాగా ఉన్నారో. మర్నాడు బడికివెళ్లాను. మాపేట కర్ఫ్యూ ప్రాంతేల్లో లేదుకాబట్టి మా బడి నడుస్తూనేఉంది. నన్ను చూసి మాతోటి ఉపాధ్యాయులందరూ అభినందించారు. "ఎలా అంత శీఘ్రంగా విడుదల అయ్యారని" ఆశ్చర్యపోయారు. నేనే చెప్పాను. సుబ్రహ్మణ్యం కారణంగా విడుదలయ్యానని. వాళ్లెవరూ మాట్లాడలేదు.

ఊళ్లో గొడవ సాగుతూనేవుంది. ఆగిఆగి భగ్గుమంటూ ఉంటుంది. అంతలో రెండురోజులు ఏమీ ఉండదు. అప్పుడప్పుడు లూటీలు. దహనకాండ. విధ్వంసకాండ జరుగుతున్నాయి. మరో మూడు తుపాకీ కాల్పులు జరిగాయి. మరో నలుగురు చచ్చిపోయారు. వాళ్ల శవయాత్రల వలనగా మళ్లీ గొడవలు. చివరికి రాష్ట్రప్రభుత్వం త్వరగా దిగివచ్చి మెజిస్ట్రేట్ దర్యాప్తుకి ఆదేశించింది అయినా గొడవలు శాంతించలేదు. కాని మొదటి ఉత్తేజంలేక మెల్లగా కుతకుతలాడుతూ చివరికి చల్లారిపోయింది.

మరునాడు సుబ్రహ్మణ్యం నన్ను తీసుకువెళ్లి నా తరఫున హామీ పత్రాలు రాసిన వారి పరిచయం చేశాడు. తరువాత రెండురోజులు అతను నాకు కనిపించలేదు. మరే ఊరైనా వెళ్లాడా అని అడిగితే "లేదండీ, ఊళ్లోనే ఉన్నారు. ఏదో పనిమీద తిరుగుతున్నారట. పని అయిన తరువాత వచ్చి మిమ్మల్ని కలుసుకుంటానని చెప్పమన్నారండీ" అన్నారు ఇంట్లోవాళ్లు.

మర్నాడు సాయంత్రం సుబ్రహ్మణ్యం మా యింటికి వచ్చాడు. "ఏమిటి సుబ్రహ్మణ్యంగారూ. ఏమిటీ అర్జంటు పనిమీద ఉన్నట్లున్నారు. చెప్పటానికి వీలైతేనే చెప్పండి" అన్నాను నేను.

"మీకు చెప్పగూడనిదేమీ ఉండదండీ. నేను పరిశోధన చేస్తున్నానండి. అంటే నేను డిటెక్టివ్‌గా పనిచేస్తున్నానన్న మాట" అని నవ్వాడతను.

"పరిశోధన ఫలించిందా? ఏమిటి ఫలితం?"

"ఆ... ఫలించిందనే చెప్పాలి. కాని ఫలితం ఒక దారుణ సత్యమండీ!"

నేను ఆశ్చర్యంతో, ఆసక్తితో చూశాను.

"ఇటీవల జరిగిన అల్లర్లతో ఏ

సంబంధంలేని మిమ్మల్ని అరెస్టు చేయడమేమిటా అన్నది నాకు సమస్య అయికూర్చొని పొడవసాగింది. దానితో ఇన్వెస్టిగేషన్ మొదలు పెట్టాను. నేననుకున్న అనుమానం ధృవపడిందండి" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"ఏమిటది?" అనడిగాను కుతూహలం ఆపుకోలేక.

"ఈ గొడవ అంతటి వెనక ఉన్నది మన పాతమిత్రులు-ఆ దుష్ట చతుష్టయమే. అందుకు మీ పేరు పోలీసుల జాబితాలోకి ఎక్కింది."

"చాలా ఆశ్చర్యంగా ఉంది. వివరంగా తెలియజేయండి" అన్నాను నేను.

"నేను ఆ రామగోపాల్ ఇంటివాళ్లనే కలుసుకున్నానండి. వాళ్ల యింటి మీద పోలీసుల నిఘా ఉంటుంది. అందువల్ల నేను రహస్యంగా కలుసుకోవలసి వచ్చింది. అటు వాళ్లు నన్ను నమ్మవద్దూ. అందువల్ల వాళ్ల నెరిగున్న సైకిలు రిక్షా అతను ఒకడు నాకూ పరిచితుడే. అతనిని తీసుకొని వెళ్లి, అన్ని జాగ్రత్తలూ తీసుకొని మాట్లాడాను. అప్పుడు అసలు విషయం బయటపడింది. అది ఇది-

" ఈ దుష్టచతుష్టయం మనవాళ్లు చూపిన లంచానికి సంతృప్తిపడి మరొక పేటకి తమ వేట క్షేత్రంమార్చారని మనం ముందే తెలుసుకున్నాం కదా- అప్పుడు ఆ పేట వాళ్లు వీళ్లఆగడాలకు హైరానపడిపోతున్నారు. ఒకసారి రామగోపాల్ చెల్లెలు-ఒకత్తే చెల్లెలు- ఇంటర్మీడియట్ రెండవసంవత్సరం చదువుతోంది. నిప్పురవ్వలాంటిది-స్నేహితురాండ్రతో వస్తూ వీళ్ల నెదుర్కొనవలసి వచ్చింది. దుష్ట చతుష్టయం ఈలలు వేస్తూ, బూతుల వ్యాఖ్యలు చేస్తూంటే ఈ అమ్మాయి-ఆమె పేరు కనకదుర్గ-తన స్నేహితురాళ్ల తరఫున ఆ రౌడీలని ఎదిరించి నాలుగు దులిపిందట. దానితో నాగేంద్రంగాడు-మన కథానాయకుడు కాదు నాలుగో వాడు-ఎదరకు దూకి ఆ అమ్మాయి వోణీ గబుక్కున లాగి గాలిలోకి వదిలేసి "ఇప్పుడేం చేస్తావే చేసుకో" అని వెళ్లి తనవాళ్లతో కలిశాడట. వాళ్లంతా నవ్వుకుంటూ అక్కడినుంచి కదిలిపోయారట. దుర్గ వోణీ కొంతదూరం ఎగిరిపోతే ఆమె స్నేహితురాళ్లెవరో పరుగెత్తి తెచ్చారట. ఆ పిల్ల చాలా అవమానం పొంది, అయినా బేలలా ఏడవక, నిగ్రహించుకొని ఇంటికిపోయి అన్నగారికి అదే ఈ రామగోపాల్కు చెప్పిందట. ముగ్గురన్నగార్లకు ముద్దుల చెల్లెలు ఆమె. తల్లిదండ్రులకు కంటిపాపవంటిది. అటువంటి ఆమెకు అలా బహిరంగంగా అవమానం జరిగిందంటే వాళ్లకెలా ఉంటుందో చెప్పాలా? రామగోపాల్ [illegible]తనంలో కుస్తీ వస్తాదుగా పేరుపొందినవాడు. ఇప్పుడు కొత్తపేటలో ఫాన్సీ దుకాణం నడుపుకుంటూ ఎంతో పెద్దమనిషిగా పేరుతెచ్చుకున్నాడు. కాని పౌరుషం కల మనిషి చెల్లెలికి అవమానం జరిగితే ఉండబట్టలేకపోయాడు. వెళ్లి ఆ నాగేంద్రాన్ని మెడబట్టుకులాగుకు వచ్చి బహిరంగంగానే చితకకొట్టివచ్చాడు. దుష్ట చతుష్టయం వదిలిపోయి పరుగెత్తిపోయారు. కాని వెళ్లి తమకి తెలిసిన పోలీసులకి చెప్పారు. వాళ్లు రామగోపాల్పైన దొంగతనం చేసినట్లు కేసు మోపి పోలీస్స్టేషనుకు తీసుకుపోయి లాకప్పులో పెట్టి చిత్రహింసపెట్టారు. అంత వస్తాదు లాంటివాడు ప్రాణంవదిలేశాడంటే ఎంత దారుణంగా కొట్టి ఉంటారో, హింసించి ఉంటారో ఊహించండి. చిత్రంగా పోలీసులు అతని పేరు రామగోపాల్ అని రాయక నాగరాజు అని రాసి తండ్రిపేరు కూడా వేరుగా రాశారట. అతన్ని అరెస్టు చేస్తూ ఉండగా ఎవరూ స్వయంగా చూసినవారు లేరు కాబట్టి సమయానికి అతనికి సాయం అందలేదు. తరువాత కథ అంతా తెలిసిందే కదా. విడ్డూరమేమంటే ఈ దారుణానికీ, గొడవలకీ మూలకారకులు తప్పించుకున్నారు. ఉద్యమమంతా పోలీసుల అత్యాచారాల మీదికిపోయింది. రామగోపాల్ చావుకి పోలీసులే కారణం కాదనను. కాని పోలీసులు ఎవరికోసం అలా చేశారు? వాళ్లని బయటికి లాగవద్దా? ప్రజల ఆందోళన అల్లరి పక్కదారిన పట్టి చివరికి నిష్ఫలమైపోయింది" అని చెప్పాడు సుబ్రహ్మణ్యం.

కఠోర నిజం బయటపడి నేను కొంతసేపు నిర్విణ్ణుడినైపోయాను.

సుబ్రహ్మణ్యమే మళ్లీ అన్నాడు... "మాష్టారూ, ఈ అన్యాయాన్ని ఎక్కడో అక్కడ అడ్డుకోక తప్పదండి. ప్రాణప్రియమైన తన చెల్లెలికి.

జరిగిన అవమానానికి ప్రతి క్రియ చూపినందుకు-అతను హత్య చేయలేదు, దారుణంగా కొట్టలేదు కూడా- ఒక నిండు ప్రాణం బలికావడం? వృద్ధాప్యంలో ఉన్న తల్లిదండులకు తీరనిశోకం ఏర్పడదూ? అతని మీద ఆధారపడ్డ భార్యా బిడ్డల జీవితాలు ముక్కచెక్కలు కావడం నన్ను కలచివేస్తోందండీ. ఇంతటి అన్యాయానికి స్పందించలేకపోతే మన సంస్కారమెందుకండీ?''

"మీలాగే నేనూ బాధపడేవాడినే సుబ్రహ్మణ్యంగారూ. కాని మనం చేయగలిగిందేముంది. ప్రజల ప్రతిక్రియ చూశారు కదా. మరో ఐదుగురు ప్రాణాలు పోగొట్టుకోవడం, మరెందరో గాయపడటం, లక్షల ఆస్తి ధ్వంసం కావడం, పౌర జీవితం అస్తవ్యస్తం కావడం, ఇది రోగానికన్నా దారుణమైన చికిత్స అనిపించదూ? మనమేమి చేసినా మళ్లీ ఇదంతా జరిగితే ఈమారు అందుకు బాధ్యులం మనమే అవుతామేమో? పోనీ ప్రజల అండ దండలు లేకుండా చేదామంటే మనిద్దరం ఏమిచేయగలం? నా అశక్తతకి నాపై నాకే కోపం వస్తోందండీ కాని కఠిన యధార్థాన్ని కాదనలేంకదా'' అన్నాను నేను నా కార్యోత్సాహం చాలా వరకూ చల్లారిపోయి.

"ప్రజల అండదండలు ఉంటాయండీ. కాని అందరూ ప్రజలేకదా. ఈ రౌడీలూ, ఇతర దుష్టశక్తులూ కూడా ప్రజలకిందికే వస్తారు. కాబట్టి మనం ప్రజలందరితోడ్పాటుకోసం ఆశించవద్దు. మనఆశయాలను నమ్మి మన పద్ధతులకనుగుణంగా నడిచేవారితోనే కదులుదాం. వారు కొద్దిమందైనా ఫరవాలేదు. దారుణాలను వ్యతిరేకిస్తామంటూ మనమే దారుణాలకు కారణంకాకూడదు. మనమెన్నడూ న్యాయం, ధర్మంపక్షానే ఉందాం. ఒకముక్కలో చెప్పాలంటే మనం తిరిగి గాంధీమార్గం అనుసరిద్దాం. గాంధీగారు అవతలివాడిని నాశనం చేయాలనికాక సత్యం జయించాలని మాత్రమే చూసేవాడు. అసత్యానికి అనుగుణంగా మనం నిజాయితీతో క్రమశిక్షణతో, సంయమనంతో మెలగాలన్న దానిపైనే ఎక్కువ ఒత్తిచెప్పేవాడు. మనం కూడా ఆ లక్ష్యాలకోసమే ప్రయత్నిద్దాం. ఎప్పుడైనానరే మనప్రయత్నం తప్పుదారివట్టినట్లయితే గాంధీగారు తనశాసనోల్లంఘనోద్యమం మంచి ఊపందుకుంటున్న సమయంలో చౌరీచౌరీలో ఒకదురాగతం జరిగిందని తన బ్రహ్మాండమైన ఉద్యమాన్ని నిలిపివేసినట్లు మనంకూడా మన తప్పు ఒప్పుకొని, దానిని సవరించడానికి సిద్ధంగా ఉండాలి''

నాఆశ్చర్యం అంతకంతకు ఎక్కువకాసాగింది. దాంతో కొంతసందేహం కూడా లేవసాగింది. ఈయన మరీ సత్యకాలపు మనిషిలా ఉన్నాడు. వాస్తవాలను మరచి ఆదర్శాల లోకంలోకి ఎగిరిపోతున్నట్లున్నాడనిపించింది-

"అయితే ఏంచేద్దాంముందు? సత్యాగ్రహమా? నిరశనవ్రతమా?'' అని అడిగాను నేను.

అతనిలో కొద్దిగా అసంతృప్తి తోచింది. "సన్ను కొంచెం ఆలోచించుకోనివ్వండి. నేను ఏది చేసినా మిమ్మల్ని సంప్రదించకుండా చేయను కదా. ఈనాడు సత్యాగ్రహం అన్నది ఎంతహీన స్థితికి వచ్చిందోచూస్తున్నారుకదా సత్యమంటే ఏమిటో తెలియనివారూ, అది ఎంతమాత్రంప డని వారూ దానిని ఉపయోగించడం మొదలు పెడుతున్నారు. ఇన నిరశనవ్రతాలు కూడా వట్టి బోగసండీ. గాంధీగారి తరువాత పొట్టి శ్రీరాములుగారూ, ఎవరో సిక్కునాయకుడూ తప్ప త్రికరణ శుద్ధిగా చేసినవారు కనిపించరు. ఇక రిలేనిరాహారదీక్షల్ని నీచంగా రిలేభోజనదీక్షలనడం బాగుంటుంది. అలాంటివాటి జోలికి మనంపోవద్దు. మనం ప్రజానాయకులమని చెప్పుకోవద్దు. ఎందుకంటే ప్రజలకోసమని చెప్పి ప్రజలనే నానాఅవస్థలపాలు చేసే ప్రజానాయకులే ఎక్కువగా తయారయ్యారు. ప్రజాసేవకులన్న పదం కూడా ప్రజానాయకులనబడేవారే అతివినయంతో తమని తాము వల్లించుకునే నామాంతరంగా చలామణీ అవుతోంది. మనది- ఒకవిషయాన్ని ప్రజల దృష్టికి తేవడం, సత్యాసత్యాలు మనకు తెలిసినంతవరకు తెలియజెప్పడం, ప్రజలేతమంతట తాము ఆలోచించుకొని నిర్ణయించుకునేటట్లు చేయడం వరకే. గుర్రాన్ని నీటివరకూ తీసుకెళ్ళగలంకానీ దానిచేత తాగించలేంకదా! ప్రజలకు అన్యాయాన్ని ఎత్తిచూపగలం కాని ప్రజలు అన్యాయాన్ని పట్టించుకోకపోతే మనమేమి చేయగలం? కాని మనమనుకున్నట్లు నిజాయి

తీతో, శాంతియుతంగా అన్యాయాన్ని ప్రజల ముందు ఎత్తిచూపితే వారిలో అంతరాత్మమే ల్కేకుండా ఉండదని నాఆశా, నమ్మకమూ నండి. అందుకే ఈ ప్రయత్నమంతా. క్షమించండి మాస్టారూ... మనం ముందుకుదా టిపోయాం. నేనొక విషయం చెబుదామనుకు న్నాను, మరచిపోయాను. నేను రామగోపాల్ ఇంటికి రెండు మూడు సార్లు వెళ్లాను. వాళ్లవి శ్వాసాన్ని చూరగొన్నాను కూడా ఆ అమ్మాయి దుర్గ తనకోసం తన అన్నయ్య ప్రాణం పోగొట్టు కున్నాడని ఎంతో విలవిలలాడిపోతోంది. రామ గోపాల్ తమ్ముడు రెండోవాడు. సింగరేణికాల రీస్‌లో పనిచేస్తూ ఉంటాడు. అతను అన్నగారి చావు వార్త విని వచ్చి ఇక్కడే ఉండిపోయాడు. వెళ్ళి ఆ నాగేంద్రాన్ని చంపివచ్చేస్తానంటూ నిప్పులుకక్కుతున్నాడు. నువ్వుకూడా పోతే మా గతేంకానురా అని తల్లిదండ్రులు అతనిని వారించారు. నేనుకూడా అతనికి తొందరపడవ ద్దని నచ్చజెప్పానండి. అప్పుడే శ్యామల కథ వాళ్లకి చెప్పానండి. అదివిని ఆ దుర్గ ఆమె తల్లిదండ్రులు, రెండో అన్నగారూ కూడా బాధ పడ్డారండి. వాళ్ళుమళ్ళీ తీవ్రభావాలు వ్యక్తప రచకుండా నేనుతలపెట్టినదేదో వారికి టూకీగా వివరించాను. దానితో వాళ్లు నావెనుకే ఉంటా మనీ, నేను ఏమిచేయమంటే అది చేస్తామనీ మాట ఇచ్చారండి. కొందరు రిక్షాలాక్కొని పొట్ట పోసుకునేవాళ్ళూ, కార్మికులూ కూడా నాకు మిత్రులని మీకొకమారు చెప్పాననుకుంటాను. వాళ్ళకికూడా నేనీవిషయం చెప్పాను. వాళ్లు కూడా నావక్కన నిలబడతామన్నారు. ఇక మన బాధ్యత ఒకటి ఉందండీ'' అన్నాడు సుబ్రహ్మ ణ్యం.

''ఏమిటదీ'' అడిగాను నేను.

''ఆ శ్యామల జీవితాన్ని నాశనంచేసిన ఆ శుభలేఖ ప్రతి ఒకటి సంపాదించాలండీ'' అన్నాడతను.

''అది ఎందుకు?''

''ఆ దుష్టచతుష్టయాన్ని బయటపెట్టా లంటే అదొక కీలకమైన సాధనం''

''మనం ఇకమీదట ఆ శ్యామలపేరు వాడ వద్దనుకున్నాంకదా''

''అవును... ఆమె తండ్రి అలా మాట్లాడేసరికి నిస్పృహతో ఆ నిర్ణయానికి వచ్చాం. కాని ఆమె తండ్రి చేసిన పనికి ఆయనకి తృప్తి కలిగితే కలగవచ్చునుకాని ఆమె ఆత్మకి శాంతి లభి స్తుందా... చెప్పండి! శ్యామల ఉదంతం ముగి సిందని వాళ్ల దుష్కృత్యాలు తగ్గాయా? మరొక మంచివాని ప్రాణం తీశాయి. కాబట్టి అన్యాయాన్ని ఎదిరించవలసిందే, బయటపె ట్టవలసిందే. మనం తప్పేమీ చేయడంలేదే. మనం చేయదలచుకున్నదానికి ఈ 'శుభలేఖ' కీలకమైన సాధనమే. ఇంతవరకూ నా పరిశో ధన అయింది. ఇకముందు మీరు డిటెక్టివ్ పాత్ర వహించాలన్నమాట. ఎలాగో అలాగ కనీసం ఆ దొంగ శుభలేఖ ప్రతి ఒకటి అయినా సంపాదించి పెట్టండి. ఏమంటా రు?'' అని ప్రశ్నార్థకంగా చూశాడు సుబ్రహ్మ ణ్యం.

''తమ్ముడినుంచి న్యాయమైన కోరిక వ్యక్తమ యినప్పుడు ఏ అన్నా కాదనలేడుకదా. నా శక్తులు ప్రయోగించి ఆ శుభలేఖ ప్రతి సంపా దిస్తా'' అని అతనికి హామీ ఇచ్చాను.

సుబ్రహ్మణ్యం ''మరి వస్తాన''ని చెప్పి మా ఆవిడ దగ్గరకూడా సెలవు తీసుకొని వెళ్లిపో యాడు.



సుబ్రహ్మణ్యం ముందు తేలికగా తల ఊపా ను. కాని ఆ దొంగ 'శుభలేఖ' ప్రతి సంపా దించడం చాలాకష్టమని తెలిసివచ్చింది. శ్యా మల ఇంటివాళ్లనడగలేను. ఇంక ఎవరికి శుభ లేఖలు అందాయో ఎలా తెలుస్తుంది? 'మీ కందిందా' 'మీకందిందా' అని అడుక్కుంటూ పోలేను కదా. చివరికి లక్ష్మీపతినే ఆశ్రయించక తప్పదనిపించింది. కాని ఇటీవల అతని వ్యవ హారం చూసిన తరువాత నాకు అతని దగ్గరకు

పొబుద్ధివేయడంలేదు. కాని ఎంత ఆలోచించినా అతని సాయం తప్ప మరో దారిలేదనిపించింది. ఒకవేళ అతని దగ్గరకూడా ఆ శుభలేఖ లేకపోతే కథ మళ్లీ మొదటికే వస్తుంది. అప్పుడు నాకు నేను వ్యవహారజ్ఞానం లేకుండా ఎలా వ్యవహరించానో బోధపడింది. శ్యామల విషయంలో ఏదో చేయాలనుకున్న వాడిని దొంగ శుభలేఖ కీలకపాత్ర వహించిందని తెలిసినప్పుడు తరువాత ఉపయోగించినా లేకపోయినా దాని ప్రతి ఒకటి సేకరించి ఉంచుకోవలసింది. ఆలోచనకెప్పుడూ ఆధారాలు చూసుకోవాలి, అవి వస్తురూపంలో ఉన్నప్పుడు వాటి తక్షణ ప్రయోజనం కనిపించినా కనిపించకపోయినా ఎక్కడో అక్కడ జాగ్రత్తపెట్టి ఉంచాలి- అంటే ఆలోచన కొంతవరకు అవాస్తవంగా అసమగ్రంగా సాగుతోందన్నమాట. కాని ఇప్పుడు గడిచిపోయినదానికి ఎంత వగచితే మాత్రం ఏం లాభం? ఇక ముందైనా పూర్తి మెలకువతో వ్యవహరించాలనుకున్నాను. నాకు దొంగ శుభలేఖ సంపాదించడానికి మరో మార్గం తోచక లక్ష్మీపతి ఇంటివైపునే అడుగులు వేశాను. తీరా అక్కడికి వెళ్లిన తరువాత ఆయనపట్ల విముఖత మరీ ఎక్కువై అప్పుడే అతని దగ్గరికిపోతే, ఇంకేమైనా ఉపాయం తోస్తుందా అని మరికొంచెం ఆలోచించిన మీదట ఆ దారి తప్పదనుకుంటే అటుపోవచ్చని తోచి నేను ఆయన గుమ్మం ముందునుంచి ఎదరకు సాగాను. కాని లక్ష్మీపతి దృష్టినాపైన పడ్డట్టే ఉంది. గబగబా గుమ్మం దగ్గరికి వచ్చి "ఏమండోయి... శేఖరం మాస్టారు" అని కేకేసి చప్పట్లు కొట్టాడు. నేను రాయిపెట్టి కొట్టక్కర్లేలేకుండా పండు అదంతట అదే ఒళ్లోపడ్డట్లనిపించింది. అయినా పైకి నేను ఆశ్చర్యపోతున్నట్లుగా వెనక్కి తిరిగి చూసి ఆయనవైపు అడుగులువేశాను.

"ఏమిటి మాస్టారూ... మా గుమ్మం ముందునుంచి వెళ్తూ కూడా లోపలికి వచ్చి పలకరించకుండా వెళ్లిపోతున్నారేమిటి?" అని అడిగాడాయన.

"ఇప్పుడు పనేముందండి. అనవసరంగా మిమ్మల్ని డిస్టర్బ్ చేయడమెందుకనుకున్నాను- అంతే" అన్నాను నేను.

"అయ్యో... వీధిలోనే నిలబడ్డారేమిటి? ఒక్క నిమిషం లోపలికి వచ్చి వెళ్ళండి. ఒకవేళ మరీ అర్జంటుపనిమీద వెళ్లడంలేదుకదా" అన్నాడు లక్ష్మీపతి.

"లేదండీ" అని ఆయనతో లోపలికి నడిచాను.

వాళ్లగుమ్మం దగ్గరికి వెళ్లగానే లక్ష్మీపతి "అటు చూడండి మాస్టారు" అన్నాడు.

అటు చూశాను. సరికొత్త బజాజ్ చేతక్ స్కూటర్ మెరిసిపోతోంది.

"మొన్ననే కోటాలో వచ్చిందండీ. దానితో పాతది అమ్మేశాను" అని ఎంతో ఆత్మసంతృప్తితో- "కొత్త స్కూటరు వచ్చిన రోజున స్వీట్లు పంచిపెట్టామనుకోండి. అయ్యో మీరు రాలేదే అని నేను ఎంతో అనుకున్నాను- ఇప్పటికైనా వచ్చారు, అదే సంతోషం" అని అమ్మాయి- మాష్టారికి రెండు స్వీట్స్ పట్టుకురా అని కేకేశాడు.

కాసేపటికి లక్ష్మీపతిగారి రెండో అమ్మాయి ఒక మైసూర్ పాక్, ఒక కేక్, మిక్చరూ ప్లేటులో పట్టుకువచ్చి నాకిచ్చింది. మంచినీళ్లు కూడా అందించి వెళ్లింది.

లక్ష్మీపతే అన్నాడు- "మాష్టారూ... ఇటీవల అల్లకల్లోలం చూశారుకదా. 'కంచేచేనుమేస్తే' అన్నట్లు ప్రజల్ని రక్షించవలసిన పోలీసులే ప్రజల్ని అంతమొందిస్తే ఇక చేయగలిగిందేముంది చెప్పండి. ఆ చచ్చినవాడు దొంగ అని ఇంకా నిరూపణ కాలేదుకదా- పోనీ దొంగే అనుకుందాం. కాని నేరానికి తగ్గశిక్ష ఉండాలి కదా. దొంగతనానికి చావు న్యాయమైన శిక్షకాదుకదా. అది అలాఉంచి ఏమీ సంబంధంలేని మిమ్మల్ని కూడా జైలులో పెట్టారుకదా. అందుకే మాష్టారూ... ఈ సమాజాన్ని ఎవడూ ఉద్ధరించలేడన్నది. నీతి నియమాలు ఎప్పుడో పోయాయి. సమాజం ఎటుపోతోందో ఏది ఎందుకు జరుగుతోందో ఎవరూ చెప్పలేకుండా ఉన్నాం. అందుకే భవంతుడిమీదే భారం వేసి మనదారినమనం పోవడమే మనం చేయగలిగింది."

అంత ఆవేశం చివరికి అకర్మణ్యతలోకే దిగిపోతుందని నాకు ముందే తెలుసు.

ఆయన మెట్టవేదాంతంవిని లోలోపలే నవ్వు కొని ఏమీ మాట్లాడకుండా ఊరుకున్నాను.

"నేను చెప్పినదానిని గురించి మీరు ఆలోచించారా? ఒక హితైషిగానే అలా చెప్పాను సుమా. కాని ఇటీవల మాష్టారు అనవసరమైన బయటి వ్యవహారాలజోలికి పోకుండా ఉంటున్నట్లున్నారు" అన్నాడు తన ఉపదేశ ప్రభావంవల్లే నాలో ఆ మార్పు వచ్చిందేమోనని తెలుసుకోవాలనే కుతూహలంతో చూస్తూ.

ఇప్పుడే అదను, జాగ్రత్తగా పాచిక వెయ్యాలనుకున్నాను. పైకి అన్నాను- "నేనెప్పుడూ అనవసర విషయాలలో జోక్యంచేసుకోనండి. ఆ శ్యామల నాకు సన్నిహితమైంది కాబట్టి ఆమె వల్ల జరిగిన అన్యాయానికి స్పందించాను- అంతే. ఇంతకీ నాకు ఒక సందేహం కలుగుతోందండి. ఆ రౌడీలు నిజంగానే శుభలేఖ లాంటిది అచ్చువేసి పంచిపెట్టారా లేక కేవలం వదంతి కారణంగా అలా జరిగిందా?"

"ఇందులో సందేహానికి తావులేదండీ



వాళ్లు శుభలేఖ అచ్చువేశారు, పంచిపెట్టారు కూడా. మామూలువాళ్లయితే అంతసాహసం చేయలేరు. వాళ్లకి అన్నీ వున్నాయి కాబట్టి, వెనకాల దన్ను ఉండబట్టీ వాళ్లు ఇంత పని చేయగలిగారు. నాదగ్గర ఒకటి ఉండాలి... పట్టుకువస్తాను ఉండండి'' అని లోపలికి వెళ్లాడాయన.

కాసేపటికి ఆ 'శుభలేఖ' పట్టుకువచ్చి నాచేతిలో పెట్టాడు. తీరా చూస్తే రెండు ఉన్నాయి. ''రెండు కనిపించాయిలెండి. కావలిస్తే ఒకటి మీ దగ్గర అట్టేపెట్టుకోండి'' అన్నాడు ఆయన ఉదారంగా.

నేను ఆ శుభలేఖకేసి చూసి ఒకసారి ఆ మూలనుంచి ఈ మూలకి చదివి ''చాలా చిత్రంగాఉందే'' అని విచారపు నవ్వు నవ్వి ఒక ప్రతి నాదగ్గరే ఉంచుకొని రెండోది ఆయనకి తిరిగి యిచ్చేశాను. నేను లేచాను. లక్ష్మీపతి మళ్లీ అన్నాడు- ''మాష్టారూ... ఒక సలహా. మీరు ఆ అమ్మాయిని గురించి లోపల బాధపడుతున్నారుకాబట్టి ఈ వ్యవహారం బతికిఉన్న వ్యక్తులెవరివైపు వేలెత్తి చూపకుండా, ఒక కథ రాసి ఏ పత్రికకో పంపండి. మీరు రచయితగా మారతారు, మీ హృదయంలోని భారమూ కొంతతీరుతుంది. దీనిని మీరు సీరియల్‌గా మారిస్తే మరీ మంచిది. పేరుకు పేరు వస్తుంది, డబ్బుకు డబ్బు వస్తుంది. ఏ సినిమా నిర్మాతదో దృష్టిపడితే''–

అప్పుడే ''అంత ఎత్తు ఆకాశసౌధాలు నిర్మించవద్దులెండి. ఆలూలేదు చూలూలేదు కొడుకుపేరు సోమలింగం అన్నట్లు అసలు నేను కథరాస్తే కదా. నాకు కథరాయాలని తలవూలేదు, సామర్థ్యమూలేదు'' అనిచెప్పి సెలవుతీసుకొని వచ్చేశాను.

సాయంత్రం సుబ్రహ్మణ్యం వచ్చాడు. శుభలేఖ చూపించాను.

''మాష్టారు సాధిస్తారని నాకు తెలును'' అని ఆ శుభలేఖ ఒకసారి చదివాడు. ''ఇది చాలా ఉపయోగిస్తుందండీ. ఇక నా పథకమేదో మీకు వివరిస్తానండి'' అని అలాచేయసాగాడు.

''మాష్టారూ ఖడ్గతిక్కనకథ మన అందరికీ తెలిసినదేకదా. కాని నాకెందుకో అది ఉత్తేజం కలగించక విచారమె కలిగిస్తుందండి. ఖడ్గతిక్కన తండ్రీ, తల్లీ, భార్యా అతని చావునే ఎక్కువగా కోరారా అనిపిస్తుంది. ఒకనాటి పోరాటంలో వెనుకంజ వేసినంతలో అంతాపోయినట్లేనా? మరొకమారి పోరాడి విజయం సాధించే అవకాశమేలేదా? ఒక అడుగు వెనక్కివేయడమే తప్పా? దూరంగెంతడానికి వెనక్కిపోకతప్పదే. తొందరపడి ముందుకడుగువేస్తే పదడుగులు వెనక్కిపోవలసిరావచ్చు. మహమ్మద్‌గోరీ పదేపదే పరాజయం చవిచూసినా ఢిల్లీసింహాసనం హస్తగతం చేసుకునేతీరాడు. జిత్తులూ, ఎత్తుగడలూ యుద్ధంలో భాగమేనండీ. ధర్మయుద్ధంలోకూడా ఎటువచ్చీ ఆ జిత్తులూ, ఎత్తుగడలూ నీచస్థాయికికాకూడదు. మనవారి దృష్టి వ్యక్తిగత పరాక్రమం మీదా. వీరమరణాలమీదపోయింది. అందుకే మనవీరులు సాటిలేని శౌర్యంచూపారు. వీరస్వర్గమలంకరించారు. కాని యుద్ధాల్లో అంతిమ విజయాలు జిత్తులమారి విదేశీయులవే అయ్యాయి. అందుకే మనమహోన్నత భారతదేశం పరాధీనమైపోయిందికూడా. మహాభారతంలో శ్రీకృష్ణుడు ఎన్ని ఎత్తుగడలువేశాడో, ఎన్ని ఉపాయాలవలంభించాడో చూడండి. మనం కూడా ఇకతెలివిగా వ్యవహరించాలండీ. శత్రువుకు మించిన ఎత్తుగడలు వేయాలి. ఇదంతా ఎందుకు చెవుతున్నానంటే ఇకముందు, మాష్టారూ, మీరు రంగంమీద కనబడకూడదు. తెరవెనుకే ఉండి కథ అంతా నడిపిస్తూ ఉండాలి. నేనే రంగంమీద నిలబడలేను. ఇలా అంటున్నానంటే నాకేపేరు ప్రఖ్యాతులు కావాలని కాదుసుమండీ. యథార్థాన్ని దృష్టిలో పెట్టుకొని నేనిలా చెవుతున్నాను. మీరు ఒకనిలకడ అయిన ఉద్యోగం చేస్తున్నారు. అందువల్ల మీరు కొన్ని పరిధులు దాటలేరు. శత్రువుకి అవకాశం ఇస్తే మిమ్మల్ని ఏదిక్కుమాలిన ప్రదేశానికో బదిలీచేయవచ్చు. ఉద్యోగం నుంచి కూడా తొలగించవచ్చు. పోతేపోయింది వెధవ ఉద్యోగం, రిక్షాతొక్కుకునైనా బతకగలను అని ఆవేశంతో అనుకుంటే అనుకోవచ్చుగాని అది ఆచరణాత్మక దృక్పథం కాదండీ. మీరు చేస్తున్నది ఒక మంచి ఉద్యోగం. అది సులభంగా పోగొట్టుకోకూడదు. అంతేకాకుండా మీది మామూలు ఉద్యోగంకూడాకాదు. భావిపౌరుల్ని తీర్చిదిద్దే ఉద్యోగం. ముందు మీరు ఎంతైనా చేయవచ్చు. ఇక నావిషయమంటారా. నేనిదివ





రకే చెప్పానుకదా నాది ఒకరిమీద ఆధారప డిన ఉద్యోగంకాదని ఇక్కడకాకపోతే మరొక చోట ఈ వృత్తిచేసుకొని బతుకుతాను. ఈ వృత్తికాకపోతే మరొకటి చేపట్టగలను. పైగా ఒకవేళ నేను ఏకారణంచేతైనా పనిచేయలేక పోయినా మాయింట్లో వాళ్ళందరూ పనిచేస్తూ గడుపుకురాగలరు. అందువల్ల మీ ఉద్యోగాని కి హానిజరిగి మీజీవితం ఒడిదుడుకుల్లో పడ కుండా ఉండేటట్లు పైకిమీరు ఏమీసంబంధం లేనట్లేకనిపిస్తారు. నాకు వచ్చే పెద్దనష్టం ఏమీ లేదుకాబట్టి నేను బయటపడిపనిచేస్తాను. కాని వెనక ఉండి మీరు శాంతంగా ఆలోచించి గుట్టుగా చేయవలసింది చేస్తూ ఉండాలి. అంటే మీరు శ్రీకృష్ణుడూ, నేను అర్జునుడినీ అనుకోండి'' అని నవ్వుతూ అన్నాడతను.

''అంతపెద్దపోలికలు వద్దులెండి. కాని మీ రన్నట్టు నేను మెలకువతో, జాగరూకతతోనే వ్యవహరిస్తాను. కాని నన్ను ఆలోచించమంటు న్నారు. నిజానికి ఆలోచన మీదే అవుతుంది. మీరేపథకాలూ, ఎత్తుగడలూ రూపొందిస్తున్నా రు. వాటిని నాపరిధిలోపల అమలుపరచడమే నావంతువుతోంది. ఏమయినా ఎవరు ప్రధానం అన్నది పట్టించుకోవద్దులెండి. మనఇద్దరం ఒకటే అనుకుందాం. ముందేమి చేద్దామో చెప్పండి'' అన్నాను నేను.

''మాస్టారూ... ఇప్పుడు మీరు రచయితకా వాలి. శ్యామల, రామగోపాల్‌ల విషాదగాథలు రెండూ ప్రజలముందుపెట్టాలి. స్త్రీలను పూజించవలసిన దేశంలో స్త్రీలను వేధించే వారి ఆగడాలు వివరిస్తూ ఈ రెండు ఉదంతా లూ తెలియజేయండి. మనం ఎవరినీ దూ షించవద్దు. ఆవేశంతో ఆక్రోశించవద్దు. విన యంతో, విచారంతో హృదయానికి విజ్ఞప్తిచే ద్దాం. మనవిజ్ఞప్తి ప్రభావం మీరు ఆ ఇద్దరు దురదృష్టవంతుల 'కథలు ఎంతహృదయాన్ని కదిలించేవిధంగా చెబుతారో అన్నదానిపై ఆధారపడుతుంది. అందుకే నేను మిమ్మల్ని రచయితగా కమ్మని చెప్పింది. మనం అన్యా యాన్ని ప్రజల దృష్టికి ప్రభావంతంగా తీసు కువెళ్దాం. అన్యాయం ఇలాసాగవలసిందేనా అన్న ప్రశ్నవారి ముందుపెడదాం. ఆపైన ఆలో చించవలసిందీ, స్పందించవలసిందీ ప్రజలే. ఆ స్పందన తగురీతిలో ఉండేటట్లు తోడ్పడ గలం- అంతవరకే మనపాత్ర'' అన్నాడు న బ్రహ్మణ్యం.

''అయితే ముందునేను చేయవలసినపని ఈ విజ్ఞప్తి తయారుచేయడం- తరువాత?''

''తరువాత అచ్చువేద్దామండీ. నాకొక చిన్న ప్రెస్సు యజమాని తెలును. అతనిచేత అచ్చు వేయిస్తాను. ముందు రెండువేలు ప్రతులు అచ్చువేయించడం మంచిదనుకుంటున్నా ను.''

''అముద్రణ ఖర్చు నాది'' అన్నాను నేను.

''నాకు కూడా కొంచెం వాటా యివ్వండి దయచేసి'' అన్నాడతను దీనంగా అర్థిస్తున్న ట్లుగా.

''అయితే రెండువంతులు నాది, ఒకవంతు మీది'' అన్నాను నేను.

''చాలా సంతోషం'' అని వెళ్లిపోయాడతను.

★ ★ ★

నేనంతకుముందే లక్ష్మీపతి దగ్గర నాకు రచ యిత కావాలన్న తలంపూలేదు, సామర్థ్యమూ లేదన్నాను. ఇప్పుడదే పనిచేయవలసివ స్తోంది. ఒక విజ్ఞప్తి తయారుచేసినంతలో నేను రచయితనైపోను. కాని ఈ నామొదటి చిన్న రచనతో అది చదివినవారిని కదిలించాలి. ఆలోచింపచేయాలి. అందువల్ల రచయిత లక్ష ణాలు కొంతవరకైనా సంపాదించాలి. రాత్రిభో జనం అయిన తరువాత కొంతసేపు అటూ ఇటూ తిరిగి 'నేను ఏదోరాసుకోవాలి, అప్పుడేప డుకోను, కాస్త టీపెట్టు' అని మా శ్రీమతికి చెప్పాను. కృష్ణ ఆశ్చర్యంగా చూసినా వెంటనే టీపెట్టి ఇచ్చింది. అది పుచ్చుకొని వీధిగదిలోకి వచ్చి లైటువేసి తెల్లకాగితాలు దగ్గరపెట్టుకొని రచనకు ఉపక్రమించాను. ముందు నేను చెప్ప దలచుకున్న విషయాలు 'పాయింట్స్'గా రాసు కున్నాను. ఇక అసలు రచనకు పూనుకున్నా ను. ఎలా మొదలు పెట్టాలో, ఎలా మొదలు పెడితే పాఠకుల ఆసక్తిరేకెత్తుతుందో అన్నది సమస్యఅయికూర్చుంది. చాలాసేపు మొదటి మెట్టుదగ్గరే ఉండిపోయాను. అప్పుడర్థమ యింది నాకు ఒక చిన్న రచయిత కూడా నాకన్నగొప్పవాడేనని. అక్షేత్రంలోనే అనుకోండి. అక్కడే ఆగిపోతేమంచిదికాదు. ఏదోఒకటి రాస్తూ ముందుకుపోతే తరువాత సవరించుకో

వచ్చు అని ప్రయత్నం చేశాను. నాలుగైదు వాక్యాలు రాసినా అసంతృప్తితో వాటిని కొట్టి వేసి మళ్ళీ మొదటికేరాసాగాను. అంతలో ఒక ఉపాయం తట్టింది. ముందు శ్యామలకథ రాద్దామనుకున్నాను- రాశాను. బాగానేవ చ్చింది. తరువాత గోపాల్ వృత్తాంతం రాశాను. అదీ బాగానే వచ్చింది. ఆ రెండింటిమీదుగా రౌడీల ఆగడాలకు వచ్చాను. అప్పుడు చివరి భాగం విజ్ఞప్తి భాగం రాశాను. "శ్యామల దుర్గ, రామ్‌గోపాల్ ఎవరో అనుకోకండి. వాళ్ళు మీ సొంత సోదరో, కూతురో, సొంతసోదరుడో, కుమారుడో అయితే ఎలా ఉంటుందో ఊహించుకోండి అని, సుబ్రహ్మణ్యం సూచించి నట్లు క్రోధంతోకాక బాధతో, విచారంతో విజ్ఞప్తి చేశాను.అన్యాయంఇలాసాగవలసిందేనాఅనిప్ర శ్నించాను. 'మీహృదయాల లోతుల్లోకి చూసిజ వాబివ్వండి' అని అర్థించాను. అప్పుడు మొద టికి వచ్చాను. ఈసారి కలం త్వరగా నడి చింది. మొత్తంమీద ఒకరూపం తయారైంది. దానిని పదేపదే చదివి సవరణలు చేస్తూ మరీ టూకీగా కాకుండా సాధ్యమైనంత సంక్షిప్తంగా అయినా ప్రభావితంచేసేలాఉండేటట్లు మారు స్తూ సంతృప్తికరమైన రూపం తయారుచేసేట ప్పటికి రాత్రి పన్నెండయింది. తెల్లవారగట్ట అయిదు గంటలకు లేచాను. అప్పుడు రాసినది మళ్ళీ చదువుకున్నాను. మొత్తం మీద సంతృప్తికరంగానే తోచింది. ఒకటి రెండు సవరణలు మాత్రం చేసి సావుప్రతి తయారుచేశాను.

కాలకృత్యాలు తీర్చుకొని, స్నానం చేసి, కాఫీ తాగిన తరువాత నేనే సుబ్రహ్మణ్యం ఇంటికి వెళ్లాను. అతను ఎగిరి గంతేశాడు- "అప్పుడే తయారుచేశారా! ఇంకా కొంత సమయం పడు తుందనుకున్నాను- లేకపోతే నేనేవద్దునే" అని నేను రాసినది చదివి "చాలాబాగుందండీ, సరిగా నేనాశించినట్లే ఉంది. మనప్రయత్నం సఫలమయితీరుతుందని నాకిపుడు నమ్మకమే ర్పడుతోంది. నేను ఇప్పుడే మామిత్రుడికి ఇచ్చి వస్తాను. ముద్రణ అవగానే మీదగ్గరికివస్తాను. అన్నట్లు ఈ కరపత్రం మనలక్ష్యం, సాధనం చెప్పేవిధంగా 'సత్యాహింసాసమితి' పేరున ప్రచురిద్దామనుకుంటున్నాను- మీరేమంటారు" అని అడిగాడు నన్ను తను.

"బాగుంది... ముందు అడ్వాన్సు ఎంత ఇమ్మంటారు?" అని అడిగాను.

"అడ్వాన్సు ఇవ్వనక్కరలేదండి. కాగితం బయటకొనక్కరలేదు. అతని దగ్గరే ఉంటుంది. అందువల్ల ముద్రణ అయిన తరువాతే మనం డబ్బుచెల్లించవచ్చు. అతనికి నావట్ల ఆమాత్రం విశ్వాసముంది లెండి" అని చెప్పాడు సుబ్రహ్మణ్యం.

మొదటిసారి నేను తలపెట్టిన ఒక పని చక్కగా చేయగలిగానన్న సంతృప్తితో ఇంటికి మళ్లాను.

ఆరాత్రే వచ్చాడు సుబ్రహ్మణ్యం మాయింటి కి. కరపత్రాలు అప్పుడే అచ్చయ్యాయి "నాఅ భ్యర్థనమేరకు వెంటనే ఈ పని చేయించా డండీ, అయన వీటి ముద్రణకి బయట అయితే 60 రూపాయలపైన అవుతుంది. మన ల్ని 45 రూపాయలే ఇమ్మన్నాడు" అని చెప్పా డు సుబ్రహ్మణ్యం.

వెంటనే నావంతువాటా 30 రూపాయలు అతనికి అందజేశాను.

అప్పుడు సుబ్రహ్మణ్యం భవిష్యత్ కార్య క్రమం నాకు వివరించి చెప్పాడు:

"మాష్టారూ... ముందే చెప్పానుకదా మీ పేరు ఎక్కడా బయటపడకూడదనీ, మీ మీదకి అనుమానం రాకూడదనీ. ముందు ఈ కరపత్రా లలో సుమారు 300 నాకు తెలిసినవారికి పంచుతాను. ఒక వంద రామగోపాల్ తమ్ముడి కీ, చెల్లెలికీ అందజేసి వారికి తెలిసినవారికి పంచమని చెపుతాను. తరువాత ఒక మంచిరో జున మన కార్యక్రమం ప్రారంభిద్దాం. ఈ కాలంలో తిథి, వార నక్షత్రాలు చూడడమంటే ఆక్షేపిస్తారుకానీ, వేల ఏళ్లనుంచీ వస్తున్న ఆచా రాన్ని పాటించడంలో నాకు ఒక విధమైన తృప్తీ, ఆనందమూ కలుగుతుందండీ. అందు కే మరీ చాదస్తానికి పోక, సుముహూర్తం చూసి ఏదైనా మొదలుపెడతాను నేను. నాకు వచ్చే ఆదివారం సాయంత్రం మంచిదిగా తోచింది. సాయంత్రం ఐదు గంటల నుంచి రాత్రి ఏడు గంటలవరకు నగర మధ్య ప్రాంతంలో ఒక ఖాళీస్థలంలో కూర్చొని ఆసక్తి చూపినవారికి కరపత్రాలు అందజేయడం, అడిగినవారికి వివరంగా చెప్పడం చేస్తూ ఉంటాను. నేనొక్క







# జండు బామ్
## జలుబు, తలనొప్పి, బాధల్ని క్షణంలో పోగొట్టేది.

పొద్దుటి నుంచి సాయంత్రం వరకు పని వత్తిడి... దానికి తోడు జలుబు-రొంప కూడా పట్టుకు పీడిస్తూంటే, ఆ యాతన భరించలేం. అందుకే జండు బామ్. జలుబు-రొంప మాత్రమే కాదు, తలనొప్పి, వీపు నొప్పి, నడుం నొప్పి, వంటి నొప్పి, బెణుకుల నుంచి కూడా ఉపశమనాన్నిస్తుంది.

ఇటువంటి ఇంకే ఇతర బామ్ కన్నా కూడా ఎంతో ఎక్కువ ప్రభావం గలది. రంగు లేనిది కావడం వల్ల, మరకలు పడతాయేమోననే భయం లేదు. జిడ్డు లేనిది కావడం వల్ల, మీరు ఇంట్లోనైనా, బయటనైనా మాలిష్ చేసుకోవచ్చు. పైగా ఇది సువాసన గలది కూడా. తక్కువ మోతాదులో వాడితే చాలు. అంచేత ఇది పొదుపైనది. కోమల చర్మాన్ని కూడా లాలిస్తుంది. అందుకే తల్లులంతా తమ కుటుంబం కోసం జండు బామ్ కోరుకుంటారు.

కొనేటప్పుడు, సీసా మీద ఎర్ర సీల్‌ని చూసి మరీ కొనండి.




**5, 10, 30 గ్రాముల్లో దొరుకుతుంది.**

**జండు బామ్ నొప్పి హరించే బామ్**

ULKA-2-12531 TEL

డినే కాదు ఆ దుర్గా, ఆమె స్నేహితురాండ్రూ, రామగోపాల్ స్నేహితులూ, నాకు తెలిసిన మరి కొందరూ మొత్తం ఒక ఏభైమంది అక్కడ కూర్చుంటాం. ఎన్నుకున్న స్థలం ప్రభుత్వానిది కాదు. ఒక దేవాలయానికి సంబంధించినది. ఖాళీగా ఉంటుంది. ఏదైనా ఉత్సవం రోజున అక్కడ చిల్లర దుకాణాల వారు వ్యాపారం చేస్తుంటారు. అది రాకపోకలకుకూడా అడ్డురాదు. మనం ఎవరికీ ఇబ్బంది కలిగించబోవడంలేదు. ఏ చట్టమూ అతిక్రమించబోవడంలేదు. అందువల్ల మన కార్యక్రమం నిర్విఘ్నంగా కొనసాగించవచ్చు. పైగా ఎప్పుడూ ఒకేచోట ఉండిపోకుండా నగరంలో బాగా జనం రద్దీ ఉండే ప్రాంతాల్లో అనువైన స్థలాలు మరో మూడింటిని కూడా ఎంచాను. ఈవిధంగా మన ప్రచారం విస్తృతమవుతుంది. ఇటు మన కార్యక్రమంలో పాల్గొనేవారికీ ఏ అసౌకర్యమూ ఉండదు. వారు రోజూ రెండు గంటలు మాత్రమే పాల్గొనాలి. అటు ప్రజలకీ ఏ అసౌకర్యం కలగదు. కొన్నాళ్లు ఇలా ప్రచారం చేసిన తరువాత ఒక ఊరేగింపుగా వెళ్లి ముఖ్యమైన అధికార్లకూ, నాయకులకూ మన విజ్ఞాపనలందజేస్తాం. అంతటితో మన ప్రస్తుత కార్యక్రమం ముగుస్తుంది. రాస్తారోకోలూ, బంద్‌లూ, బస్సులు తగులబెట్టడంవంటి వాటి జోలికి మనం పోవద్దు. మనవారెవరినీ పోనివ్వవద్దు. ప్రజల దృష్టికి అన్యాయాన్ని తేవడమూ, వారిచేత ఆలోచింపజేయడమే మన ఇప్పటి లక్ష్యం అనుకున్నాం కదా. వారిలో ఏమీ స్పందన లేకపోతే, ఆలోచన లేకపోతే మనం ఓటమి అంగీకరించి వెనక్కి తగ్గకతప్పదు. కాని మన ప్రయత్నం తప్పక ప్రభావం చూపుతుందనే ఇప్పటికీ నా నమ్మకమండీ. ప్రజల్లో నిజమైన చలనం వస్తే అప్పుడు మన కార్యక్రమం రెండవ ఘట్టం రూపొందిద్దాం. ఇదే నేను రూపొందిన కార్య ప్రణాళిక. దీనికి మీ ఆమోదం ఉంటుందనే ధీమాతో ఉన్నాను. నేనేమైనా పొరబాట్లు చేస్తున్నానా? ఇంకా మంచిఫలితాలకు సూచనలు చేస్తారా?'' అన్నాడు సుబ్రహ్మణ్యం.

"మీరేమీ పొరబాట్లు చేయడంలేదు. పరిమిత లక్ష్యం నిర్ణయించి అనుగుణమైన సాధనాలే ఎన్నుకున్నారు. నేను చేయగల అదనపు సూచనలు ఏమీలేవు'' అన్నాను నేను.

"మాష్టారూ, మరి సెలవు. మనం కొన్నాళ్లు కలుసుకోకుండా ఉందాం. మీరు దూరంగా ఉండే అంతా కనిపెట్టి ఉండండి. నేను నమ్మినవారిని కొందరిని మీదగ్గరికి పంపుతాను. వారి ద్వారా మీకు అన్నీ తెలుపుతూ ఉంటాను. మీనుంచి సలహాలూ, సూచనలూ గ్రహిస్తాను. నా ఇంత ప్రయత్నానికీ మీరే ప్రేరేపణ ఇచ్చారని మరచిపోకండి- వస్తాను'' అని సుబ్రహ్మణ్యం వెళ్లిపోయాడు.



సుబ్రహ్మణ్యం పెట్టుకున్న సుముహూర్తానికే గాంధీ సెంటర్‌కి దగ్గరలో ఖాళీస్థలంలో ఉద్యమం ప్రారంభమయింది. నేను దూరం నుంచే గమనిస్తూ ఉండిపోయాను. సుబ్రహ్మణ్యం ఏభైమంది అనుకున్నాడు గాని డెబ్బయ్ ఐదు మందిదాకా మనుషులు చేరారు. గుడారంగానీ, షామియానావంటివిగానీ ఏవీ పెట్టలేదు. క్రింద చాపలు మాత్రం పరచి కూర్చున్నారు. రెండువైపులా మహాత్మాగాంధీ, స్వామి వివేకానంద చిత్రాలు పెట్టారు. రెండు స్తంభాలను కలుపుతూ కాగితపు జండాలతో ఒక తోరణం కట్టారు. ఆ తోరణంమధ్యలోనే 'సత్యాహింసా సమితి' అని చేతితో రాసిన అట్ట తగిలించారు. ఎదర 'సత్యమేవ జయతే', 'అహింసాపరమోధర్మః', 'మానవసేవే మాధవ సేవ', 'స్త్రీని గౌరవించనిజాతి తుచ్ఛజాతి' అన్న నినాదాలు ఉన్న నాలుగు అట్టలు తగిలించి కర్రలు పాతి నిలబెట్టారు. అంతే ఏర్పాటు. రోడ్డువక్కన ఇద్దరు గట్టిగా మాట్లాడుకున్నా ఎవడో ఏదో పెట్టి తెరచి నాలుగు వస్తువులు చాపమీద పరిచినా గుమిగూడేవాళ్ళు





ఎప్పుడూ ఉంటారు. అందువల్ల ఇంతమంది సాదాసైన, ప్రభావవంతమైన ఏర్పాటుతో కూర్చొని ఉంటే ఇక ఎంతమంది గుమిగూడు తారోచెప్పనక్కర్లేదుకదా. అందులోకూడా ఒక విచిత్రమైన లక్షణం ఉంది. మామూలుకన్నా కొంచెం ఎక్కువమంది జనం కనిపిస్తే కేవలం కుతూహలం ఆపుకోలేక ఇంకా ఎందరో పోగుబ డతారు. అందువల్ల సుబ్రహ్మణ్యం బృందం చుట్టూ జనం భారీగానే చేరారు. అతని బృందం సభ్యులు వచ్చినవారికి తమ ఉద్దేశ మేమిటో వివరిస్తూ, దుర్వినియోగం చేయం, జాగ్రత్తగా చదువుతాం అన్నవారికి కరపత్రాలు పంచిపెట్టసాగారట. కొంతసేపటికి అందరూ తలోమూలా వివరిస్తూ ఉంటే అది కొంచెం అల్లకల్లోలంగా ఉండేటట్లు ఉందని తోచి సు బ్రహ్మణ్యం తనే లేచి నేను తయారుచేసిన విజ్ఞప్తి ఆధారంగానే ప్రసంగించడం మొదలు పెట్టాడట. పోనుపోనూ అతని వాగ్దాటి బలం పుంజుకుందట. మధ్యలో దుర్గచేత, ఆమె రెండవ అన్నగారిచేత కొన్ని మాటలు చె ప్పించినాడట. సుబ్రహ్మణ్యం ఉద్యమం మొద టిరోజునే బ్రహ్మాండమైన ప్రభావం చూ పిందని వేరే చెప్పనక్కర్లేదు.

రాత్రి కొద్ది పొద్దుపోయిన తరువాత ఇద్దరు కుర్రవాళ్ళు నాదగ్గరికి వచ్చి సుబ్రహ్మణ్యం రాసిన చీటీ అందించారు. అందులో "మాష్టా రూ, మనమాశించినదానికంటే విజయ వంతంగా ప్రారంభమయింది మన ఉద్యమం. మనం ఫలితం సాధించగలమనే ధైర్యం కలు గుతోంది. ఇల్లలుకగానే పండుగైనట్లుకాదని నేను మరచిపోలేదు. కాని ఆశ పెట్టుకోవడంలో తప్పులేదుకదా. కాని నాకు ప్రేరణ ఇచ్చినదీ, ప్రోత్సాహమిస్తున్నదీ మీరేనని నేనెన్నడూ మర చిపోనండీ. అన్నట్లు కరపత్రాలు ఇంచు మించు అయిపోయాయి. బహుశా ఏ రెండు వందలో ఉంటాయేమో. ఈమారు ఐదువేలు అచ్చువేయమని కబురుచేశాను. ఈలోగా మీరే మైనా సవరణలుకానీ, చేర్పులుకానీ చేస్తారా? ఇట్లు, మీ సుబ్రహ్మణ్యం" అని ఉంది.

ఆచీటీలో ప్రతిఫలించిన ఆశా, ఉత్సాహం నాలోకూడా పొంగిపొరలసాగాయి. వచ్చిన యు వకులనుంచే ఘటనాస్థలంలో వాస్తవంగా ఏమి జరిగినదీ వివరంగా తెలుసుకున్నాను. చివర అంతకుముందు తయారుచేసిన విజ్ఞ ప్తిలోనే రెండుమూడుచోట్ల చిన్నసవరణలు చేసి, చదివిన ప్రతిసారీ ఏదో మెరుగుదల తోస్తూనే ఉంటుందికదా, ఆ విజ్ఞప్తి కాగితం వాళ్ళకి అందజేశాను.

రెండవరోజు అక్కడ పెద్ద తిరునాళ్ళు అయినట్టేఉంది. పోలీసులు వచ్చారు. "ఎవ రిని అడిగి ఇలా చేస్తున్నారు?" అని అడిగారు. సుబ్రహ్మణ్యం దగ్గర ఒక ప్లీడరుగారుకూడా ఉన్నారు. ఆయన సుబ్రహ్మణ్యం చేస్తున్నదేదో వివరించి, అది ఏవిధంగానూ చట్ట వ్యతిరే కంకాదని వివరించారు. దానితో పోలీసులు చేయగలిగిందేమీ లేకపోయింది. పైపెచ్చు వారిలో కొందరు రాకపోకలకు అవరోధం ఏర్ప డకుండా ఉండేందుకు జనాన్ని సర్దుబాటుచే సే పనిపట్టింది. రెండవరోజున వందమందికి పైగా కూర్చున్నారు. సుబ్రహ్మణ్యం భార్యా, రామగోపాల్ తల్లిదండ్రులూ కూడా కూర్చున్నా రు.

మూడవరోజున మా శ్రీమతి కూడా వెళ్లి అక్కడ కూర్చుంటానని చెప్పింది. నేనడ్డుచెప్ప లేదు. మూడవరోజున పత్రికల విలేకరులంద రూ వచ్చారు. సుబ్రహ్మణ్యం వారికి అంతా వివరించాడు. శ్యామల విషయంలో జరిగిన అన్యాయానికి నిదర్శనంగా ఆ దొంగ 'శుభ లేక' చూపించాడు. రామగోపాల్ విషయంలో అతని చెల్లెలూ, తల్లిదండ్రుల చేతా చెప్పించా డు.

"మేజిస్ట్రేటు దర్యాప్తు జరగనుందికదా. అక్కడ మీరు ఈ సంగతులన్నీ చెప్పవచ్చు కదా" అన్నాడొక విలేకరి.

"అవును... మేజిస్ట్రేట్‌గారి ముందు జరి గిన వాస్తవం చెబుతాం. కాని ప్రజలకి నగ రంలో పరిస్థితి, దుష్టశక్తుల కార్యకలాపాలూ తెలియజేయాలికదా. ఎవరినో శిక్షించడంతో ఈ సమస్య తీరిపోదు. దుష్టశక్తులనరికట్టే శా శ్వత చర్యలు తీసుకోవాలికదా. అందుకు ప్రజ ల్ని సదా జాగరూకులై ఉండేటట్టు చూడాలి కదా" అన్నాడు.

విలేఖరులు వెళ్ళిన కొద్దిసేపటికి రౌడీలు వచ్చారట. వాళ్లు ఏదో గలభా చేయబోయా రట. కాని రామగోపాల్ తాలూకు మనుషులూ,



సుబ్రహ్మణ్యంకి తెలిసిన రిక్షా కార్మికులూ, ఇతర కార్మికులూ ముందుకు వచ్చేసరికి చల్లగా జారుకున్నారట. సుబ్రహ్మణ్యం బృందంలోవాళ్లు ఎప్పుడూ విడిగా కాకుండా పదిమందైనా కలిసి ఉండేటట్టు చూసుకొని మరీ ఎక్కడికైనా కదులుతున్నారు.

మర్నాడు పత్రికల్లో వివరాలన్నీ వచ్చేటప్పటికి ఊళ్ళో పెద్ద సంచలనమే కలిగింది. నాలుగోరోజున సుబ్రహ్మణ్యంవాళ్ళూ ఆ స్థలానికి చేరకముందే కొన్నివందలమంది జనం అక్కడ వేచి చూస్తున్నారట. ఎవరో వచ్చి సుబ్రహ్మణ్యం మెడలో హారంకూడా వేశాడట. "క్షమించండి. నేను నాయకుణ్ణికాను, మీతోటివాడిని, మీ తోడ్పాటు కోరేవాడిని మాత్రమే" అని హారం తీసేశాడట. ఆ రోజు రెండువందలకుపైగా అక్కడ కూర్చున్నారట.

నాలుగు రోజుల తరువాత సుబ్రహ్మణ్యం తన కార్యరంగం తను ముందే ఎంచుకున్న మరోస్థలానికి మార్చాడు. అది మార్కెటుకి



దగ్గరలో ఉంది. సుబ్రహ్మణ్యం చేపట్టిన ఉద్యమం బ్రహ్మాండంగా సాగిపోతోంది.

★ ★ ★

అప్పుడే నాకు కబురు వచ్చింది-

దుష్టచతుష్టయంలో దుర్యోధనుడు, సురేశ్ తండ్రి, రౌడీలకు దేవుడు, సకల శక్తిమంతుడూ అయిన వరప్రసాదరావు నుంచే వచ్చింది.

నాతో ఒకసారి మాట్లాడాలని ఉందట. సాయంత్రం ఐదు గంటలకు వచ్చి తమ యింటివద్ద కలుసుకోమని కబురు. తెలిసి సింహం గుహలోకి ప్రవేశించడమా? నా భయం మాట ఎలా ఉన్నా నేను వస్తానని ఎందుకనుకున్నాడో ఆశ్చర్యం వేసింది. "నాకు ఆయనతో పరిచయం లేదు. ఆయనకు నాతో పని ఏముందో కూడా నాకు అర్థంకాకుండా ఉంది. అందువల్ల రాలేకపోతున్నాను. క్షమించమనవలసింది" అని జవాబిచ్చి కబురు మోసుకువచ్చిన మనిషిని వెనక్కి పంపివేశాను. కాని సాయంత్రం ఐదింటికి మా గుమ్మంలో కారు వచ్చి ఆగింది. అందులోనుంచి అంతకుముందు కబురు మోసుకువచ్చినవాడే కాకుండా ఎవరో పెద్దమనిషి కూడా దిగాడు. ఆయన నాదగ్గరికి వచ్చి, "మీరేం భయపడకండి. మిమ్మల్ని మళ్లీ జాగ్రత్తగా ఇంటిదగ్గర దిగబెట్టే బాధ్యత మాది" అని ఆయనే మా ఆవిడవైపు తిరిగి- "మీవారిని వరప్రసాదరావుగారని పేరుమోసిన కంట్రాక్టరుగారు పిలువనంపారండీ. ఎవరైనా మాష్టారు ఎక్కడికి వెళ్లారంటే ఇలా వెళ్ళారని చెప్పండి. ఒక గంటలో మీవారు తిరిగి వచ్చేస్తారండీ" అన్నాడు. నేను మరీ భయపడినట్లు కనిపిస్తే అవతలివాళ్లకి లోకువ అవుతుందని తలచి నాకేం భయం లేదన్నట్లుగా "పదండి వస్తాను" అని లేచి, వాళ్ళతో కారులో కూర్చున్నాను.

కారు ఒక బ్రహ్మాండమైన భవంతి ముందు ఆగింది. గేటులోపల భవనం ముందు ఇటూ అటూ చక్కని తోట. ఆ తోట చూస్తే ఇంతచక్కని అభిరుచి ఉన్నవాడు అంత దుర్మార్గుడెలా కాగలడు అని నాకు సందేహం కలిగింది. అంతలో తోటలూ, పూలూ, సుగంధాలూ ఆస్వాదించగలిగినంతలో మనిషి హృదయం సరసమై ఉంటుందనుకోలేమని గుర్తుకు వచ్చింది. చాలా అందమైన ఉద్యానవనాలు ఏర్పరిచిన వారూ, సుందరమైన కట్టడాలు కట్టించినవారూ ఢిల్లీ చక్రవర్తులు చాలామంది ప్రజల విషయంలో మాత్రం పరమ కర్కోటకులుగా వ్యవహరించిన సంగతి చరిత్రబద్ధమే. అది అలా ఉంచి డబ్బు ఉంటే కళాభిరుచి కూడా కొనుక్కోవచ్చేమో అనికూడా అనిపించింది. దానితో నాలో తలెత్తిన కొద్దిపాటి సుముఖభావం ఇట్టే హరించిపోయింది. అందుకే ఆ భవనంలో ప్రవేశించినా, విశాలమైన హాళ్ళూ, గదులూ, అలంకారాలూ, గోడలకు చిత్రపటాలూ, సోఫాలూ, తివాచీలూ, ఖరీదైన విద్యుద్దీపాలూ చూసినా నాలో చోద్యమే కలిగిందితప్ప ఆనందం కలగలేదు.

సినిమాల్లో చూసే మెట్ల వరసలూ, బాల్కనీ మీదుగా యజమాని ఉన్న గదిలోకి నన్ను తీసుకువెళ్లారు. ఆయన ఖరీదైన మెత్తటి కుర్చీలో జోగుతున్నట్లున్నాడు. నన్నుకూడా తెచ్చిన పెద్దమనిషి కొద్దిదూరంలోనే నిలబడి మెల్లగా అన్నాడు: "మాష్టారుని తీసుకువచ్చామండీ". ఆయన మెల్లగా కళ్ళు తెరిచాడు. నాకేసి తేరిపార చూశాడు. నేను సహజ మర్యాద పాటించి "నమస్కారమండీ" అని చేతులు జోడించాను.

ఆయన పక్కనున్న కుర్చీలో కూర్చోమన్నట్టు చేతితో సైగ చేశాడు. నాతోవచ్చినవాళ్ళు కూడా కుర్చీచూపించి కూర్చోమని సైగచేయగా నేను అందులో కూర్చున్నాను. ఆయన చేయి ఊపగా వాళ్ళిద్దరూ బయటికి వెళ్ళిపోయారు. మేమిద్దరమే హాలులో ఉన్నాం. కాని ఆయన ఏమీ మాట్లాడలేదు. మళ్ళీ జోగుతున్నాడా అని నాకనుమానం వేసింది. "నన్నెందుకో రమ్మన్నారట" అని నేనే సంభాషణ ప్రారంభించనా అనుకుంటుండగా ఆయన స్పృహలోకి వచ్చినట్లున్నాడు. కుర్చీపక్క ఉన్న బల్లమీద ఉన్నసీసాలోంచి ఎర్రటి ద్రవమేదో - ఏదో ఏమిటి మద్యమని తెలుస్తూనే ఉందికదా- సన్నకాడ ఉన్న గ్లాసులో పోసుకొని తాగాడు. అంతలో జ్ఞాపకంవచ్చినట్లుంది. "పంతులూ... నీకేమైనా అలవాటు ఉందా?" అన్నాడు.

"క్షమించండి... నాకు లేదు" అన్నాను.

ఆయన గ్లాసు పక్కనపెట్టి కొంత సర్దుకుని "పంతులూ... ఇక్కడికి రావడానికే భయపడిన





ట్లున్నారు. మేమంత మనిషి కనిపిస్తేచాలు నమిలి మింగేసేరాక్షసులంగాతోచామా?'' అన్నాడు.

ఆయనమాట ఇదివరకు నేను విన్నట్లుగానే గొణుగుతున్నట్లంతమెల్లగా ఉంది. పక్కన వివరించి చెప్పేవారు లేరని గుర్తించాడుకాబోలు కొంతలో కొంత స్పష్టంగా తెలుస్తోంది.

నేనన్నాను- ''భయపడికాదండి. అపాయమే ఉన్నట్లయితే భయపడి దాగుకున్నా తప్పిపోతుందా? అదీగాక, ఒకసారి అతిభయంకరమైన అనుభవం అయిన తరువాత భయం అదే తొలగిపోతుందండి''

ఆయన మొహం కొంచెం ఒకవైపుగా పైకెత్తి ''ఏంటి అనుభవం?'' అన్నాడు.

''మీ అబ్బాయి చెప్పలేదా?'' అని నేనడిగాను.

''అవును... ఆళ్ళు నిన్ను కొంచెం నతాయించారంట- విన్నాను''

''కొంచెం నతాయించడంకాదు. మీ అబ్బాయీ అతని స్నేహితులూ నాతో ఎలా వ్యవహరించినదీ మీకు పూర్తిగా చెప్పనేలేదా?'' అని అడిగాను.

ఆయన మాట్లాడలేదు.

''జరిగినదేదో పోలీసులకి నేను రిపోర్టు చేయలేదు. మిత్రులకిమాత్రం చెప్పాను. మీకు కూడా చెబుతాను'' అని జరిగిందంతా సవివరంగా చెప్పాను.

ఆయన మాట్లాడకుండా విన్నాడు. అంతలోనే నాకు ఆయన నిజంగా విన్నాడా లేక మైకంలోపడి జోగాడా అని అనుమానం వేసింది.

కాని నా సందేహం తీరుస్తూ ''నువ్విది పోలీసులకు రిపోర్టు చేయనేలేదా?'' అని అడిగాడు.

లేదని చెప్పాను.

''ఎందుచేత చేయలేదు?'' అని అడిగాడాయన.

''రిపోర్టుచేసినా ప్రయోజనముండదని అంతకుముందొకసారి తేలిందికాబట్టి''

ఆయన నాకేసి మళ్ళీ తేరిపారచూశాడు. తరువాత అన్నాడు- ''పంతులూ... నీలా నిజంమాటాడేవోడిని మరెవడినీ చూడలేదు. ఏమైనా పోలీసులకు రిపోర్టు చేయాలనుకోకపోవడం విశేషమే. అటువంటప్పుడు నీవు వచ్చి చెప్పొచ్చుగా కుర్రకుంకల్ని మందలించేవోడిని''

''వాళ్ళు ఇంకా కుర్రకుంకలేనంటారా? మందలిస్తే సరిపోతుందంటారా?'' అని నేనడిగాను.

ఆయన మాట్లాడలేదు.

అప్పుడు నేను అన్నాను- ''ఇంతకీ మీరు నన్నెందుకు పిలిపించినట్లు?''

''ఆయనెవడో సుబ్రమణ్యాంటగదా ఉన్నట్టుండి లోకాన్ని ఉద్ధరించిపారెయ్యాలని బుద్ధి పుట్టుకొచ్చిందంటగా ఆతగోడికి. ఆడు నీ స్నేహితుడంటకదా'' అన్నాడాయన.

''అతను నాస్నేహితుడే'' అని అంగీకరించాను నేను ''కాని ఆ ప్రసక్తి ఎందుకు వచ్చింది ఇప్పుడు?'' అని అడిగాను నేను.

''గొర్రెపొట్టేలెళ్ళి కొండను ఢీకొన్నట్లు, చిట్టెలుకొచ్చి సింహాన్ని సవాలుచేసినట్లు మామీద యుద్ధంమొదలెట్టాడంట. మేము దుష్టశక్తులంట, మమ్మల్ని తుడిచిపెడతాడంటకదూ?''

అయినా ఇందులో నాకు సంబంధమేమిటో ఆయన ఎత్తిచూపలేదు. నేను మౌనంగా ఉండిపోయాను.

''ఆడు ఇంటింటికి పోయి కాపీపొడీ చారుపొడీ అప్పడాలూ అమ్ముకుంటూ ఉంటాడంటగా. ఆడొచ్చి మామీద మీసం దువ్వుతాడా? ఆడు మమ్మల్ని దెయ్యాలూ భూతాలుగా వర్ణించి చెప్పడమూ తలచుకుంటే మేము నిమిషాల్లో ఆడినీ ఆడి జనాన్నీ లెగ్గొట్టించేద్దుము. తలచుకుంటే ఈ ఊరినుంచి తరమగొట్టగలం. నీ స్నేహితుడు కాబట్టి ఆడిని వెంటనే ఈ గొడవలేవో కట్టిపెట్టేసి, తన కాఫీ పొడి యాపారమేదో చూసుకోమని చెపుతావని పిలిపించాను. పిచ్చిపిచ్చి ఆలోచనలు కట్టిపెట్టి బుద్ధిగా మనులుకోడం ఆడికీ మంచిదే... నీకూ మంచిదే- ఏమంటావు?'' అన్నాడు తన ఎరుపెక్కిన మిడిగుడ్లతో నాకేసి గురిపెట్టి చూస్తూ.

నేను బెదరదలచుకోలేదు. ''ఇంతకీ

నన్నేంచెయ్యమని మీ ఉద్దేశం?" అని అడిగాను.

ఆయనకు కోపం వచ్చినట్లుంది. ఒక్కసారి పిడికిలి, పళ్ళు బిగించి నాకేసి తీవ్రంగా చూసి, తరువాత పక్కకు తిరిగి మద్యం మరో చిన్నగుక్క పుచ్చుకొని ఆ గ్లాసు బల్లమీద కొట్టినట్లు పెట్టాడు.

అప్పుడన్నాడు- "ఇదిగో పంతులూ... మాకు కోపం తెప్పించమాకు. ఒకసారి చెప్తే అర్థంకాదా- మేం చెప్పింది నీ ఆ స్నేహితుణ్ణి, ఆ సుబ్రహ్మణ్యంగాడిని, వెంటనే బిచాణా ఎత్తేసి గొడవలేం చేయకుండా ఇంట్లోనే కూర్చునేటట్లు చేస్తావని. అట్టా చేస్తావా, చెయ్యవా?"

"ఆయన నా నౌకరు కాదు, నా శిష్యుడూ కాదు, చిన్నపిల్లవాడూ కాదు - ఆజ్ఞాపించడానికి. నా మాట అతను ఎందుకు వినాలి? అతనా స్థితి దాటిపోయాడు. ఆయన తను తలచుకున్నదేదో చేస్తున్నాడు. ఇప్పుడు ఎవరిమాటా వినడు, ఎవరికీ బెదరడు. పోనీ మీరే చెప్పి చూడండి" అన్నాను ఆయనను కవ్విస్తూ, ఆయన బుకాయింపులకేమాత్రం జడవకూడదన్న పట్టుదల నాలో పెరుగుతోంది.

"ఆడికి కబురు చేసినాం వొచ్చి కనిపించి పొమ్మని, రాను పొమ్మన్నాడంట. ఎంత పొగరు! అందుకే నీకు కబురుపెట్టాం, నువ్వాడికి స్నేహితుడివని"

"మాకిద్దరికీ పుస్తకాలంటే ఎంతో ఇష్టం- అందులోనూ స్వామి వివేకానందుడి రచనలూ, ఉత్తమ సాహిత్య గ్రంథాలూ చదివి చర్చించుకుంటాం. అదే మా స్నేహానికి కారణం. అంతకుమించి ఆయన మీద నాకూ అధికారంలేదు, నామీద ఆయనకీలేదు. ఇద్దరం సమానమే. ఆయన ఇంత దూరం వచ్చిన తరువాత నేను చెప్పగలిగిందేమీ ఉండదు. ఇంగ్లీషులో ఒక సామెత ఉంది. కొండ మహమ్మదు ప్రవక్త దగ్గరికి రాకపోతే ప్రవక్తే కొండ దగ్గరికి వెళ్లకతప్పదని. ఆయన రాకపోతే మీరే అక్కడికి వెళ్లిమాట్లాడండి- తప్పేంఉంది? వందలకొద్దీ జనం ఆయన దగ్గరికి వచ్చిపోతున్నారు. పత్రికలవాళ్లూ, ప్లీడర్లూ, మాష్టర్లూ, విద్యార్థులూ, కార్మికులూ- ఒకరేమిటి అందరూ వెళ్లి ఆయన చెప్పినది వింటున్నారు. మీరువెళ్లి ఆయన చెప్పినది విని, ఆపైన మీరు చెప్పేది చెప్పవచ్చుగదా. ఆయన ఎంతో మర్యాదస్తుడు. ఎవరేమి చెప్పినా వింటాడు. కాని నిర్ణయం మాత్రం తనదే" అన్నాను నేను.

ఆయనలో ఉక్రోషం పెరిగిపోతోంది. సినిమాలో విలన్ చేసినట్టే "ఏయ్" అని ఒక్కసారి బల్లమీద కొట్టి 'మేం, మేం ఎవడో కోన్‌కిస్కాగాడి దగ్గరికి పోయి నిలబడాలా! తలచుకుంటే ఆడిని మూడు నిమిషాల్లో మసి చేసెయ్యగలం" అన్నాడు.

"చేసి చూడండి" అన్నాను నేను.

ఒక్కసారి అదిరిపడి నాకేసి చూశాడు- "ఆడికింతకండ కావరమెట్టా వచ్చిందట?" అన్నాడు.

"ఆయనంత స్వతంత్రజీవి మరొకడు లేడండీ. తనకాళ్లు మీద తను నిలబడుతున్నాడు. తనచేతులకష్టం మీద బతుకుసాగిస్తున్నాడు. న్యాయంగా బతుకుతున్నాడు. నలుగురితో మంచిగా ఉంటున్నాడు. చేతనైనంతవరకూ నలుగురికీ సాయపడటానికి ప్రయత్నిస్తాడు. మహాత్మాగాంధీ, స్వామి వివేకానందల రచనలు చదివి తన జీవితం ఉన్నతంగా తీర్చిదిద్దుకుంటున్నాడు.

ఆయనెవరికి భయపడాలి? ఆయనేం తప్పుచేస్తున్నాడు? ఏదైనా తప్పు చేస్తున్నట్టు నిజంగా చూపిస్తే ఆయన వెంటనే తప్పు ఒప్పుకొని సరిదిద్దుకుంటాడు. కాని ఆయన సదసద్ వివేకంకలవాడు. తను సరియైన మార్గాన్నే నడుస్తున్నానని ఆయనకి తెలుసు. ఏ చట్టమూ అతిక్రమించడంలేదు, ఏ నీతినూత్రాన్నీ ధర్మాన్నీ ఉల్లంఘించడంలేదు. పదిమంది పిరికిరౌడీలు ఒంటరివాడిని చేసి కొట్టి చంపవచ్చేమోగాని భారతప్రభుత్వం కూడా ఆయననేమీ చేయలేదండీ. ఇంతకీ ఆయన చేస్తున్న తప్పేమిటో మీరు చెప్పారు కారు" అన్నాను నేను.

"అయితే పంతులూ... నువ్వాడిని వెనకేసుకొస్తున్నావన్నమాట!"

"వెనకేసుకురావడం కాదండీ- ఆయన చేస్తున్న తప్పేమిటో నాకర్థం కావడంలేదనే చెప్పుకున్నాను"

"ఇదుగో పంతులూ- నువ్వు చేసే ఉద్యోగం




గుర్తుందా? మేమెవరమో తెలుసునా? మేం తలచుకున్నామంటే నిన్ను రేపే ట్రాన్స్‌ఫర్ చేయించగలం''

''నిండామునిగినవాడికి చలేమిటండీ. నేను ట్రాన్స్‌ఫర్‌కి సిద్ధంగానే ఉన్నాను. ఏ అడవిలో కైనా ఏ ఎడారిలోనైనాసరే. ఒకవేళ ఉద్యోగం నుంచి తీసేసినా అందుకూ సిద్ధంగానే ఉన్నాను. అప్పుడు నేనూ నిజంగా ఆ సుబ్రహ్మణ్యంగారిలా స్వతంత్రజీవినవుతాను. నా మెదడులో ఆలోచన, ఒంట్లో శక్తీ ఉన్నంతవరకు ఎక్కడో అక్కడ బతకగలను. ఆఖరికి రిక్షాలాగి పొట్టపోసుకుందుకు కూడా సిద్ధమే'' అన్నాను నేను.

ఆయన నాకేసి తెల్లబోయి చూశాడు. ఏమీ మాట్లాడలేదు.

నాకు దొరికిన అవకాశాన్ని వదులుకోదలచ లేదు- ''ఇంతకీ సుబ్రహ్మణ్యంగారు ఏమి తప్పుచేశాడన్న నా ప్రశ్నకి మీరు సమాధానమివ్వలేదు. ఆయనవల్ల ఎవరికి బాధ కలుగుతోంది? ఏ విధమైన బాధ కలుగుతోంది'' అని అడిగాను.

ఆయన నావైపు చాలా అసహనంతో చూశాడుగాని మాట్లాడకుండానే ఉండిపోయాడు.

''సుబ్రహ్మణ్యంగారి మాట అటుంచండి. పోనీ నామాట చెప్పండి. మీ అబ్బాయీ, అతని స్నేహితులూ నన్నెలా దారుణంగా కొట్టారో మొదట్లో చెప్పాను. నేనేం తప్పుచేశానని అంత హింసకు గురికావలసి వచ్చింది?'' అని ప్రశ్నించాను నేను.

ఆయన మొహం చిరాకుగా పెట్టి ''అది వాళ్ళనే అడగకపోయావా?'' అన్నాడు.

''అడిగాను... వాళ్లదారికడ్డువచ్చానని కొట్టారట. నిజానికి నేను వెళ్లి వారి దారికడ్డంగా నిలబడనేలేదే, వాళ్లే ఇతరుల జీవితాల్లోకి చొచ్చుకువచ్చి నానాఅల్లరీ చేయసాగారు, నానా బాధలూ పెట్టసాగారు. అది తప్పుకాదా అన్నందుకు నన్ను కొట్టారు. వాళ్లు అల్లరిచేయడం తప్పుకాదుగానీ నేను అల్లరిచేయకండి అనడం తప్పా? ఇందాక సుబ్రహ్మణ్యంగారు ఏమి తప్పుచేశాడో నాకర్థం కావడంలేదన్నందుకు నేనాయనని వెనకేసుకువచ్చానన్నారు. ఇప్పుడు మీరు మీ అబ్బాయినీ, అతని స్నేహితుల్నీ వెనకేసుకువస్తున్నారని నేననవచ్చా? మీతో చెప్పిఉంటే మందలించేవాడినన్నారు. మీవాడూ, తోటివాళ్ళూ చేస్తున్న పనులు మందలించదగ్గవా, మెచ్చుకోదగ్గవా?'' అని నేను తిరిగి ప్రశ్నలవర్షం కురిపించాను.

అప్పటికీ ఆయన మాట్లాడలేదు. మళ్లీమద్యం ఒక గుక్క పుచ్చుకున్నాడు మిడిగుడ్లు పెట్టి నాకేసి చూస్తూ ఉండిపోయాడు.

నేనే అన్నాను- ''చూడండి వరప్రసాదరావుగారూ... మీకు హాని జరగాలనీ, మీ అబ్బాయికి హాని జరగాలనీ నేను కోరడంలేదు. అలాగే మీవల్లా ఇతరులకు హాని జరగకూడదనే మేము కోరేది. ఆ అమ్మాయి శ్యామల చాలా తెలివైనదీ, చలాకీయైనదీ, చాలా మంచిదీ. ఆమె ఏం తప్పుచేసింది? ఒక బీదగుమాస్తా కూతురు, తల్లిలేని పిల్ల. అయినా కొంచెం పైకి చదవాలనుకుంది. జీవితంలో పైకి రావాలని ఆశించింది. మీవాడి స్నేహితుడు నరసింహులు ఆమెను ప్రేమించానన్నాడు. ఆమె తనని ప్రేమిస్తుందో లేదో అనైనా చూడకుండా ఆమెను సతాయించసాగాడు. ఆమె తండ్రి ఎలాగో కాళ్లావేళ్లాపడి ఒక సంబంధంవారిని ఒప్పించి ఆమెకు పెళ్లిచేయబోతే మీవాడి సాయంతో ఈ దుష్టుడు దొంగశుభలేఖ పుట్టించి ఆ వివాహం చెడగొట్టాడు. పోనీ తనని చేసుకోమంటే తండ్రికి భయపడి వెనక్కి పారిపోయాడు. ఆ అమ్మాయి జీవితం ఏం కావాలి? అన్నివైపులా అంధకారం అలముకున్నట్లై ఆమె ఆత్మహత్య చేసుకుంది. ఆమె ఏమి తప్పుచేసిందని మళ్లీ అడుగుతున్నాను. ఆమెకు మాత్రం జీవించే హక్కులేదా? ఇదే ప్రశ్న ఆమె చనిపోబోతూ నన్నడిగింది. ఆ ప్రశ్నకు జవాబు చెప్పలేకపోయాను. మీరు చెప్పగలరా? మీ అమ్మాయి జీవితంతోనే ఒక దుష్టుడు చెలగాటమాడితే, ఆమెకే ఇలాంటి అనుభవం ఎదురైతే మీకు ఎలా ఉంటుందో ఒక్కమారు ఊహించండి. సుబ్రహ్మణ్యంగారు ఈమె విషయమే కాకుండా రామ్‌గోపాల్ విషాదగాథ కూడా తీసుకున్నాడు. ఆ రామ్‌గోపాల్ చేసిన తప్పేమిటి? మీ అమ్మాయి పమిటకొంగు ఎవడో పదిమంది మధ్యలాగితే మీకెలా ఉంటుంది? తన చెల్లె



లిని అవమానించిన వాడికి బుద్ధిచెప్పబోతే అతని ప్రాణం తీసేశారు. అతని ముసలి తల్లిదండ్రుల అవస్థ ఆలోచించారా? అతని సొంత కుటుంబ పరిస్థితి ఆలోచించారా? మీకిక్కడ స్థానబలిమి ఉంది కాబట్టి మీరూహించలేరు- కాని మీ అబ్బాయే మరో ఊరుపోతే, అక్కడ ఏదో అన్నాడని అక్కడి గూండాలు పదిమంది మీవాడిని ఒక్కడిని చేసి కొట్టి దారుణం చేస్తే మీకెలా ఉంటుంది? మీ అబ్బాయివాళ్లు ఏమి చేస్తున్నారో మీరు గమనించవద్దా? ఇలా ఇతరులను బాధించడంలో, వేధించడంలో ఆనందమేమిటో అర్థంకాదు. అడవిలో ఘాతుకమృగాలన్నవి కూడా ఆకలి వేసినప్పుడు తమ ఆహారానికి సరిపడా మాత్రమే వేటాడతాయట. అనవసరంగా కనిపించిన జంతువునల్లా కరచిరావట. బతికి ఉన్నందుకు చేతనైతే నలుగురికీ సాయపడాలి. ఉపకారం చేయాలి. వారి మంచితనం సంపాదించాలి- అంతేకాని అందరూ మనని చూసి భయపడేటట్లూ, అసహ్యించుకునేటట్లూ వ్యవహరించడమా? ప్రతివాడూ ఎప్పుడో అప్పుడు చావకతప్పదు చచ్చినప్పుడు, ఈ ఆస్తిపాస్తులూ, అధికారాలూ, పలుకుబడీ ఏవీ వెంటరావు. అందరూ సమానంగా మట్టిలో కలవవలసిందే. బతికి ఉన్నప్పుడైనా మనస్థితిగతుల్లో ఏదైనా తారుమారైనా, మన కన్నోకాలోపోయినా చూసేవాడెవడూ ఉండడు. మనం పోయిననాడు 'పీడ విరగడైందిరా' అని నలుగురూ ఆనందించేటట్లుకాక 'అయ్యో పోయాడా' అని బాధపడేటట్లూ, మనమంచిని చాలాకాలం గుర్తుచేనుకునేటట్లూ బతకాలి గాని—''

అని నేనింకా చెప్పబోతుంటే ఆయన చాలా తీవ్రంగా చూస్తూ 'వెళ్లిపొండి వెళ్లిపొండి' అన్నట్లు చెయ్యి విసరసాగాడు. ఇక ఆయనతో మాట్లాడి లాభంలేదని నేను లేచి, ''వస్తానండి, నమస్కారం, నేను చెప్పినదానిపై ఆలోచించండి- చాలు'' అని గుమ్మంవైపు నడిచాను.

గుమ్మం అవతలకి పోబోతూంటే ''పంతులూ... ఆగు'' అని అరిచాడాయన.

నేను టకీమని ఆగిపోయి వెనక్కితిరిగాను. ఇంతలో ఏమైంది? కోపంపట్టలేక నన్నేమైనా చేస్తాడా అన్న ఆలోచనవచ్చింది. నాలో ఈషణ్మాత్రం భయపు కంపం బయలుదేరింది.

''కోటయ్యా'' అని కేకేశాడు ఆయన. నస్పెన్సు మరింతపెరిగింది; భయము పెరిగింది.

ఆ కోటయ్య వచ్చాడు- ''ఆ పంతుల్ని తిరిగి కారులో ఎక్కించుకొని ఆరింటిదగ్గర జాగ్రత్తగా దిగబెట్టిరమ్మను'' అన్నాడు వరప్రసాదరావు.

కారుమబ్బు ఒక్కసారి విడిపోయింది. ఈసారి ఆశ్చర్యపోవడం నావంతైంది. ఆయనకేసి చూశాను. మళ్లీ మద్యం సీసా అందుకొని ఈమారు కొంచెం పెద్దమోతాదు పోసుకొని తాగి కుర్చీలో వెనక్కి జేరబడ్డాడు.

నేను కారులో ఇంటిదగ్గర దిగి, నవ్వుతూ లోపలికి వెళ్లేసరికి మా శ్రీమతి కళ్లు పెద్దవిచేసి చూసింది- ''మీరు తిరిగి వచ్చేవరకూ గుండెలు బిగపట్టుకొని కూర్చున్నాను. ఆయన ఏమీ అనలేదా? ఇంతకీ ఎందుకు పిలిచినట్లట?'' అని అడిగింది.

''ఆయన ఏమంటాడు- సుబ్రహ్మణ్యంగారి చేత ఉద్యమం మానిపించమన్నాడు. నేను అది నాకు మించినపనని చెప్పి వచ్చేశాను'' అని చెప్పాను.

ఆ సాయంత్రం నేను సుబ్రహ్మణ్యం జరువుతున్న ఉద్యమ స్థలానికి వెళ్లడం పడనేలేదు. నాకోసం ప్రాణాలు బిగపట్టుకొని చూస్తూ మా శ్రీమతి వెళ్లలేదు. కాని ఉద్యమం బ్రహ్మాండంగా సాగిపోతూ ఉంటుందని మాత్రం నాకు నమ్మకముంది. వరప్రసాదరావు నుంచి పిలుపు ఉద్యమప్రభావం పడవలసినచోట్ల పడుతోందని తెలియజేస్తోంది. అంతకన్నా ఏమి కావాలి?

రాత్రి పడుకున్నప్పుడు వరప్రసాదరావుతో ముఖాముఖీ ఒకసారి సమీక్షించుకున్నాను. నాకు సంతృప్తే కలిగింది. నేను ఆయన ముందు భయం ప్రదర్శించలేదు. పైగా నేను చెప్పదలచుకున్నవి చెప్పే వచ్చాను.

కాని నాకు అంతకన్నా సంతృప్తీ, ఆసక్తీ కలిగించిన విషయమేమంటే అంత రౌడీలకు రౌడీ, దుర్వ్యసనపరుడూ, దుర్నీతిపరుడూ, ధనమదాంధుడూ అనుకున్న ఆయనలోనే




ఎక్కడో మానవత్వం అన్నది ఇంకా కొద్దిగా దాగి ఉంది. దానిని నేను ఒకసారి స్పృశించగలిగాను అన్నదే. లేకపోతే అలా వినేవాడే కాదు. మౌనంగా ఉండేవాడు కాదు. బహుశా వయస్సు పెరిగిన మీదట వచ్చే మార్పు వల్ల కావచ్చు. అదే ఒక ఐదూ, పదేళ్ల కింద అయితే నన్ను అక్కడే నిలువునా చీరేసి మళ్లీ ఐపు లేకుండా ఎక్కడో పాతిపెట్టించి ఉండునేమో. ఏమైతేనేం నేను భయపడినట్టు ఆయనతో భేటీ బాధాకరంగా ముగియలేదు. అది అలా ఉంచి ఆయన కొడుకు సురేశ్ కూడా నా ప్రశ్నలకు తెల్లబోయాడు, వెంటనే జవాబు చెప్పలేకపోయాడు, కొంచెం ఇరకాటంలోకూడా పడ్డాడు అని జ్ఞాపకం వచ్చింది. అంటే అతనిలో కూడా మానవత్వం ఇంకా పూర్తిగా హరించిపోలేదన్నమాట. ఎటువచ్చీ వయస్సు ఇచ్చే సొగసు కారణంగా ఆ కవాటం గట్టిగా మూసివేసి అహంకారానికేవశుడై నామీద దారుణం జరిపించాడు.

ఈ సందర్భంలోనే నేను మొదట్లో నరభక్షకుల్ని గురించి చేసిన వ్యాఖ్యలు పూర్తిగా ఉచితమని ఇప్పుడు మళ్లీ అనిపిస్తోంది. పులులు నరభక్షకులుగా తయారయ్యాయంటే చాలావరకు నరులే కారణమని ఎందరో వేటగాళ్లూ, జంతుప్రియులూ చెప్పారు. అలాగే ఈ రౌడీలూ, దుర్మార్గులూ తయారయ్యారంటే అందుకు మన సమాజానిదే తగినంత పాత్ర ఉందని నాకనిపించింది. పెంపకంలో లోపం కారణంగానో పరిస్థితుల కారణంగానో కొందరిలో దుష్టశక్తులు ప్రకోపిస్తాయి. అలాంటివారిలో కొందరు తెలివితేటలు ఉపయోగించో, కేవలం కండబలం ఉపయోగించో డబ్బూ పలుకుబడికూడా సంపాదిస్తే, ఇక సమాజంలోని స్వార్థపరశక్తులు-వాటిలో రాజకీయ శక్తులు కూడా ఉంటాయని వేరే చెప్పనక్కర్లేదు - వారి వల్ల ప్రయోజనం పొందడానికి ప్రయత్నిస్తాయి. ఆ విధంగా వారికి లేని ప్రాముఖ్యతను కలిగించి, వారిని మరింత దుర్మార్గులుగా, రాక్షసులుగా తయారయ్యేటట్టు చేస్తాయి. ఇది ఒకవైపైతే రెండో వైపు ఆత్మవిశ్వాసం, ధైర్యమూలేని అధిక సంఖ్యాకులు తమ భయం ద్వారా, అనైక్యతద్వారా అట్టి దుష్టశక్తులకి తిరుగులేని బలమూ అధికారమూ ప్రసాదిస్తారు. నలుగురూ గట్టిగా ఎదిరిస్తే తోకముడిచే రౌడీ భయం ద్వారా నాలుగు వందల మంది మీదేమిటి, నాలుగు వేలమందిపై కూడా తన ప్రతాపం చలాయిస్తాడు. సమాజంలో అన్యాయం ఇంతగా సాగుతోందంటే సమాజంలోని అధికారం, ప్రజల్లోసంకుచితస్వార్థం, పిరికితనం ఆలోచించలేకపోవడమే చాలావరకు కారణమని నా అభిప్రాయం దృఢమయింది. ఏమైతేనేం నాకు వరప్రసాదరావు మీద మొదట్లో ఉన్న అసహ్యం, ద్వేషం కొంత తగ్గాయి. ఎన్ని లోపాలున్నా అతను ఇంకా మనిషే అనిపించింది. సమాజం అశక్తతమీదికి ఇపుడు నాకోపం మళ్లింది.

రాత్రి పడుకునే ముందు సమాజంమీదే నాకోపం పెరిగిందని చెప్పాను. పొద్దున్న లేచిన తరువాత నా అభిప్రాయాన్ని విషయాన్ని సవరించుకోవలసి వచ్చింది. సమాజమంతటినీ నిందించగూడదు. సమాజంలో వివిధరంగాల్లో తమ కర్తవ్యం నిజాయితీతో చేస్తూ, సమాజహితం కోసం కృషిచేస్తున్నవారు కొందరైనా ఉన్నారు. లేకపోతే ఈ సమాజం ఎప్పుడో అంటుకుపోయేది. మనకి స్వాతంత్ర్యం సిద్ధించేది కాదు. దూరంపోనక్కరలేదు- సుబ్రహ్మణ్యమే ఉన్నాడు కదా. భవద్విధేయుడు కూడా శక్తిసామర్థ్యాలతో కాకపోయినా ఆకాంక్షలతో ఆకోవలోకే వస్తాడని విన్నవించుకోవడం అహంకారం కిందరాదని ఆశిస్తున్నాను. కాని మహాత్మాగాంధీ కూడా ప్రజల తోడ్పాటు లేకుండా ఏమిచేయగలిగేవాడు? అంటే ప్రజలు మేల్కొని ఉద్యమించే సందర్భాలు లేకపోలేదు. ఇప్పుడు సుబ్రహ్మణ్యం ప్రయత్నానికి ప్రజల నుంచి మంచి స్పందనేవస్తోంది కదా.

అవును... సుబ్రహ్మణ్యం ఉద్యమం నగరంలో పెద్ద సంచలనమే తెచ్చింది. వివిధ పక్షాల రాజకీయ నాయకులు వచ్చి కలుసుకున్నారు. వారు తమవేలు పెట్టి దానిని బ్రహ్మరాక్షసిగా చేయకుండా ఉండేందుకు సుబ్రహ్మణ్యం తన ఉద్యమం పరిమితలక్ష్యం స్పష్టంగా వివరించాడట వారికి. దానితో వారు తాము చేయగలిగింది ఏమీలేదని గుర్తించి అతనికి తమతోడ్పాటు మాత్రం ఉంటుందని హామీ ఇచ్చారట. జిల్లా కలెక్టరూ పోలీసు సూప



రింటెండెంటూకూడా వచ్చి వెళ్లారట. కొంత మంది ప్లీడర్లు రామ్‌గోపాల్ విషయంలో మేజిస్ట్రేట్ ముందు వాస్తవాలు. వినిపించడానికీ, వాదించడానికీ ముందుకు వచ్చారట.

ఒక పరిణామమేమంటే దుష్టచతుష్టయం చెల్లాచెదరైంది. వరప్రసాదరావు తన కొడుకుని రెండు మూడు నెలలవరకు రాకు అని చెప్పి ఢిల్లీ పంపివేశారు. పూర్ణచంద్రరావు తల్లిదండ్రులు అతన్ని హైదరాబాదులో తమ హొటలు ప్రాజెక్టులో పనిచేయమని చెప్పి ఒక అన్నగారి దగ్గరికి పంపారు. నరసింహులు తండ్రి అతనికి వెంటనే మేనమామ కూతురినిచ్చి పెళ్లిచేశాడు. ఇవుడు వాడు పెళ్లాం కొంగు పట్టుకొని తిరుగుతూ వీధిలోకి ఆట్టే రావడం లేదు. నాగేంద్రాన్ని వాడి తండ్రి వ్యవసాయం చూడమని సొంత పల్లెటూరు పంపించాడట. అందువల్ల ఆడవాళ్ల వేధింపు కొంతవరకు తగ్గిందన్నమాట. ఇంకా మరెందరో అలాంటి వారు ఉండి ఉంటారు కాని వాళ్లవి సంఘటిత బృందాలు కావు, బలిష్ఠమైనవీ కావు.

దానాదీనా సుబ్రహ్మణ్యం తన ఉద్యమాన్ని ఉపసంహరించడానికి ఈరోజు అతను నగరంలో ఒక పెద్ద నాయకుడైపోయాడు. తక్కిన నాయకుల్లాకాక గాంధీగారి మార్గానికి చెందిన నాయకుడుగా ప్రజల మన్ననపొందాడు.

మేజిస్ట్రేట్ దర్యాప్తు ప్రారంభమయింది. సుబ్రహ్మణ్యం రామ్‌గోపాల్ తమ్ముడినీ, చెల్లెలు దుర్గనీ, తల్లిదండ్రుల్ని ప్లీడర్ల సాయంతో మేజిస్ట్రేట్ ముందు హాజరుపరచి స్టేట్‌మెంట్లు ఇప్పించాడు.

ఆ తరువాత రెండురోజులకే సుబ్రహ్మణ్యం మాయింటికి వచ్చాడు. చాలారోజుల తరువాత మేమిద్దరం కలుసుకోవడం అదే. మా ఇంటిల్లిపాదీ చాలా సంతోషంగా అతనికి స్వాగతం చెప్పాం. "సుబ్రహ్మణ్యంగారూ... మీరు అద్భుత విజయం సాధించారు. సత్యం ఎప్పటికయినా జయించితీరుతుందని మీరు రుజువు చేశారు. అందుకు అహింస ఉత్తమ సాధనం అని కూడా ప్రజలకి ఎత్తిచూపారు. మీకు నా సహస్రాభినందనలు" అన్నానునేను.

"నాకు స్ఫూర్తి ఇచ్చిందీ, ప్రోత్సాహమిచ్చిందీ మీరేనన్నమాట మరచిపోకండి మాష్టారూ. మీరు ఆ అభాగినికోసం ఆరాటపడి చేసిన ప్రయత్నాల సందర్భంగా నాకు మీ పరిచయమేర్పడటం, నాలో ఒక చిన్న నిప్పురవ్వ పడటంవల్ల ఇంత జరిగింది. మీ పరిచయం కాకపోయి ఉంటే నేను యథాతథంగా 'అక్కగారూ, కాఫీపొడి కావాలా?' అంటూ తిరుగుతూండేవాడిని" అన్నాడతను.

"అది నా అదృష్టమనుకుంటాను, సుబ్రహ్మణ్యంగారూ. ఏమైనా మన లక్ష్యం నెరవేరింది కదా" అన్నాను నేను.

"సరియైనవిధంగా విజ్ఞప్తిచేస్తే ప్రజలు సరియైనవిధంగానే స్పందిస్తారని తేలిందండీ. అది ఆశాజనకమైన విషయం. ఈనాడు చూస్తున్న కొట్లాటలూ, అల్లకల్లోలాలూ పైకి ప్రజలకోసమని చెప్పినా నిజానికి స్వార్థమో, సంకుచిత దృష్టి చేతో ప్రేరేపించబడ్డ నాయకులవల్లే అన్న నా నమ్మకం దృఢమయిందండీ"

"ఏమైతేనేమి మనకి చాలా ఆనందమే కలిగింది. ఏమంటారు?" అన్నాను నేను.





అతనిలో ఏదో అసంతృప్తి గోచరించింది. నేను ఆశ్చర్యంగా చూశాను- "కాని మాష్టారూ... మనమనుకున్న లక్ష్యం నెరవేరిందా అని నాకింకా సందేహం కలుగుతోందండీ, ఎందుకంటే చతుష్టయాన్ని శిక్షించేందుకు, చట్టబద్ధంగా చర్యలు తీసుకుందుకు తగిన ఆధారాలు లేవని నాకు మిత్రులైన ఒక ప్లీడరుగారు చెప్పారు. రామ్‌గోపాల్ విషయంలో కూడా వాళ్ళని నేరస్తుల్లాగా చేర్చడం ఇంచుమించుగా అసంభవమని చెప్పారు. మేజిస్ట్రేట్ దర్యాప్తు నుంచి కూడా మనం పెద్దగా ఆశించకూడదన్నారు. ఎందుకంటే సాధారణంగా ఏదోవిధంగా మూడునెలల్లో దర్యాప్తు పూర్తికాదు. మరో మూడునెలలు పొడిగిస్తారు. అప్పటికి ప్రజలు దానిని గురించి మరచిపోతారు. ఆ దర్యాప్తువల్ల నేరం చేసిన పోలీసులనైనా దండించడం జరుగుతుందనే నమ్మకం లేదన్నారు ఆయన. మహాఅయితే మరొకచోటికి బదిలీ, ఇంక్రిమెంట్లు నిలపడంవంటివి జరగవచ్చునేమో అన్నారు"

నేనాలోచించాను- "మీ ప్లీడరు స్నేహితుడు చెప్పినది నిజమేననిపిస్తోందండీ. కాని ప్రజల్లో ఒక సంచలనం తీసుకువచ్చారుకదా. ఒకసారి కళ్ళు తెరచిచూసి, ఒకసారైనా కొంచెం ఆలోచించేటట్లు చేశారు కదా" అన్నాను నేను.

"అవును... అంతవరకూ మనంకొంత సాధించినట్టే. అందుకు నాకు ఒకవిధంగా సంతోషంగానే ఉంది. మరొక విషయం మాష్టారూ ఈ ఉద్యమం కారణంగా వ్యక్తిగతంగా నాకు కొంత లాభం చేకూరేటట్లుందండీ" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"ఏమిటి... చెప్పండి" అన్నాను ఎంతో ఆసక్తితో.

"నేను ఉద్యమం నడిపినతీరును చాలా సంతోషించి, నేను ఇంతకీ ఇంటింటికీ తిరిగి కాఫీపొడి అమ్ముకునేవాడని మాత్రమే అని తెలుసుకొని ఒక బాంకు మేనేజరుగారు నేను నలుగురు పెద్దమనుషుల సహకారం సంపాదిస్తే నాకు ఇప్పటికన్నా ఎక్కువస్థాయిన నా పరిశ్రమ నడుపుకుందుకు ఋణ సదుపాయం చేస్తానన్నాడు. సహకరించడానికి పెద్దమనుషులు కూడా ఉన్నారు. నన్ను ఈ అవకాశం వినియోగించుకోమంటారా- చెప్పండి. నా స్వార్థం చూసుకున్నట్లవుతుందా? నేను తప్పు చే

సినట్లవుతుందా? మీ సలహా ప్రకారమే నడచుకుంటాను మాష్టారూ" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"తప్పకుండా వినియోగించుకోండి. సిరి రామోకాలడ్డకూడదంటారు. మీరు దానికోసం ప్రయత్నం చేయలేదు. అవకాశం మిమ్మల్నే వెతుక్కుంటూ వచ్చింది. సమాజం మంచికన్నా తనమంచిని ముందుపెట్టడం తప్పుకావచ్చుకాని సమాజం బాగుతోబాటు తన బాగు చూసుకోవడం తప్పెలా అవుతుంది? మనం సన్యాసులం కామండీ... మనకి బాధ్యతలూ ఉన్నాయి. బంధాలూ ఉన్నాయి. వాటిని తోసిపుచ్చకూడదుకదా. ఈ దృష్టితోనేకదా మీరు నన్ను మీ ఉద్యమానికి దూరంగా ఉండమన్నదీ, ఉద్యోగం పోగొట్టుకోవద్దన్నదీ. నావాళ్లు ఏమైపోయినా లోకాన్నే నేను ఉద్ధరిస్తాను అని ఆవేశపడేవాళ్లపట్ల నాకు అంతగౌరవం లేదండీ" అన్నాను నేను.

"మీరు ఆ మాత్రం ప్రోత్సాహమిచ్చారు చాలు. నేను మీ ఆశీర్వాదంతో ఈ అవకాశాన్ని ఉపయోగించుకుంటానండీ. కాని క్రమంగా నాలో వృత్తిలో ఈ అభివృద్ధి కారణంగా స్వార్థబుద్ధి పెరిగిపోతుందేమోనండి. నేను పెట్టుబడిదారునైపోతానేమో, నన్ను కనిపెట్టి ఉంటూ నేను తప్పుదారిన పడకుండా హెచ్చరిస్తూ ఉంటారుకదా?" అని అడిగాడు.

"ఓ... తప్పక- అలాగే" అని నవ్వాను నేను.




సుబ్రహ్మణ్యానికి బాంకు రుణం వచ్చింది. యంత్ర సామగ్రి తెచ్చాడు. అతని కింద మరో నలుగురు పనివాళ్లు-ఇద్దరు పురుషులూ, ఇద్దరు స్త్రీలు-పనిచేస్తున్నారు. బజారులో ఒక షాపు పెట్టాడు. ఆ షాపులో కాఫీపొడీ వగైరాలతోపాటు బిస్కట్లూ, టాఫీలూ, సబ్బులూ, ఇతర టాయిలెట్ వస్తువులూ, కొన్ని ఫాన్సీ వస్తువులూ కూడా పెట్టాడు. అటు తన పాత ఖాతాదార్లని అశ్రద్ధ చేయడంలేదు. వారికి తన పనివారిచేత ఇంటికే కాఫీపొడీ వగైరాలు అందచేయిస్తూనే ఉన్నాడు. అప్పుడప్పుడు స్వయంగా వెళ్లివారిని పలుకరించి వస్తున్నాడు. ఇప్పుడతని పని నిజంగా చాలా బాగుందని చెప్పాలి. కొన్ని సంఘాలవారు, పాఠశాలలవారు గాంధీగారిమీద, వివేకానందుని బోధనలమీద అతని చేత ఉపన్యాసాలిప్పిస్తున్నారు కూడా.

ఊళ్లో గొడవలు అంతగాలేవు, నగరం అన్న తరువాత కొన్ని నేరాలు, సంఘటనలూ జరుగుతూనే ఉంటాయి అనుకుంటే మొత్తం మీద ప్రజాజీవితం సాఫీగానే సాగుతోందని చెప్పాలి.

వరప్రసాదరావు కొడుకు సురేష్ నగరానికి తిరిగివస్తూ మామూలుగా రాలేదు. ఒక పెద్ద రాజకీయపక్షపు రాష్ట్ర సంయుక్త కార్యదర్శిగా వచ్చాడు. ఇప్పుడు కనబడ్డ వాళ్లందరికీ చిరునవ్వుతో నమస్కారాలు పెడుతున్నాడు. ఎవరైనా తనని అర్థిస్తే అధికార్లతో చెప్పి వారి పనులు త్వరగా జరిగేటట్లు చూస్తున్నాడు. భవిష్యత్తులో అతను శాసనసభ్యుడు కావడం తప్పదంటున్నారు కొందరు. ఇది సంభవమే అని నాకు కూడా తోచింది. ఎందుకంటే ఒక రోజు ఒక సభ వద్ద అతను అందరికీ నమస్కారం పెడుతూ నాకూ పెట్టాడు. అంతలో నన్ను గుర్తించాడు. ఒక్కక్షణం తొట్రుపాటు చెందినట్లున్నాడు. కాని వెంటనే తేరుకొని నవ్వుతూ- "గతాన్ని మరచిపొండి మాష్టారూ... అధ్యాయం ముగిసింది. ఇప్పుడూ, ఇక ముందూ మీ ఆశీర్వాదాలు కావాలి నాకు" అన్నాడు 'వినయం' ప్రదర్శిస్తూనే. రాజకీయ నాయకుడి లక్షణాలు అలవరచుకోవడంలో అప్పుడే చాలావరకు కృతకృత్యుడయ్యాడనే నాకు నమ్మకం కలిగింది.

నరసింహులు పెళ్లాం మోజులోపడి సురేష్ దగ్గరికి కూడా అంతగా రావడంలేదని తెలిసింది. పూర్ణచంద్రరావు హైదరాబాద్‌లోనే ఉండిపోయాడు. నాగేంద్ర పల్లెటూళ్లో వ్యవసాయం నప్పక తిరిగి నగరానికే వచ్చేశాడు. కాని తండ్రి ఇప్పుడతనిని రోజస్తమానూ కిళ్లీకొ



ట్టుమీదే కూర్చొబెడుతున్నాడు.

అటు మేజిస్ట్రేట్ దర్యాప్తు ఇంకా పూర్తికాలేదు. అనుకున్నట్లుగానే మరో మూడునెలలు పొడిగించారు.

అంతా బాగా నడచిపోతూనే ఉందనుకుంటుండగా నిర్మలాకాశం నుంచి పిడుగురాలివడ్డట్లయింది.

దుర్గ మూడో అన్నగారు ఊళ్లోకి వచ్చాడు. అతను పెద్దన్నగారి దారుణపు చావు వార్త విని ఎంతో బాధపడిపోయాడట. కాని ఎక్కడో సుదూరాన లడఖ్ ప్రాంతంలో సైనికుడుగా పని చేస్తున్న కారణంగా ఇటీవలవరకూ సెలవు లభించలేదట. రెండో అన్నగారు సింగరేణి తిరిగివెళ్లిపోయాడు. ఊళ్లోకి వచ్చిన తరువాత ఇతను తన పెద్దన్న చావు ఎలా జరిగిందీ, ఏ పరిస్థితుల్లో జరిగిందీ వివరాలన్నీ తెలుసుకున్నాడు. దానితో అతనిలో అగ్నిపర్వతమే బద్దలైనట్లయింది. దానికితోడు నిజమైన నేరస్తుడు నాగేంద్ర ఏ శిక్షా అనుభవించకుండా హాయిగా తిరుగుతున్నాడనీ, తిరిగి ఊళ్లోనే ఉంటున్నాడనీ తెలిసేసరికి అతని ఆగ్రహానికి అవధులు లేకపోయింది.

నాగేంద్ర గురించి వివరాలన్నీ తెలుసుకొని నేరుగా ఆ కిళ్లీకొట్టుకి నడిచాడు. ఓరోజు నాగేంద్ర కనిపించగానే కోపంతో ఒళ్లుతెలియక వెళ్లి నాగేంద్రాన్ని మెడపట్టుకొని ఇవతలకు లాగుకువచ్చి తన్నడం మొదలుపెట్టాడు. అప్పుడే అటువచ్చిన నాగేంద్ర తండ్రి కొడుకు రక్షణకి ముందుకు దూకాడు. అతను స్వతహాగా రౌడీయేకదా. తండ్రీకొడుకులు ఏకమై తిరగబడేసరికి ఎంత సిపాయి అయినా, ఎంత పౌరుషం మండుతున్నా దుర్గ అన్నగారివనే అపాయంలో పడింది. ఆవేశంలో నాగేంద్రం ఒక సోడాసీసా పెట్టి అతని నెత్తిమీద కొట్టాడు. అతనికి దిమ్మతిరిగిపోయినట్లయింది. కాని వెంటనే తేరుకొని నాగేంద్ర మీదికి ఎగిరి అతని చేతిలోని పగిలిన సోడాబుడ్డి లాగుకొని అతని పొట్టలో పొడిచాడు. దానితో నాగేంద్రం కెవ్వుమని కేకవేసి కూలిపోయాడు. తండ్రి కొడుకుని పట్టుకునే సమయంలో దుర్గ అన్న అక్కడి నుంచి పరుగెత్తి చుట్టుపక్కలవాళ్లు తరిమినా వాళ్లెవరికీ చిక్కక, నేరుగా పోలీసుస్టేషన్‌కి వెళ్లి పోలీసులకి జరిగింది చెప్పి లొంగిపోయాడు.

వార్త తెలిసి ఊళ్లో జనం నిజంగా సంతోషించారు. దుష్టుడికి తగిన శిక్షపడిందన్నారు.

యువజన నాయకుడూ, నాగేంద్రం మిత్రుడూ అయినా సురేశ్ మాత్రం శవపంచాయతీ జరిగి పోస్టుమార్టమ్ అయిన తక్షణం పెద్ద శవయాత్ర నడిపించాడు. ఆ యాత్ర పొడుగునా దుకాణాలవాళ్లు తమంతట తాము కొట్లు మూసేశారు.

దహన సమయంలో సురేశ్ ఒక ఉపన్యాసమిచ్చి, తన మిత్రుని హత్యకు, పోలీసు అసమర్థతకి నిరసనగా మర్నాడు నగరంలో బంద్‌కి పిలుపు ఇచ్చాడు.

మర్నాడు ఊళ్లో బస్సులు తిరగలేదు. ఆటోలు తిరగలేదు. రిక్షాలు కూడా నడవలేదు. కాదని సాహసించిన ఒక ఆటోనీ, రెండు రిక్షాలనీ కొందరు కుర్రాళ్లు తలకిందులు చేసి తగలబెట్టారు. కొన్నిచోట్ల రోడ్లకడ్డంకులు పెట్టారు. ఎవరూ చూడటంలేదని షాపు తెరవబోయిన కొందర్ని గట్టిగా బెదిరించి మళ్లీ మూయించివేశారు. మొత్తం మీద బంద్ ప్రశాంతంగా జరిగినట్లే లెక్క.

అంత ప్రశాంతంగా, విజయవంతంగా బంద్ నిర్వహించడంలో తోడ్పడిన ప్రజలకు సురేష్ కృతజ్ఞతలు తెలిపాడు. పెద్దనాయకుల దృష్టిని ఇట్టే ఆకర్షించాడు.

మర్నాటి రాత్రి సుబ్రహ్మణ్యం నా దగ్గరికి పరుగెత్తుకువచ్చాడు. "చూశారూ మనంపడ్డ శ్రమ అంతా బూడిదలో పోసిన పన్నీరైనట్టే అయిందండీ. మనమే ఓడిపోయాం. ప్రజలు అప్పుడే మనల్ని మరచిపోయారు. మన సూత్రాలు సందేశాలు మరచిపోయారు" అన్నాడు ఎంతో నిరాశతో.

"ఎందుకంత నిరాశ చెందుతున్నారు? సురేశ్ మళ్ళీ రంగంమీదికి వచ్చాడనా?" అని అడిగాను.

"నేను దుర్గ మూడో అన్న చర్యను ఏమాత్రం సమర్థించను. తన తొందరపాటుతో అతను అంతా అస్తవ్యస్తం చేసిపారేశాడు. సరే... కాని ఆ నాగేంద్రం ఎవడు, అతను ఎన్నడైనా, ఎవరికైనా, కించిత్తైనా ఉపకారం చేసినవాడు





గునా? అతనికీ అందర్లాగే జీవించే హక్కు ఉందని నేను ఒప్పుకుంటాను. కాని అతను ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగానైనా మరొకరి చావుకు కారకుడయ్యాడే. అయినా చేసిన దానికి అతను ఏమైనా శిక్ష అనుభవించాడా? పోనీ పశ్చాత్తాపపడ్డాడా? మరి అటువంటివాడి చావుకు పెద్ద శవయాత్రా, నిన్నబందూనా? ఈ ప్రజల్లో ఏమాత్రమైనా ఆలోచన ఉందంటారా?'' అన్నాడతను బాధతో, కోపంతో.

''ప్రజలేం చేయగలరు సుబ్రహ్మణ్యంగారూ? ఈనాడు నలుగురు రౌడీలు తలచుకుంటే బంద్ జరపవచ్చును, అది ప్రజాభిప్రాయం అని చిత్రించబోతారు ఈ ప్రజానాయకులని చెప్పుకునే స్వార్థరాజకీయవాదులు. ఇందులో ప్రజల ప్రమేయం ఏమాత్రంలేదు. ఇది నిజంగా ప్రజల నోరునొక్కి అవునన్నట్టు వారి తల ఆడింపజేయడమే'' అన్నాను నేను.

''రామగోపాల్‌చావు తరువాత బంద్‌లూ, కొట్లాటలూ, కర్ఫ్యూలవల్ల నగర జీవితం ఎంత అస్తవ్యస్తమయిందో అందరికీ తెలిసిందే. అలా బంద్‌లూ, దహనకాండలూ, మారణకాండలూ అక్కర్లేకుండానే ఒక సమస్యని ఎలా అందరి దృష్టికి తీసుకురావచ్చో. మన ఉద్యమంద్వారా మనం చూపించాం. అయినా నిన్న మళ్లీ బంద్ జరిగిందంటే మన శ్రమ అంతా వ్యర్థమేమో అనిపిస్తోంది మాష్టారూ! అన్నట్లు నిన్నటి బంద్ గురించి పూర్తివివరాలు తెలియ రాలేదుకాని కొన్ని విషాద సంఘటనలు నా దృష్టికి వచ్చాయండీ. ఒక యువదంపతులకి ఒకే బిడ్డ. ఆ బిడ్డకి హఠాత్తుగా జబ్బుచేసింది. డాక్టరు దగ్గరికి వెళ్లామంటే ఎక్కడా ఒక్కరిక్లాలేదు. చేసేది వేరేలేక బిడ్డను భుజానవేసుకునే డాక్టరు దగ్గరికి వెళ్ళారు. డాక్టరేమో ఊళ్లో ఎక్కడో చిక్కుబడిపోయాడట. ఇంకా తిరిగిరాలేదు. ఈ దంపతులు రెండు ఫర్లాంగులు నడిచి మరో డాక్టరు దగ్గరికి వెళ్ళారు. ఆయన బిడ్డని పరీక్షచేసి వెంటనే ఆసుపత్రిలో చేర్పించండి. అత్యవసరంగా ప్రాణవాయువిచ్చి చికిత్స చేయాలి అన్నాడట. ఆ దంపతులు మైలుదూరంలో ఉన్న ఆసుపత్రికి మళ్లీ నడక పుచ్చుకున్నారు. మధ్యలో కర్ఫ్యూ ప్రాంతాలు

ఉన్నాయి. అందువల్ల వీళ్లు చుట్టు తిరిగి వెళ్లవలసివచ్చింది. ఎలాగో ఆసుపత్రి చేరేసరికి అక్కడి డాక్టర్లు పరిస్థితి మించిపోయింది. ఇప్పుడు చేయగలిగింది ఏమీలేదు. పైగా ఆక్సిజన్ అయిపోయింది. కొత్త సిలిండర్లు రాలేదన్నారట. ఆస్పత్రిలో పనివారు కూడా సరిగాలేరట. ఏమయితేనేం, మరో అరగంటకే ఆ బిడ్డ తల్లిదండ్రులకి మరి సమస్యలేకుండా చేసి వెళ్లిపోయాడట. ఆ యువదంపతుల బాధచెప్పాలా, మాష్టారు? మరొకచోట వృద్ధ దంపతులు ఈ గొడవలు తెలియక రాత్రి బండికి నగరం చేరుకున్నారు. తీరాచూస్తే ఊళ్లో బంద్, కర్ఫ్యూ. వాళ్లు ఇంకా ఎందరో ప్రయాణీకులతోబాటు స్టేషన్‌లోనే ఉండిపోవలసివచ్చింది. తర్వాతయినా నానాఅవస్థాపడి ఇంటికి చేరుకుని, ఏకంగా ఓ వారం మంచాన పడ్డారట. ఇద్దరు యువకులు ఏదో పోటీపరీక్షకి రాద్దామని బయల్దేరి ప్రయాణంసాగక ఆ అవకాశం పోగొట్టుకున్నారట. ఇలా నగరమంతటా ఎన్ని బాధాకరమైన సంఘటనలు జరిగి ఉంటాయోనండి'' అన్నాడు సుబ్రహ్మణ్యం.

''మీరొక పనిచేయరాదూ? నగరంలో ఈ బంద్‌లు, కొట్లాటాలు వగైరాల కారణంగా ఎవరెవరు ఏయే కష్టాలకూ, నష్టాలకూ గురిఅయ్యారో సమాచారం సేకరించరాదూ? అవి అన్నీ మనమొక కరపత్రంగా వేద్దాం'' అన్నాను నేను.

''మీరు చేసిన సూచన మంచిదే మాష్టారూ... కాని కరపత్రం వేసినా ప్రజలు అర్థం చేసుకుంటారనీ, పాఠం గ్రహిస్తారనీ నమ్మకంపోయిందండీ. లేకపోతే నిన్నటివరకూ దుష్టచతుష్టయం నాయకుడుగా ఉన్నవాడు ప్రజానాయకుడుగా అవతరించడమేమిటీ?'' అన్నాడతను.

''మీరంత త్వరగా నిరుత్సాహపడకండి సుబ్రహ్మణ్యంగారూ! చూడండి- 1857లో స్వాతంత్ర్యంకోసం గట్టి ప్రయత్నం తొలిసారిగా జరిగింది. కాని తొంభైఏళ్లకుగాని లక్ష్యం సిద్ధించలేదు. అది అలా ఉంచి మహాత్మాగాంధీ 1919 నుంచీ నిరంతరం ఎన్నో ఉద్యమాలు నడిపినా 1947కికదా మనకి దాస్యపు చెరవిడిచింది. ఈలోగా ఆయన ఎన్ని ఆటుపోట్లూ, విజయాలు, అపజయాలు, కష్టాలు, వ్యతిరేకతలూ ఎదుర్కొన్నాడో ఆలోచించండి. మనం తలుచుకున్నంతలో లక్ష్యం సాధించి వేయగలమనుకోకూడదు. ఆ మార్గం అంతనూ టియైనదీ, సులభమైనదీకాదు. ఎన్నో ఎదురు దెబ్బలూ, అపజయాలూ, నిర్వేదం కలిగించే సంఘటనలూ ఎదుర్కోవలసిరావచ్చు. అయినా పట్టుదల విడవక ముందుకుసాగితే ఎప్పటికో అప్పటికి లక్ష్యం చేరుకోలేకపోం'' అని అతనిని సాంత్వనపరిచి ఉద్బోధించాను.

''కర్తవ్యపథం గురించి నా భ్రమలు పోగొట్టి కళ్లు తెరిపించారు మాష్టారూ.

అందుకు మిక్కిలి ధన్యవాదాలు. కాని ఇటు నా వృత్తిలో ఇటీవలి మార్పు నామీద ప్రభావం చూపుతున్నట్లే ఉంది. ఇదివరకులా నాకంత తీరిక ఉండడంలేదు, ఓపికా ఉండడంలేదని సిగ్గుపడుతూ ఒప్పుకుంటున్నానండి. అయినా నా ప్రయత్నం విరమించనని మీకు హామీ ఇస్తున్నాను మాష్టారూ. ముందు ఒక సమస్య ఉంది మాష్టారూ? దుర్గ మూడో అన్న దుడుకుతనం చూపించాడు, నిగ్రహం కోల్పోయాడు... నిజమే, అందుకు అతను శిక్ష అనుభవించవలసిందే. కాని హత్యచేయాలన్న ఉద్దేశంతో అతను వెళ్ళలేదుకదా. పరస్పరం కొట్టుకోవడం, నెత్తిమీద గట్టి దెబ్బతగిలేసరికి ఏమి చేస్తున్నదీ తెలుసుకోకుండా ఆపని చేసేశాడు. అతనిలో దుర్బుద్ధే ఉంటే పోలీసులకు స్వయంగా లొంగిపోయేవాడు కాడుకదా. అతను చేయని దానికి శిక్షపడకుండా అతని రక్షణకు పూనుకోవాలి. అతనికికూడా అన్యాయం జరిగితే ఆ కుటుంబం ఇక నిలబడలేదు మాష్టారూ. దుర్గ వచ్చి నన్ను బతిమాలుతోంది. ఒకరోజు తన ముసలి తల్లిదండ్రుల్ని కూడా మా ఇంటికి తీసుకువచ్చింది. ఆ పేటవాళ్ళు కూడా అండగా ఉంటామంటున్నారు. కాని వాళ్ళందరూ ఇంచుమించుగా పేదవాళ్ళు. ఆ ప్రయత్నంలోనే ఉన్నాను. కాని ఎంతవరకు నావల్ల పనిజరుగుతుందో సందేహంగా ఉంది మాష్టారూ. ఇక్కడే మరొక ఇబ్బంది కూడా నన్ను బాధిస్తోందండీ'' అని ఒక నిమిషం ఆగాడతను.

''ఏమిటదీ... నాకు చెప్పవచ్చా?'' అని అడిగాను నేను.





"మీకు చెప్పవచ్చా అని కాదండీ- మీ సలహాయే కావాలి. నా ముఖ్యమైన ఇబ్బంది అల్లా యువకులెవరూ నాకు తోడురావటం లేదండీ. మనం చేసేది వాళ్లని ఆకర్షిస్తే తాత్కాలికావేశంలో వచ్చి చేరుతున్నారు కాని అన్నీ తెలుసుకుందాం, లోతుగా ఆలోచిద్దాం, దీర్ఘప్రణాళిక రూపొందించుకుందాం, అది అమలుపరుద్దాం అంటే ఎవరూ సిద్ధపడటంలేదండీ. మంచి ఆలోచన మన మనస్సు నుంచే పూర్తిగా పుట్టుకురాదు, మంచి పుస్తకాలు చదవడం వల్ల ఆలోచన పెరుగుతుంది, విస్తృతమవుతుంది- అని చెప్పి ఆ పుస్తకాలు సూచిస్తే వాటిని ముట్టుకోవడానికే వారి మనసొప్పదు. చాలామంది చదవనే చదవరు, చదివినా దానిపై ఆలోచించరు, ఆలోచించినా దానిని ఆచరణలో పెట్టరు. ఇదండీ- నిరాశాజనకమైన పరిస్థితి. మన యువకుల్ని రకరకాల రంగురంగుల విద్యుద్దీపాలనవచ్చు. ఆవేశమనే విద్యుత్ వారిలో ప్రసరిస్తే వారు జిగేలుమనిపిస్తారు. ఆ విద్యుత్ ఆగిపోతే చల్లబడిపోతారు. పైగా ఒక విద్యుద్దీపం మరో విద్యుద్దీపాన్ని వెలిగించదు. అదే ఒక అతిసామాన్యమైన ప్రమిద కానీ, కొవ్వువత్తికానీ ఎన్నో ప్రమిదల్నీ కొవ్వు వత్తుల్ని వెలిగిస్తుంది. అటువంటి చిరుదివ్వెల వంటివారే నాకు కనబడటంలేదండీ" అని చెప్పాడు సుబ్రహ్మణ్యం.

"సుబ్రహ్మణ్యంగారూ... ఎవరూ లేరు అనుకొంటున్న సమయంలో నాకు మీరు దొరికారా లేదా? అది ఎంత మంచి పరిణామానికి దారితీసింది! మీరు ఉపన్యాసాలూ, ఇతర కార్యక్రమాలు కొనసాగిస్తూనే ఉండండి. ఎప్పుడో ఎవరో మీరు ఆశించిన లక్షణాలుకల యువకులు మీకు దొరకవచ్చు" అని నేను ధైర్యం చెప్పాను.

"ఆ ఆశతోనే ఉంటాను మాష్టారూ. నావెనక మీరెప్పుడూ ఉంటారు కదా" సుబ్రహ్మణ్యం మరికొద్దిసేపు ఆ విషయాలు ఈ విషయాలూ మాట్లాడి వెళ్ళిపోయాడు.



సుబ్రహ్మణ్యం నేనెప్పుడూ తన వెనక ఉంటాననే ధైర్యంతో ఆనాడు వెళ్లాడు కాని కొద్దిరోజుల్లోనే అతని ధైర్యానికి ఆధారం లేదని తేలింది. ఒకరోజు సాయంత్రం హెడ్ మాష్టారు నన్ను పిలిపించి బదిలీ ఉత్తర్వు అందజేశారు. మరీ మారుమూల ఊరుకి కాదుకానీ ఈ నగరంకన్న చిన్నపట్టణానికి బదిలీ అయింది. మొదట్లో నేను కొంచెం కృంగిపోయాను. దారిలో ఆలోచించుకుంటూ ఇంటికి చేరేసరికి నా దిగులుపోయింది. చిన్న పట్టణం కాబట్టి పరిసరాలు, పరిస్థితులూ ఇక్కడకన్నా మెరుగుగా ఉండవచ్చు. ముఖ్యంగా ప్రకృతికి మరింత సన్నిహితంగా ఉండాలన్న నా కోరిక తీరుతుంది. కొత్త మొహాలెన్నో చూడవచ్చు, కొత్త అనుభవాలు చవిచూడవచ్చు, సుబ్రహ్మణ్యంలాంటివాళ్లు అక్కడా దొరకవచ్చు.

అంతలో నేను వెళ్ళిపోతే సుబ్రహ్మణ్యం బాధపడతాడని జ్ఞాపకం వచ్చింది. కాని చేయగలిగిందేముంది? ఒకవిధంగా చూస్తే అది మంచిపరిణామమే అనిపించింది. ఎందుకంటే అతను తరుచు నాకేసి చూస్తున్నాడు. అది ఒక బలహీనతగా ఉండిపోతుంది. నేను లేకపోతే తనే అంతా ఆలోచించుకొని మరింత ఎదగవచ్చు. ఇప్పటికే అతను నాకన్నా బాగా ముందుకుపోయాడు. గాంధీగారి విషయం నాకు జ్ఞాపకం వచ్చింది. గాంధీగారి ముందు నాయకులు తిలక్, గోఖలే, సురేంద్రనాథ్ బెనర్జీ వంటివారితో పోలిస్తే వారికున్న పాండిత్యం, ప్రతిభా ఈయనకు లేవు. కాని తనలోని అసాధరణ వ్యక్తిత్వం కారణంగా ఈయన జాతిపిత అయ్యాడు. పోలిక సముచితం కాదుకాని సుబ్రహ్మణ్యం నాకన్నా చాలాముందుకు సాగాడన్నదానిలో సందేహం లేదు. అటువంటి వ్యక్తికి ప్రేరణ ఇచ్చినందుకు నాకు గర్వంగా, సంతోషంగా ఉంది. నామనస్సు మరో ఊరికి ప్రయాణానికి సుముఖమైంది.

సుబ్రహ్మణ్యానికి ఈ వార్త ఇంకా తెలియదు కదా. అతను మా యింటికి వచ్చిన తరువాత చెప్పేకంటే నేనే అతని ఇంటికి వెళ్ళి విషయం చెప్పి రావడం ఉదాత్తచర్యగా ఉంటుందని భావించి అతని ఇంటికి వెళ్ళాను. సుబ్రహ్మణ్యం, భార్య ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నారు. పిల్లలు కూడా దగ్గరలోనే కూర్చొని తల్లిదండ్రులకేసి ఆసక్తిగా చూస్తున్నారు. నన్ను చూడగానే సుబ్రహ్మణ్యం ఎంతో సంతోషంతో లేచి... "రండి మాష్టారూ- సరిగ్గా సమయానికి వచ్చారు. నేనే మీ దగ్గరికి వద్దామనుకుంటున్నాను





మీరే వచ్చారు- ఆపద్బాంధవుడిలా'' అని నన్ను కొత్తగా కొన్న సోఫాకమ్ బెడ్ మీద కూర్చోబెట్టాడు. సుబ్రహ్మణ్యం ఇంట్లో అప్పుడే కొద్దిపాటి సంపద చిహ్నాలు దర్శనమివ్వసాగాయి. నాకు సంతోషమే కలిగింది. నేనడిగాను అతనిని ''ఏమైనా తీవ్ర సమస్యా?'' అని.

''తీవ్రమనుకుంటే తీవ్రమే. కాని అసలు సమస్యా అని''- నాకు అంతా వివరించాడు.

అతని వ్యాపారానికి గట్టిపోటీ బయలుదేరింది. మరింత పెద్దపెట్టుబడితో ప్రారంభించిన కంపెనీవారు ఇంటింటికీ ప్రచారకుల్ని పంపించి, పది గ్రాముల కాఫీపొడి పాకెట్లు ఊరికే పంచిపెట్టించి, ప్రతి అరకిలో కాఫీపొడి పాకెట్టుతో పెద్దసైజు స్టీలు చెంచా ఇస్తామనీ, కిలో పాకెటులో ఒక స్టీలుగ్లాసు ఇస్తామనీ కరపత్రాలు పంచుతున్నారట. వారితో పోటీపడితే అది ఎక్కడికి దారితీస్తుందో తెలియద్దు. తను కూడా ఎరలు చూపిస్తూ బహుమతులిస్తూ పీకలుత్తరించుకునే పోటీకి నిలబడలేడు. తన ఆర్థిక పరిస్థితి అందుకనుమతించదు. అయినా జాతీయస్థాయి పెద్ద సంస్థలు కూడా ఇంటింటికీ ప్రచారకుల్ని పంపించి, బహుమతుల ఎరచూపడం మొదలుపెడితే సుబ్రహ్మణ్యానికి విషమపరిస్థితే ఎదురవుతుందన్నమాట. చివరివరకూ పోటీకి నిలబడే తాహతూలేదు, ఇటు పోటీలో వెనకబడితే తన వ్యాపారమే దెబ్బతిని బ్యాంకు ఋణం తీర్చడంలో అవస్థలుపడి అన్నీ అమ్ముకొని రోడ్డు మీద పడవలసివస్తుంది. అంటే అడకత్తెరలో పోకచుక్క చందమైందన్నమాట సుబ్రహ్మణ్యం పరిస్థితి.

ఇంతకీ ఇది చీకటిపక్షమే. అటు ఒక సువర్ణావకాశంలాంటిది అతనిని ఆకర్షిస్తోంది. అదేమంటే కొత్తగా పెద్దపెట్టుబడితో పెట్టిన పోటీ కంపెనీనుంచే అతనికి ఒక ప్రతిపాదన వచ్చింది. ఆ కంపెనీ కాఫీ పొడేగాక, 'రెడీ

మేడ్' మసాలదినుసులూ, 'రెడీమేడ్' ఆహార పదార్థాల వ్యాపారం కూడా చేబట్టుదామని నిర్ణయించింది. ఆ కంపెనీ సుబ్రహ్మణ్యాంను తనతో కలిసిపొమ్మని ఆహ్వానించింది. అతని అప్పులూ, బాధ్యతలూ అన్నిటినీ భరించి, అతని సంస్థకు ఉన్న మంచిపేరు (గుడ్‌విల్)కుగాను పదివేల రూపాయలు చెల్లిస్తాననీ, అతనికి తన సంస్థలో ఉత్పాదన పర్యవేక్షకుడుగా నెలకు రెండువేల అయిదువందల రూపాయల జీతంమీద నియమిస్తాననీ, ఏడాది తరువాత పరిస్థితుల్నిబట్టి- వీలైతే ఈలోగా కూడా పరస్పర సంప్రదింపులమీద జీతభత్యాలు పెంచవచ్చుననీ, ఏడాదిపాటు ఉద్యోగం హామీ ఇస్తామనీ చెప్పింది. ముందు ముందు కంపెనీ పురోగతినిబట్టీ, అతని పనితీరునిబట్టీ కంపెనీలో ఒక చిన్నవాటా కూడా ఇవ్వడానికి ప్రయత్నిస్తామని కూడా చెప్పింది.

"ఏ విధంగా చూసినా ప్రతిపాదన ఆకర్షణీయంగా తోస్తోంది. మీకింకా ఏమైనా సందేహాలున్నాయా?" అని అడిగాను నేను.

"ఏమీలేవులెండి. బహుశా సంప్రదింపుల మీద మరికొన్ని సదుపాయాలు కూడా పొందవచ్చు. అటు మా ప్రతిపాదన అంగీకరించకపోతే పోటీ ఏ స్థాయికైనా తీసుకుపోయి నన్ను పూర్తిగా దెబ్బతీస్తామన్న నిగూఢపు బెదిరింపు కూడా ఉంది" అన్నాడు సుబ్రహ్మణ్యాం.

"భారీపెట్టుబడీ, వనరులూ ఉన్న సంస్థతో పోటీకి దిగితే ఏమవుతుందో మీరే చెప్పారు. దానిని బెదరింపుగా ఎందుకు భావించాలి? అది వాస్తవమందాం. అది పక్కకుపెడితే ప్రతిపాదనలో ఆక్షేపణీయమైనదేమీ తోచడంలేదు నాకు" అన్నాను నేను.

"అదే చెప్పండి అన్నగారూ... సిరిరా మోకాలడ్డేవాళ్లెవరైనా ఉంటారా? ఇంతకుముందు రెక్కలు ముక్కలు చేసుకున్నా నెలకు వెయ్యి రూపాయలు కూడా కళ్లచూడలేకపోయేవాళ్లం. ఇప్పుడైనా బాంకురుణం తీసుకొని వ్యాపారం పెంచిన తరువాత కూడా నెలకు పదిహేను వందలకు మించి మిగలడంలేదు. అటువంటప్పుడు మనల్ని నాశనం చేయగలవాళ్లు తామే మంచి ప్రతిపాదనచేస్తే ఈ మీనమేషాలు లెక్కపెట్టడమేమిటండీ" అంది సుబ్రహ్మణ్యాం భార్య మధ్యలో కలగజేసుకుంటూ.

"మీ అభ్యంతరమేమిటో నాకర్థంగావడంలేదు సుబ్రహ్మణ్యాంగారూ" అన్నాను నేను.

"ఒకటి నా స్వాతంత్ర్యం హరించిపోతుందండీ. రెండవది క్రమంగా నేను పూర్తిగా వ్యాపారదృక్పథంలోనే పడిపోతానని పిస్తోందండీ" అన్నాడు సుబ్రహ్మణ్యాం.

"మాకు ఎలాగైనా ఒక చిన్నవాటా ఇవ్వాలన్న తలంపు ఉందన్నారు కదా ఈ పదివేలకు బదులు ఆ వాటాయే మరికొంత పెంచమని కోరవచ్చు. అప్పుడు మీరే ఆ సంస్థలో ఒక భాగస్వాములవుతారు. స్వాతంత్ర్యం పోయిందన్న బాధ ఉండదు. ఇక దృక్పథమంటారా- మీరు చదువుకున్నవారూ, ఆలోచించగలవారూ, మీ జీవితాన్ని మీరు ఎప్పుడూ తీర్చిదిద్దుకోగలరనే నా నమ్మకం" అన్నాను నేను.

"సంతోషం మాష్టారూ- మీనుంచి ఇంత సమర్థన వచ్చిన తరువాత నేను వెనక్కి చూడవలసిన పనిలేదు. త్వరలోనే ఒక నిర్ణయం తీసుకుంటాను" అన్నాడు సుబ్రహ్మణ్యాం.

తర్వాత నేను ప్రశ్నించగా దుర్గ మూడో అన్న కేసు విషయంలో అన్ని ఏర్పాట్లుచేశామనీ, ఇక అంతా న్యాయస్థానంమీద ఆధారపడి ఉందనీ, అయినా నేరస్తుడికి పెద్ద శిక్షపడదన్న ఆశ కలుగుతోందనీ చెప్పాడు.

అప్పుడు నేను వాళ్లకి తెలియజేశాను నా బదిలీవార్త.

అందరూ దిగ్భ్రాంతి చెందినట్లయ్యారు. సుబ్రహ్మణ్యాం "ఇది అన్యాయం మాష్టారూ... మన ప్రత్యర్థులు మనమీద పగ ఇంకా మానలేదన్నమాట . ఇది మీమీద దెబ్బేకాదు- నామీద కూడా దెబ్బ మాష్టారూ! మనం దీనిని ప్రతిఘటించాలి గట్టిగా పోరాడదాం. అవసరమైతే నేను ఉద్యమం కూడా నడిపిస్తాను" అన్నాడు.

నేను అతనిని వారించాను. నేనే బదిలీని ఆహ్వానిస్తున్నానని చెప్పి, ఎందుకో విశదీకరించాను. "మనం దూరంలోఉన్నా దూరమైపోయినట్లు కాదుగా, ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుకుంటూనే ఉందాం. ఏ మూడునెలలకో, ఆరునెలలకో మనం కలుసుకుందాం కూడా. ఒకసారి నేనిక్కడికి రావచ్చు ఒకసారి మీరు ఆ ఊరు





రావచ్చు'' అన్నాను.

అతను శాంతించాడు. ''అయినా మీరు దగ్గరలేనిలోటు నాకెప్పుడూ ఉంటుంది మాష్టారూ'' అన్నాడు.

ఇంతలో గుమ్మంలో ఎవరో జనం కనిపించారు. సుబ్రహ్మణ్యం అది గుర్తించి వాళ్లని లోపలికి పిలిచాడు. ఒక అమ్మాయి, ఐదారుగురు మగవాళ్లూ ఉన్నారు. ఆ అమ్మాయే దుర్గ అయివుంటుందనుకున్నాను. సుబ్రహ్మణ్యం అది ఋఢీచేసి ఆమెకు నన్ను పరిచయం చేశాడు. ఆమె ఎంతో వినయంగా నమస్కరించి ''సుబ్రహ్మణ్యంగారు మిమ్మల్ని గురించి ఎప్పుడూ చెపుతూ ఉంటారండీ. మీరే తనకి గురువంటూ ఉంటారండి. కాని మీపేరు నలుగురితో చెప్పవద్దన్నారండీ. అందువల్లే నేను కూడా ఇంతవరకూ మీ పరిచయం చేసుకోలేకపోయానండి'' అంది.

''నీ తొలిపరిచయమే వీడ్కోలు కూడా అవుతోందని చెప్పాలమ్మా. మాష్టారు ఇక్కడనుంచి బదిలీ అయ్యారు. అది చెప్పడానికి వచ్చారు'' అని చెప్పాడు సుబ్రహ్మణ్యం.

''అయ్యో... అదేమిటి?'' అంది దుర్గ. నేనే ఆమెకు బదిలీని ఎందుకు ఆహ్వానించానో చెప్పాను.

తరువాత సుబ్రహ్మణ్యం వాళ్లంతా ఎందుకు వచ్చిందీ తెలుసుకోగోరాడు.

''వీళ్లని మీరెరుగుదురు, సుబ్రహ్మణ్యంగారూ. మన ఉద్యమంలో మనతోబాటు కూర్చొని మనని కాపలాకాసేవారు. వీరికొకపెద్ద సమస్య వచ్చిపడింది. అందుకే మీదగ్గరికి తీసుకువచ్చాను'' అని చెప్పింది దుర్గ.

సమస్య ఏమిటో చెప్పమనగా ఆ వచ్చినవ్యక్తుల్లో ఒకతను వారి అందరి తరపునా మాట్లాడాడు.

''అయ్యా... మా ప్రాణాలకు ముప్పొచ్చిపడిందయ్యా. ఏదో ఒకపూట తినీ, ఒకపూట తినకా తలదాచుకుందుకైనా కాస్తకొంప ఉంది కదా అని మా పిల్లామేకాతో మా బతుకులేవో గడుపుకుంటున్నాం. ఇప్పుడు హఠాత్తుగా మమ్మల్ని లేవగొట్టి ఊరవతలికెక్కడికో ఇసిరి పారేస్తామంటున్నారు. మేముఏమైపోవాలి? మా బతుకులేమైపోవాలి? మా పెళ్లాం బిడ్డలూ ఏమైపోవాలి?'' అని ఉద్వేగంతో అన్నాడతను.

సుబ్రహ్మణ్యం అతనిని ఓదార్చి విషయం మెల్లగా చెప్పమన్నాడు. విషయం ఇదని తెలిసింది: ప్రభుత్వామోదంతో మునిసిపాలిటీ వీళ్లు నివసించేచోట కెదురుగా కాలవమీద వంతెనకట్టి ఇవతల ఒక పెద్దరోడ్డును కలుపుతూ వీళ్ల ఇళ్లమధ్య నుంచే రోడ్డు వేయబోతోందట. వీళ్లని ఇళ్లు ఖాళీచేయమని నోటీసు ఇచ్చిందట. ప్రభుత్వం నిర్ణయించిన రేటున పరిహారమిస్తామని వాగ్దానం చేసిందట. ఇళ్లు తిరిగి కట్టుకోదలచినవారికి నగరం పొలిమేరల్లో కొంత స్థలం ఇస్తానందట. ఒకటి- పరిహారమూ న్యాయంగా ఉండదు. పూర్తిగా ఎప్పటికి అందుతుందో, మధ్యలో ఎందరి చేతులు తడపవలసి వస్తుందో తెలియదు. రెండవది- ఊరి బయటికిపోతే వారెన్నో ఇబ్బందులకు గురి అయి వారి జీవితాలే అస్తవ్యస్తమయిపోతాయి. వాళ్ల అసలు ఫిర్యాదు అదేకాదు. నిజానికి వంతెనకూ రోడ్డుకూ మిక్కిలి అనువైన ప్రదేశం తమ పేటలో కాకుండా ఒక నూట ఏభైగజాల దూరంలో ఉందట. అక్కడ వంతెనా, రోడ్డూ నిర్మిస్తే అటుకాలవ అవతలి రోడ్డుకూ దగ్గరగానే ఉంటుంది, ఇటువైపుకూడా రోడ్డు కొద్దిదూరంలోనే ప్రధానమైన రాజవీధిని వీలైనచోట కలుస్తుంది. ఈ పేదవారి పేటలోనుంచి రోడ్డు వెళ్లేటట్లయితే అది కొంత ఎక్కువ దూరంపోవాలి. కొంత తిరుగుడూ ఉంటుంది. మరి అనువైనస్థలం ఎందుకు కాదన్నారంటే అక్కడ ఒక పెద్దవ్యాపారభవన సముదాయం కట్టేప్రతిపాదన ఉందట. అక్కడ రోడ్డు నిర్మిస్తే కోట్లమీది ప్రాజెక్టు దెబ్బతింటుందట. అందువలన ఆ ప్రాజెక్టువారు ఉన్నతస్థాయిలో ప్రయత్నంచేసి ఆదిలో ఉన్న పథకాన్ని మార్చుచేయించారు. అంతా గుట్టుగా జరిగిపోయింది. ఇప్పుడీ పేదలకు ప్రమాదం విరుచుకుపడబోతోందని తెలిసినా ఏమి చేయాలో తెలియక తల్లడిల్లిపోతున్నాను.

సుబ్రహ్మణ్యం అన్నాడు- ''ఇందులో కొంత కోర్టు వ్యవహారం, కొంత రాజకీయం ఉన్నాయి. కోర్టు వ్యవహారంలో కూడా అవతలివారు బలసంపన్నులు, వారితో మీరు సరితూగలేరు. అయినా న్యాయానికి ఏమాత్రం విలువ ఉన్నా



మనం బొత్తిగా ఆశవదులుకోనక్కరలేదు. నేను మిమ్మల్ని ఒక రిద్దరు ప్లీడర్లకు పరిచయం చేస్తాను. వారు మంచివారు. చేయగలిగిందంతా చేస్తారు. కాని కేవలం కోర్టులమీద ఆధారపడితేనే సరిపోదు. రాజకీయంగా కూడా గట్టిప్రయత్నం జరగాలి. మీరు కలిసికట్టుగా ఉండి నాయకులమీదా, ప్రభుత్వంమీదా ఒత్తిడి తేవాలి. మీరు ముందు ప్రభుత్వంలోనూ, మునిసిపాలిటీలోనూ పలుకుబడిగల నాయకుల్ని కలుసుకొని వేడుకోలేకపోయారా?'' అన్నాడు సుబ్రహ్మణ్యం.

''ఆరే ఈ ప్రయత్నం ఎనకాల ఉంటే వారు మాకేం చేస్తారయ్యా? మమ్మల్ని తినాలని చూసే పెద్దపులిని కనికరించమంటే కనికరిస్తుందా అయ్యా'' అన్నాడు వచ్చినవారి ప్రతినిధి.

''అయితే ఇతర నాయకులున్నారుగదా. గట్టి అల్లరిచేసినా ప్రభుత్వం కొంచెం వెనకాడవచ్చు''

''ఇదివరకొకసారి అట్టాచేసి చేతులు కాల్చుకున్నాంకదయ్యా. రామగోపాల్ చనిపోతే ఈరావేశంలో ఆళ్లఎనకబడిపోయాం. ఏమైందో మీరే చూశారుగదా. జరిగిందేదో మీవల్లే జరిగింది. అందువల్ల మీరు తప్పమాకు మరోరులేరు. మీరేమాకు దారిచూపాలి. మా బతుకులు కాపాడాలి. మా పెళ్లాం పిల్లలతో మీకు రుణపడి ఉంటామయ్యా'' అని దీనంగావేడారు వాళ్లు.

సుబ్రహ్మణ్యం కొంతసేపు దీర్ఘంగా ఆలోచించి- ''నాకొక్క రెండురోజులు టైమివ్వండి. అటుపెద్దపెద్దవాళ్లున్నారనిమీరే అంటున్నారు కదా. అందువల్ల ఎంతో జాగ్రతగా వ్యవహరించాలి. నేనాలోచించుకొని చెవుతాను నావల్ల ఏమైనా అవుతుందేమో'' అన్నారు.

''అట్టాకాదయ్యగారూ... మీరే మాకుదిక్కు'' అంటూ బతిమాలసాగారు వాళ్లు.

''రెండురోజుల్లో చెపుతానన్నానుగదా. ఇప్పుడు వెళ్లండి. నేను నాలుగు చోట్లా విచారించి తెలుసుకొని, మీదగ్గరికే వచ్చి మాట్లాడతాను'' అని వాళ్లను ఎలాగో పంపేశాడు సుబ్రహ్మణ్యం.

తరువాత నావైపు తిరిగి పెద్దగా నిట్టూరుస్తూ అన్నాడు- ''మాష్టారూ... ఇప్పుడే మేము తియ్యటికలలు కంటున్నాం. ఇంతలోనే విషమపరీక్ష ఎదురైంది. వీళ్లు పేదవారూ, నిస్సహాయులూ, అమాయకులూ, ఎవరో ఒకరు దారి చూపిస్తేకాని ప్రమాదంలో నుంచి బయటపడలేరు. వీళ్లు నన్ను నమ్మినవాళ్లు. కాని ఈ బాధ్యత ఎత్తుకుంటే అటు రాకరాక వచ్చిన స్వర్ణావకాశం చేతులారా విడుచుకోవాలి. నాకే దారీ తెలియడంలేదు మాష్టారూ''

అతని భార్య కోపంగా అంది ''లోకం గొడ్డుపోయిందా? ఈయనొక్కరే నాయకులా అన్నగారూ? ప్రతిదానికీ ఈయనే కావాలా? మేము సుఖంగా బతకాలనుకోవడం కూడా తప్పా? మేము ఇలా నగం దరిద్రంతో ఉండిపోవలసిందేనా?''

సుబ్రహ్మణ్యం భార్యకేసి బాధగా చూశాడు.

నేను ఆమెను శాంతింపజేశాను- ''మీరు కోపం తెచ్చుకోకండి. మీవారెలాంటి వారో మీకు తెలుసుకదా. ఆయనని కొంచెం ఆలోచించుకోనివ్వండి'' అని చెప్పి ''సుబ్రహ్మణ్యంగారూ... ఒకసారి మీరు నాకు చెప్పారు గదా. చేతులారా జీవితాన్ని కష్టాల్లోపడేసుకోవద్దని. మీరు కూడా అది గుర్తుపెట్టుకొని ఆ అవకాశం వదులుకోనక్కర్లేకుండా, ఇటు వీరికి తగిన సాయంచేయవచ్చునేమో ప్రయత్నం చేయండి'' అన్నాను.

''అలాగే మాస్టారూ మీరు వెళ్ళేలోగా మీ యింటికి వస్తానుగా. నా నిర్ణయమేమిటో చెవుతాను'' అన్నాడు సుబ్రహ్మణ్యం.

నేను అందరిదగ్గరా సెలవుతీసుకొని ఇంటికి వచ్చేశాను.

కాని సుబ్రహ్మణ్యానికి సులభమార్గం లేదని మర్నాడే నాకు తెలిసింది. ఆ పెద్ద ప్రాజెక్టులో సుబ్రహ్మణ్యానికి ప్రతిపాదన చేసిన కంపెనీవాళ్లు కూడా భాగస్వాములే. అంటే అతను ఇటు ఈ పేదల్ని వాళ్లగతికే వదిలెయ్యాలి లేక వచ్చిన మంచి అవకాశమైనా వదులుకోవాలి మధ్యేమార్గంలేదు.

సుబ్రహ్మణ్యం వస్తానన్నాడు కాని వెంటనే రాలేదు. నేను మా సామాను సర్దుకొని లారీ కంపెనీకి అందజేసి వచ్చాను. ప్రయాణానికి సిద్ధమయ్యాం. ఒక గంటముందు సుబ్రహ్మణ్యం భార్య వచ్చింది కాని అతను రాలేదు. మేము బయలుదేరుతూంటే వచ్చాడు. కూడా





దుర్గ ఉంది. "క్షమించండి మాష్టారూ... ప్లీడర్ల దగ్గర ఎక్కువ సమయం పట్టింది. అందువల్ల ఆలస్యమయింది. మీరెక్కడ దాటిపోతారో అని కంగారుగా పరుగెత్తుకు వచ్చాను." అన్నాడు సుబ్రహ్మణ్యం.

"ఫరవాలేదండి. వెళ్లేలోగా కనిపించారు కదా. అదే సంతోషం. ఏమమ్మా... నువ్వు కూడా వచ్చావేమిటి?" అన్నాను నేను దుర్గవైపు తిరిగి.

"చివరిసారి మీ ఆశీర్వాదం తీసుకుందామనండి" అంది ఆమె.

టైమవుతోందని అందరం బస్సుస్టాండుకి రిక్షాల్లో బయలుదేరాం. బస్సు ఇంకారాలేదు. సుబ్రహ్మణ్యం ఏమి నిర్ణయం తీసుకున్నాడో తెలుసుకోవాలని నాకెంతో కుతూహలంగా ఉంది. కాని అతన్ని బలవంతాన ముందుకు తోయదలచలేదు. కాని ప్రజాసేవ కూడా ఒక వ్యసనంలాంటిదనిపిస్తుంది. ఒకసారి అందులోకి దిగినవాడు త్వరగా బయటపడలేడు. ప్రజలూ అతనిని విడిచిపెట్టరు.

అతనే అన్నాడు... "మాష్టారూ ఆ కంపెనీ వాళ్ల ప్రతిపాదనని తిరస్కరించానండి. పోటీవల్ల వచ్చే పరిణామాలకు సిద్ధంగానే ఉన్నాను. ధర్మం నాపక్షాన ఉంటే నేను నాకాళ్లమీద నిలబడి ఉండగలననే అనుకుంటున్నాను. ఈ పేదలకు నిజంగానే అన్యాయం జరుగుతోందండి. అవతలివాళ్లు పెద్ద నష్టంలేకుండా తమ ప్రాజెక్టును మరొకవిధంగా మార్చుకోవచ్చు. కాని వారు కొంచెమైనా త్యాగానికి సిద్ధపడకుండా ఈ పేదల్ని బలిచేయబోతున్నారు. వాళ్లు చాలా బలవంతులని నాకు తెలుసు. వాళ్లతో నాకు ప్రతిపాదనచేసిన కంపెనీవాళ్ళు కూడా ఉన్నారు. అయినా నన్నునమ్మిన ఈ పేదల్ని వాళ్లగతికి వదిలివేయలేకపోతున్నాను. మంచి అవకాశం పోగొట్టుకున్నందుకు మా శ్రీమతికి కోపంగా ఉందనుకొండి. కాని నేను నా కుటుంబానికి అన్యాయంచేయనని ఆమెకు నచ్చజెప్పగలననే నమ్మకం నాకుంది. కాని నా అంతరాత్మకి మాత్రం మరోవిధంగా నచ్చజెప్పలేను. అందుకే ఈ నిర్ణయం మాష్టారూ."

ఆ నిర్ణయంయొక్క పర్యవసానాలు ఎలా ఉండగలవో గుర్తించానుకాబట్టి నేను ఒక నిమిషం మాట్లాడలేకపోయాను. తరువాత "మీ నిజాయితీ, పట్టుదలయే మిమ్మల్ని కాపాడతాయి సుబ్రహ్మణ్యంగారూ" అని అయన్ని అభినందించాను.

సుబ్రహ్మణ్యం ఇంకా అన్నాడు- "మాష్టారూ... నేను ఇన్నాళ్లూ చేస్తున్న ఒక పొరబాటు తెలుసుకొని సరిదిద్దుకున్నానండి. మనం సాధారణంగా మగవాళ్లదృష్టితోనే ఆలోచిస్తాం. మగవాళ్లే ఏమైనా చేయవలసింది, ఏ ఉద్యమమైనా చేపట్టవలసిందిగా మాట్లాడతాం. నేనొకరోజున మీతో యువకులెవరూ నాకు తోడురావడంలేదని నిరాశ వెలిబుచ్చాను గుర్తుందా మాష్టారూ?- నేను యువతులమాట ఎత్తలేదు చూశారా? ఇది ఎందుకు చెబుతున్నానంటే ఇప్పుడు ఈ అమ్మాయి, దుర్గే నాకు తోడుగా నిలబడుతోందండి. నేనేలక్షణాలు ఆశించానో అవి అన్నీ ఈమెలో ఉన్నాయి. తన పెద్దన్న అన్యాయపు చావూ, మూడో అన్న అవస్థా, తల్లిదండ్రుల దీనస్థితీ ఈమెలో న్యాయంకోసం, ధర్మంకోసం దృఢమయిన దీక్ష కలిగించాయి. తన స్నేహితురాళ్లలో కూడా అదేదీక్ష రేకెత్తించడానికి పూనుకుంటోంది. ఇప్పుడు నేను ఒంటరివాడిని కాను మాష్టారూ"

"చాలా సంతోషమండీ. ఏమమ్మా దుర్గా... సుబ్రహ్మణ్యంగారిలా నువ్వు కూడా గొప్ప స్ఫూర్తి కేంద్రం కావాలి" అన్నాను నేను.

"ఇదే మీ ఆశీర్వాదంగా భావిస్తానండీ" అని చిరునవ్వుతో నమస్కరించిందామె.

ఇంతలో బస్సువచ్చింది. సామానుపెట్టుకొని మేము ఎక్కి కూర్చున్నాం.

నేను శ్యామల జీవితాన్ని నాశనంచేసిన నరసింహులుకుకానీ, అతని సమర్థకులకికానీ తగిన శిక్షపడేటట్లు చేయలేకపోయాను. కాని శ్యామల విషాదగాథే నన్నెంతో కదిలించి ప్రేరేపించింది. ఆ ప్రేరేపణతో నేను సుబ్రహ్మణ్యంరూపంలో ఒక దీపంవెలిగించాను. ఆ దీపం దుర్గరూపంలో మరోదీపం వెలిగించింది.

ఒక దీపం వెలిగితే ఫలితం వ్యర్థంకాదని నా నమ్మకం. ఈ పరిణామం ఇలాసాగుతూ ఉండగలదనే ఆశతో, సంతోషంతో సుబ్రహ్మణ్యం, దుర్గల దగ్గర సెలవుతీసుకున్నాను.

★ ★ ★

శేఖరం మాష్టారు శ్యామల విషాదగాథ తనని కదిలించివేస్తే తాను సుబ్రహ్మణ్యం రూపంలో ఒక చిరుదీపాన్ని వెలిగించాననుకున్నారు. ఆ చిరుదీపం మరో చిరుదీపాన్ని దుర్గరూపంలో వెలిగించింది. ఇలా ఈ ప్రక్రియ కొనసాగి విస్తరించి వెలుగు నల్దెసలా ప్రసరిస్తే అన్యాయపు చీకటి తొలగిపోతుందని ఆయన ఆశించారు. ఆ ఆశతోనే సంతోషంగా బదిలీ అయిన ఊరికి ప్రయాణం కట్టారు.

ఆయనకు మాట ఇచ్చినట్లు సుబ్రహ్మణ్యం పదిరోజులకొకసారి తన కార్యకలాపాల గురించి తెలియజేస్తూనే ఉన్నాడు. విజ్ఞప్తులు తయారు చేయడం, సంబంధిత అధికార్లకూ, రాజకీయ నాయకులకూ సమర్పించడం, సభలు నిర్వహించడం, శాంతియుతమైన మౌన ప్రదర్శనలు చేయడం, పత్రికలకు రాయడం, చివరికి కోర్టుకు పోవడం వగైరా విశేషాలన్నీ తెలియబరిచాడు.

కాని కొన్నాళ్ళకు ఉన్నట్టుండి సుబ్రహ్మణ్యం నుంచి ఉత్తరాలు రావడం మానివేశాయి. శేఖరం మాష్టారుకి ఆశ్చర్యం వేసింది. పదిరోజులు చూసి తనే ఉత్తరం రాశారు. అయినా జవాబు లేదు. మళ్లీ రాశారు. అయినా జవాబు లేదు.

ఈలోగా శేఖరం మాష్టారు మళ్లీ అన్యాయానికి గురిఅయ్యారు. ఆ ఊరినుంచి కూడా ఆయనకు బదిలీ అయింది.

సంక్రాంతి సెలవులు వచ్చినప్పుడు భార్యని పుట్టింటికి పంపివేసి సుబ్రహ్మణ్యాన్ని కలుసుకోవడానికి పాత ఊరు వెళ్లారు.

సుబ్రహ్మణ్యం ఇంటికి వెళ్లగా తెలిసిన వార్త విని ఆయన అవాక్కయి పోయారు.

నెలరోజుల నుంచీ సుబ్రహ్మణ్యం జెయిలులో ఉన్నాడట. కొట్లాటల్లో పాల్గొన్నాడని కేసు పెట్టి మూడు నెలలు కారాగార శిక్ష విధించారని చెప్పింది సుబ్రహ్మణ్యం భార్య సుమతి. శేఖరం మాష్టారు సుమతినీ, పిల్లలనీ ఓదార్చి తను కొన్నాళ్లు ఆ ఊళ్లోనే ఉంటాననీ, వారికి చేతనైనవిధంగా సాయం చేస్తాననీ ధైర్యం చెప్పి జెయిలులో సుబ్రహ్మణ్యాన్ని కలుసుకోవడానికి ప్రయత్నాలు మొదలుపెట్టారు.

చివరికి అనుమతి లభించింది. మొదట్లో తనని విడిపించడంలో సుబ్రహ్మణ్యానికి తోడ్పడ్డ ఆయన లాయరు స్నేహితుణ్ని తీసుకొని జైలుకు వెళ్లారు.

"మీరా మాష్టారు, నాకోసం వచ్చారా! ఎప్పుడు వచ్చారీఊరు? అక్కడ అంతా బాగానే ఉందాండీ? వదినగారు బాగున్నారా?" అని ప్రశ్నలు గుప్పించాడు సుబ్రహ్మణ్యం, మెష్ వెనుక నుంచే!

"అంతాబాగానే ఉన్నారు. కాని నాకు మళ్లీ బదిలీ అయింది సుబ్రహ్మణ్యం గారూ. మారుమూల ప్రదేశంలో ఒక పల్లెటూళ్లో వేశారు" అని చెప్పారు శేఖరం మాష్టారు.

"మాష్టారూ, మీకు మళ్లీ బదిలీయా? చూశారా, అన్యాయం ఎలా రాజ్యం చేస్తోందో! లాభంలేదు, మాష్టారూ, మనమేమీ చేయలేమండీ. నేను నిరాశలో మునిగి పోయానండీ. ఉత్సాహం ఎప్పుడో ఎగిరిపోయింది. తమమేలు కోరేవారెవరో ప్రజలకే పట్టనప్పుడు వారికోసమని మనమేమి పోరాటం జరుపుతామండీ? మనశక్తెంత?"

"అలా క్రుంగిపోకండి సుబ్రహ్మణ్యంగారూ నేనూ, మీరూలాంటి వారం కొందరం ఇంకా మిగిలే ఉన్నాం కదా. నేనంతదూరం నుంచి ఎందుకు వచ్చాను? జీవితమన్నప్పుడు గెలుపు ఓటములు ఎదుర్కోవలసి వస్తుందండీ. ధైర్యం తెచ్చుకోండి. ముందు జరిగిందేదో నాకు చెప్పండి. మనకి సమయమట్టేలేదు. అందువల్ల ముఖ్యమైన వివరాలు తెలపండి" అన్నారు శేఖరం మాష్టారు.

"మిమ్ముల్ని చూసేటప్పటికి నాప్రాణం లేచి వచ్చిందండి. ఆశ పూర్తిగా అంతరించిపోలేదనిపిస్తోందండి. జరిగింది చెబుతాను. గతంలో ఎన్ని ప్రయత్నాలు చేసినా, ఎందరిని కలుసుకొని విజ్ఞప్తులు సమర్పించినా ఫలితం లేకపోయింది. అందువల్ల చివరికి కోర్టుకి వెళ్లామని మీకు ఇదివరకే రాశాను కదా! ఇదుగో ఈయనా, మరి కొందరూ మాకు సాయం చేశారు, చేస్తూనే ఉన్నారు. మొదట్లో మేము మావాళ్లు ఇళ్లు కట్టుకున్న స్థలం స్వాధీనం చేసుకునే చర్యకు వ్యతిరేకంగా ఇంజక్షన్ తెచ్చుకున్నాం. కాని అవతల వాళ్లు దానిని రద్దు చేయించారు. చివరికి తీర్పుకూడా వాళ్ల




పక్షమే అయింది. మేము అప్పీలుకి వెళ్లాం. అక్కడా విఫలమయ్యాం. ఇక హైకోర్టుకు పోలేక ఆ ప్రయత్నం విరమించాం. తిరిగి సత్యాగ్రహం ప్రారంభించాం. పోలీసులు వచ్చి మా సత్యాగ్రహ శిబిరం తొలగించివేశారు. అయినా మేము అలాగే ఆరుబయటే కూర్చొని సత్యాగ్రహం కొనసాగించాం. రోజూ పోలీసులు రావడం, మమ్మల్ని వానుల్లో ఎక్కించి ఊరికి వెలుపల పదిమైళ్ల దూరంలో విడిచి రావడం, మేము మళ్లీ మర్నాడు వచ్చి కూర్చోవడం జరుగుతోందండి. ఈలోగా శత్రువులు-మిత్ర భేదం అవలంబించారు. ఆపేట వానుల్లోనే చీలిక తెచ్చారు.

కొందరికి చాటుగా డబ్బు ముట్టజెప్పారు! ఇళ్ల స్థలాలు, పట్టాల ఆశ చూపించారు. లొంగని వాళ్లని బెదిరింపులకో, వేధింపులకో గురిచేశారు. అక్కడ వంతెనా, రోడ్డూ రావడం వల్ల రోడ్డు పక్క వాళ్ల స్థలాల విలువలు పెరుగుతాయని నమ్మించారు. దానితో ఈ కార్యక్రమం వల్ల నష్టానికి గురికానివారు వేరైపోయారు. వారి ఇళ్ల స్థలాల విలువలు పెరిగే మాట నిజమే కాని స్థలాలు కోల్పోయే వారికి ఇప్పుడు నిర్ణయించిన రేట్ల ప్రకారమే పరిహారం చెల్లిస్తారు కదా. అది చాలా తక్కువ. ఆబాధితుల తరపున, వారి తోడ్పాటుతో మేము మా సత్యాగ్రహం కొనసాగిస్తే రాజకీయ పక్షాలవారు దౌర్జన్యకర ఉద్యమానికి రెచ్చగొట్టబోయారు. నేనెలాగో వారి ప్రయత్నాలు వమ్ము చేసి ఆప్రజల్ని శాంతియుతంగానే వ్యవహరించేటట్లు ఒప్పించాను. కాని నాప్రయత్నమంతా వృధాయే అయిందండి, మాష్టారూ! అంతా పథకం ప్రకారమే జరిగినట్టు తరువాత నాకు అర్థం అయింది. మేము రోడ్డు పక్కన ఆరుబయటే కూర్చొని సత్యాగ్రహం చేస్తూంటే పోలీసులు వచ్చారు. ఎవరో గానీ ప్లాను ప్రకారంపోలీసుల మీద దాడి చేశారు. పోలీసులు లాఠీ ఛార్జికి దిగే లోగానే రాళ్లు రువ్వడం మొదలు పెట్టారు. చివరికి కాల్పులు. ఒకరు చనిపోవడం, నలుగురు గాయపడడం జరిగింది. దానితో బస్సుల్నీ కార్లనీ, చుట్టుపక్కల కొట్లనీ అంటించివేయడం జరిగింది. నేనెంత అడ్డుపడ్డా ప్రయోజనం లేకపోయింది. పైగా ఆకొట్లాటలూ దౌర్జన్యం మాపనే అని చెప్పి నన్నూ మావాళ్లని, మరికొందరినీ అరెస్టుచేసి కేసులు పెట్టారు.

సాక్ష్యలు సృష్టించి మాకు శిక్షలు పడేటట్లు చేశారు. అలా దౌర్జన్యం జరిపిన వారు కొందరి ప్రేరేపణతోనే అలా చేశారు. మావాళ్లెవరూ ఆ చర్యల జోలికి పోలేదని నాకు స్పష్టంగా తెలును. అయినా అవతల డబ్బూ, బలమూ ఉండడంతో మేము చేయని అపరాధానికి శిక్ష అనుభవించవలసి వస్తోంది. ఇరుగో నామిత్రుడు కృష్ణమూర్తి, మరో ముగ్గురు, నలుగురు యువ లాయర్లు మా తరపున అప్పీలు చేసి క్రింది కోర్టు తీర్పుని రద్దుచేయించడానికి ప్రయత్నిస్తున్నారు. ఒకరిద్దరు సీనియర్ల సహాయం కూడా ఉంది. అయినా నాకు పెద్ద ఆశ లేదు, మాష్టారూ. పూర్వం స్వాతంత్ర్యోద్యమం సమయంలో జైలుకి వెళ్లివస్తే అదొక ఘనకార్యంగా ఉండేది. కాని మాకిది అవమానకరంగా తయారవుతోంది'' అన్నాడు సుబ్రహ్మణ్యం బాధతో.

కృష్ణమూర్తి చెప్పాడు: ''ఆశవదులుకోవద్దు. అప్పీలులో నెగ్గుతామనే మాకు తోస్తోంది. తగినంత మంది సాక్షుల్ని సేకరించాంకూడా. పోలీసుల అధికార్లలో కూడా ఒకరిద్దరి సానుభూతి మాకుంది. అందువల్ల మీరు నిరాశపడకండి''

ఇంటర్వ్యూకి సమయమైపోయిందన్నారు జైలుపోలీసులు. శేఖరం మాష్టారు లేస్తూ అడిగారు: ''మీకాఫీ వ్యాపారం ఎలా జరుగుతున్నట్లు?''

''మావాళ్లు ఎలాగో లాక్కొస్తున్నారు కాని, నేను మరికొంతకాలం ఇలాగే ఉంటే అది చిక్కుల్లో పడుతుందనే నాకు అనిపిస్తోందండీ, మీరు వెళ్లి చూస్తారుగా. అన్నట్లు మీరు ఎక్కడ బస చేశారు, మాష్టారూ?'' అని అడిగాడు సుబ్రహ్మణ్యం.

''ప్రస్తుతానికి ఒక హొటలులో మడత మంచం అద్దెకు తీసుకొని కాలక్షేపం చేస్తున్నాను'' అని చెప్పారు శేఖరం మాష్టారు.

''అయితే మాష్టారూ, మీరు మా యింట్లోనే మకాం చేయండి. మావాళ్లకేమీ ఇబ్బంది ఉండదు. పైగా వాళ్లకి ధైర్యంగా ఉంటుంది. నా వ్యాపారం విషయంలో కూడా మీరు ఏదైనా సాయం చేయడానికి అవకాశ

ముంటుంది"అని చెప్పాడు సుబ్రహ్మణ్యం.

"అలాగే నేనిక్కడ ఉన్నన్నాళ్ళూ చేయగలిగిందంతా చేస్తాను. మీరు మాత్రం ధైర్యంగా ఉండండి, అన్నట్లు ఆ అమ్మాయి దుర్గ అడ్రను చెప్పండి, ఆమెనొకసారి కలుసుకోవాలని ఉంది" దుర్గ అడ్రసు సుబ్రహ్మణ్యం చెప్పగా నోట్ చేసుకొని, పోలీసులు తొందర చేయగా శేఖరం మాష్టారు, కృష్ణమూర్తీ బయటికి నడిచారు.

దుర్గ ఇంటికి వెళ్లేసరికి ఆమె ఇంకా రాలేదని తెలిసింది.

"శేఖరం మాష్టారు వచ్చి వెళ్లారు. వీలైతే రేపు ఉదయం సుబ్రహ్మణ్యంగారి యింటి వద్ద కలుసుకోమని చెప్పండి. లేకపోతే రేపు సాయంత్రం నేను బజారులో సుబ్రహ్మణ్యంగారి షాపు దగ్గర కలుసుకుంటానని చెప్పండి" అని ఆయన వచ్చి వేయబోయారు.

అప్పుడు దుర్గ తండ్రి అన్నాడు- "అయ్యా, మీరా శేఖరం మాష్టారూ! మా అమ్మాయి మీ గురించి చాలా గొప్పగా చెప్పేదండి. మీలాంటివారు మా యింటికెందుకు వస్తారు? ఇపుడు వచ్చారు, అదే పదివేలు. కాసేపు కూర్చొని వెళ్లండి, బాబూ. మీతో కాసేపు మాటాడాలనుంది" అంటూ కుర్చీ ఒకటి పట్టుకువచ్చి వేశాడు. శేఖరం మాష్టారు అందులో కూర్చున్నారు.

"బాబుగారూ, మా యిద్దరు కొడుకులు అట్లాగైనారుకదా. రెండోవాడు బొగ్గుగనుల్లోపనిచేస్తూ తనబతుకేదో తను బతుకుతున్నాడు. మాకాసరాగా ఉన్నది దుర్గ ఒకత్తేకదా బాబుగారు. కనీసం అది ఒక ఇంటిదై సుఖంగా జీవితం గడిపితే మాకు కొంతలోకొంత సంతోషంగా ఉంటుంది బాబుగారూ. అటువంటిది ఊళ్లో వ్యవహారాలన్నీ తనకే కావాలన్నట్లు తిరుగుతుంటే ఎట్లాఉంటుంది చెప్పండయ్యా. ఆ సుబ్రహ్మణ్యంగారి మేలుమేం జన్మలోమరచిపోం. వారు మాకోసం ఎంతోచేశారు. వారి గురువుగా మీమేలుమరచిపోమండి. కాని మాకున్న ఒకే వెలుగు మా దుర్గమ్మని ఇట్టాంటి వాటిల్లో దింపకపోతే బాగుంటుందేమో బాబుగారూ, దానిని వదిలేస్తే మేం త్వరలోనే తగిన పెళ్ళికొడుకునుచూసి పెళ్ళిచేసి అత్తారింటికి పంపి మేము హాయిగా ఊపిరి తీసుకుంటాం బాబుగారూ. అప్పుడు మేము కొట్టినా తిట్టినా మా మూడోవాడిదగ్గరకేపోయిఉండి వాడితో బాటె కలోగంజోతాగుతూ మాకింక భూమ్మీద మిగిలిన రోజులు గడిపేస్తామయ్యాగారూ" అన్నాడు నరసయ్య.

శేఖరం మాష్టారు ఇరకాటంలో పడ్డారు. నరసయ్య మాటల అంతరార్థం స్పష్టమే. దుర్గను సుబ్రహ్మణ్యం కార్యకలాపాలకు దూరంగా ఉంచమని అంటే పరోక్షంగా సుబ్రహ్మణ్యంమీదా, అతనిద్వారా తనమీదాకొంత విమర్శ ఉన్నట్లేకదా.

అంతలో గుర్తుకువచ్చింది, ఏ తల్లిదండ్రులైనా తమ పిల్లలు ఇబ్బందులకూ, కష్టాలకూ దూరంగా ఉండాలనే కోరుతారని. ఆయనకి చదువూ, సంస్కారం, హోదా అన్నీ ఉన్నవారే సమాజం ఎలాపోతేనేం, తామూ తమపిల్లలూ సుఖంగాఉంటే చాలుననుకుంటే పెద్దచదువులేని పేదనర్సయ్య అలా అనుకుంటున్నాడంటే తప్పేముంది? కాని దుర్గను సుబ్రహ్మణ్యం మాటల్లోపడేసికానీ, బలవంతపెట్టికానీ సమాజసేవారంగంలో పెట్టలేదే. ఆమె అంతట ఆమే, తన ఉత్సాహంకొద్దీ ముందుకు వచ్చి పాల్గొంటుంది. అటువంటిది ఆమె సంసార పరిస్థితినిబట్టి సమాజసేవారంగంనుంచి తప్పుకొని వెనక్కివెళ్ళిపొమ్మని చెప్పవలసివస్తే రేపు సుబ్రహ్మణ్యానికి కూడా అలాగే చెప్పవలసిఉంటుంది. ఇక సమాజసేవకి మిగిలేదెవరు? అలాంటి వ్యక్తులు వేరుగా పుట్టరుకదా. ఇక ధనవంతులూ, స్థితిమంతులూనా సమాజాన్ని ఉద్ధరించడానికి పూనుకోవలసింది? ఎంత అసంబద్ధం! కాని నరసయ్యమీద కోపం తెచ్చుకోకూడదు. అతని పరిస్థితిలో అతనిని సరిగా అర్థంచేసుకోవాలనుకుని కొంచెం సందేహంతోనే ఆయన అన్నారు- "సుబ్రహ్మణ్యంగారు తనంతటతను మీ దుర్గను తనతో రమ్మనలేదనుకుంటాను. ఆమె అంతట ఆమే - " అని ఆయన అంటుండగా

"అవునండి బాబుగారూ, సుబ్రహ్మణ్యంగా





రిని ఎట్లా తప్పుపడతామండీ? వారిని అంటే మాకళ్ళుపోవూ? మేమనేది బాబుగారూ, మీరు అమ్మాయికి నచ్చజెప్పండనే! పెళ్ళి చేసుకొని మా కోరిక తీర్చమని చెప్పమనేనండి'' అన్నాడు నరసయ్య.

''మీ అమ్మాయి దుర్గ చిన్నపిల్లకాదు. అన్నీ తెలిసినదీ, చదువుకున్నదీ, ఆమెకు మేము చెప్పేకన్నా మీరే చెపితే బాగుంటుందేమో'' అని ఆయన అంటుంటేనే దుర్గ వచ్చింది.

''ఇదేమిటి మాష్టారు! ఎప్పుడు వచ్చారు ఊళ్ళోకి?'' అంది ఆమె.

''నిన్ననే వచ్చానమ్మా. సంక్రాంతి సెలవులు కదా. మిమ్మల్ని అందరినీ ఒకసారి కలుసుకొని మీరేమి చేస్తున్నారో చూసి పోదామని వచ్చానుమ్మా. ఇందాకా షాపు దగ్గరికి కూడా వెళ్ళాను. ఇంటి దగ్గర ఉంటావేమోనని వచ్చానమ్మా''

''మాయిల్లు మీకెలా తెలిసింది మాష్టారు? ఇదివరకెప్పుడూ మీరు మాయింటికి రాలేదే'' అంది దుర్గ.

''ఈవేళ జెయిలుకి వెళ్ళి సుబ్రహ్మణ్యంగారిని కలుసుకున్నానమ్మా. ఆయనే చెప్పారు. మీయిల్లు ఎలాకనుక్కోవాలో''

''సంతోషం మాష్టారూ మీరు మాయింటికి వచ్చారు. అందుకు మేమదృష్టవంతులంగా భావిస్తాను. సుబ్రహ్మణ్యంగారితో మీరు మాట్లాడారు కదా. ఆయన లేకపోవడం వలన మేము ఏమీ చేయలేని స్థితికి వచ్చేస్తున్నాం మాష్టారూ. ఆయన వ్యాపారం కూడా దెబ్బతింటోంది. దానినెలాగో అలా నిలబెట్టాలనే మా తాపత్రయమంతా'' అంది ఆమె.

''నేనూ దానిని గురించే నీతోమాట్లాడాలనుకుంటున్నానమ్మా. రేపు నువ్వు ఒకసారి అటు వస్తే అన్ని విషయాలూ మాట్లాడుకుందాం'' అన్నారు శేఖరం.

''ముందు సుబ్రహ్మణ్యంగారిని విడిపించడానికి ప్రయత్నం చేయాలి మాష్టారూ. అప్పీలులో నెగ్గుతామంటున్నారు ఆయన లాయరు స్నేహితులు. అయినా మనం ఏ మాత్రం ఏమరుపాటుగా ఉండడానికి వీలులేదు. అటు మా అన్నయ్య కేసు ఇంకా తేలలేదు మాష్టారూ. అది త్వరగా తెమిలేటట్లూ, మా అన్నయ్యకి పెద్ద శిక్షపడకుండా ఉండేటట్లు చూడాలండీ. ఆ విషయం కూడా సుబ్రహ్మణ్యంగారి స్నేహితులే చూస్తున్నారు. వారికి అన్ని విధాలాసాయపడడమే మా బాధ్యత. అన్నట్లు మాష్టారూ మీరెన్నాళ్లు ఈ ఊళ్లో ఉంటారు?'' అని అడిగింది దుర్గ.

''ఇపుడు సంక్రాంతి సెలవులు కదమ్మా. మా ఆవిడని పుట్టింట విడిచి వచ్చాను. నాలుగురోజులు ఇక్కడ ఉండి తరువాత అక్కడికి వస్తానని చెప్పాను''

''కాదు మాష్టారూ... సెలవుల్లో మీరు పూర్తిగా ఇక్కడే ఉండండి. అవసరమైతే మరి కొన్నిరోజులు కూడా సెలవు పెంచి ఇక్కడ ఉండడం మంచిది. మీరు ఉంటే ఉత్సాహంతో మేము చేయదలచుకున్నవన్నీ చేయగలుగుతాం''

ఇక్కడ తను చెప్పవలసిన సమయం వచ్చిందనుకున్నారు శేఖరం మాష్టారు. ఒకసారి నరసయ్యకేసీ, అతని భార్యకేసి చూసి దుర్గతో అన్నారు- ''ఇదుగోనమ్మా... నువ్వు మీ అన్నగారి కేసువిషయంలోకృషి చేయడం ఎంతో ఉచితం. అలాగే సుబ్రహ్మణ్యంగారి విడుదల కోసం ప్రయత్నించడం, వారి వ్యాపారం దెబ్బతినకుండా సాయపడడం కూడా మెచ్చుకోదగ్గవే. కాని ఇతర కార్యకలాపాల్లో నువ్వు అంతగా పాల్గొనకపోవడంమంచిదేమో. నువ్వు చదువుతున్నావు, ఆ చదువు మీద తగినంతధ్యానముంచి పరీక్ష పాసై పైకిరావాలి. ఇటు మీ కుటుంబ పరిస్థితి ఇలా ఉంది. అందువల్ల ముందు నీ బాధ్యత నీ తల్లిదండ్రులపట్లకదమ్మా. నేను నిన్ను నిరుత్సాహపరచడానికి ఇలా చెప్పడం లేదు. వాస్తవపరిస్థితిని దృష్టిలో పెట్టుకొని కూడా ఆలోచించమనే చెపుతున్నానమ్మా''

దుర్గ ఆయన కేసి ఆశ్చర్యంగా చూసి, తరువాత తన తల్లిదండ్రులకేసి తిరిగి తీవ్రంగా చూసింది. ఒకసారి దీర్ఘంగా గాలి పీల్చి హుంకరించింది. ''మా అమ్మా నాన్న మీతో కూడా చెప్పారన్న మాట. మా అమ్మానాన్నకి నా పెళ్లే తక్షణ సమస్య. నన్ను ఎవడికైనా కట్టిపడేసి పంపేస్తే వాళ్లు హాయిగా ఊపిరి

పిల్చుకుంటారు..అంతేకదూ? అని అడిగింది.

నరసయ్య భార్య "అదేమిటి తల్లీ, నువ్వు మా కళ్ల ఎదుట కాసేపు లేకపోతేనే గిజగిజలాడుతామే, నువ్వు దూరంగా వెళ్లిపోవాలని ఎందుకు కోరుకుంటామమ్మా" అన్నారు.

"మరి వెంటనే నా పెళ్లి చేస్తే ఏమవుతుంది? నేను దూరంగా వెళ్లక తప్పుతుందా?

మీరు సుబ్రహ్మణ్యంగారు దేవుడంటారు కదా కాని ఆయన అసలు ఎవరో మరచిపోయారా? ఇంటింటికీ తిరిగి కాఫీపొడీ వగైరాలు అమ్మి జీవితం నెట్టుకు వస్తున్న మనలాంటి ఆయనే. ఈ మాష్టారు చెప్పబట్టి బయటికి వచ్చి ఎంతో చేస్తున్నారు. ఆయన ఇవన్నీ కట్టిపెట్టి తన కుటుంబం విషయమే చూసుకుంటే మనకి సాయం చేసేవారెవరుంటారు? అమ్మా నలుగురి గురించి పట్టించుకునేవారు కొందరు ఉన్నారు కాబట్టే మనం ఈ మాత్రంగానైనా బతకగలుగుతున్నాం. అటువంటివారిలో నేను చేరితే తప్పెలా అవుతుంది? అమ్మా, నాన్న మీ దుర్గ కేవలం మీ అమ్మాయే అనుకుంటున్నారు, కాదు దుష్టుల్ని శిక్షించే నిజం దుర్గ అని చూస్తారు మీరు. అటు వంటిదానిని గొడ్లశాలలో పశువుని రాటకి కట్టినట్లు కట్టేయ బోకండి" అంది దుర్గ ఆత్మవిశ్వాసం ఆమె కళ్లలో స్పష్టంగా తొణికిసలాడుతోంది.

"బుద్ధొచ్చింది తల్లీ- ఇంకెప్పుడూ పెళ్లి మాట ఎత్తం. నీ యిష్టం వచ్చినపుడే చేసుకుందువుగాని నువ్వే మమ్మల్ని చూస్తానంటే అంతకన్న ఏమి కావాలి తల్లీ. నువ్వే మా కంటికి దీపం తల్లీ" అన్నారు వారిద్దరూ ఆనందంతో కళ్లు ఒత్తుకుంటూ.

శేఖరం మాష్టారి కళ్లు కూడా మెరిశాయి. "సెభాష్ దుర్గా నువ్వు నిజంగా విజయదుర్గవవుతావని నానమ్మకమమ్మ. నేను మొదలు పెట్టిన ప్రయత్నం విఫలం కాలేదని రుజువవుతోంది" అని మాష్టారు వెళ్లిపోయారు.

మర్నాడు పదిగంటలకల్లా దుర్గ వచ్చింది. "మాష్టారూ ముందు అవంతెనా, రోడ్డూ వేసే స్థలమూ చూసివద్దాం. తరువాత సుబ్రహ్మణ్యంగారి వ్యాపారం గురించి ఆలోచిద్దాం. అక్కడ ఏదో జరగబోతోందని జనం చెప్పుకుంటున్నారు"

"అయితే పద" అని శేఖరం మాష్టారు బయటికి నడిచారు. దుర్గ ఆటో మాట్లాడింది.

వాళ్లు వెళ్లేటప్పటికే చాలామంది జనం చుట్టూ చేరి చోద్యం చూస్తున్నారు. దుర్గ, శేఖరం మాష్టారూ ఆ జనం నుంచి చొచ్చుకొని లోపలికి వెళ్లారు. అప్పటికే పోలీసుల ఆధ్వర్యంలో సుమారు ఏభై అరవై మంది మనుషులు కత్తులు, గునపాలూ, వగైరాలు తీసుకొని ఆపేటలో సగం ఇళ్లు కూల్చివేశారు.ఆ కూలిన ఇళ్లవాళ్లు ఏడుస్తూ తమ సామాను ఒక పక్కన చేర్చుకోవడానికి ప్రయత్నిస్తున్నారు. కొందరు పోలీసుల్నీ ఆ మనుషుల్నీ తిడుతున్నారు. పోలీసులు వాళ్లని లాఠీలు చూపించి బెదిరిస్తున్నారు. కొందరు పోలీసుల చేతుల్లో తుపాకులు కూడా ఉన్నాయి, అవసరమైతే వాటిని వాడడానికి వెనుదీయబోమని తెలుపుతున్నట్లుగా కొందరు అధికార్లు ఒకవక్క నిలబడి సూచనలిస్తూ ఆజ్ఞలు జారీచేస్తున్నారు. కూలగొట్టబడ్డ ఇళ్ల వారిలో కొందరు దుర్గను గుర్తుబట్టి ఆమె దగ్గరికి పరుగెత్తుకు వచ్చి "అమ్మ, దుర్గమ్మ, చూశావా, మాకొంపలు కూలగొట్టేస్తున్నారమ్మా, మేమూ మాపిల్లలూ ఎక్కడ తలదాచుకోవాలి?" అని ఏడుస్తూ చెప్పారు.

దుర్గ వాళ్లని "అధైర్యపడకండి, ఈ విషయంలో మనమేమీ చేయలేకపోతున్నాం, వాళ్ల పని వాళ్లని చెయ్యనివ్వండి. వాళ్లకడ్డుపడకండి, దౌర్జన్యం చేస్తే అసలు చెడుతుంది, పదండి, మీకు సాయం చేస్తాను. మీసామాను, ఇంటి సామగ్రైనా ఒక పక్క జాగ్రత్తపరచుకుందురుగాని" అని ఓదార్చి, శేఖరం మాష్టారితో బాటు ముందుకు కదిలింది. చుట్టుపక్కల వాళ్ళని కూడా కేకేసి, అంతా కలిసి కూలగొట్టిన ఇళ్ల వాళ్ల సామాను, ఇంటిసామగ్రి వేరేస్థలంలో జాగ్రత్త పరచడానికి ప్రయత్నించసాగారు. కొంతసేపటికిఆ వచ్చిన మనుషులు అధికార్ల సూచనల మేరకు ఆ చివరా ఈ చివరా చెరొకటీ, మధ్య రెండు సర్వేరాళ్లు పాతి, తరువాత అక్కడక్కడ వాటిలో పాతవాటికి తాళ్లు కట్టారు. వాళ్లపని అంతా పూర్తి అయిన తరువాత అధికార్లూ, పోలీసులూ, పనిమనుషులు-వెళ్లిపోయారు.




దుర్గ ఆపేట వాసులందరినీ రమ్మని కేకే సింది. వాళ్లంతా చుట్టూ కూర్చోగా ఆమె, శేఖరం మాష్టారు మధ్యా రెండు కుర్చీల్లో కూర్చు న్నారు. దుర్గ చెప్పింది: ''ఇప్పుడు జరిగింది చూసి అంతా అయిపోయిందనుకొని బెంబేలు పడకండి. మనమెంత ప్రయత్నం చేసినా చట్టం వాళ్లవైపున ఉండడం చేత మనమేమీ చేయలేకపోయాం. ఇరుగో శేఖరం మాష్టారని, ఇదివరకు మన ఊరిలోనే ఉండేవారు. ఇప్పు డు చాలా దూరం వెళ్లిపోయారు. వీరి ప్రోత్సా హంతోనే సుబ్రహ్మణ్యంగారూ, మేమూ మీకోసం పెద్ద ప్రయత్నం చేశాం. త్వరలోనే సుబ్రహ్మ ణ్యంగారూ, మీవాళ్లూ జైలు నుంచి బయటికి వచ్చేస్తారు. ఈలోగా ఈమాష్టారుతో కలిసి మేమంతా ప్రయత్నిస్తాం. మీరు రెండు, మూ డు రోజులు ఇక్కడే మీ సామానంతా జాగ్రత్తగా పోగుబెట్టుకొని, పందిళ్లు వేసుకొనైనా ఎలాగోలా కాలక్షేపం చేయండి. ఇప్పుడు వర్షాలు రావు గనుక ఆ భయం లేదు. నష్టపోనివారు, నష్టపో యినవారికి సాయం చేయండి. రెండు మూడు రోజుల్లో మరేదైనా ఖాళీ ప్రదేశం ఉందేమో చూసి అక్కడ తాత్కాలికంగా పాకలు వేసుకోవ చ్చు. శాశ్వతంగా ఇళ్ల సమస్య తరువాత పరిష్కరిద్దాం. మీరు ధైర్యంగా ఉండండి. ఎవ రిమీదైనా ఏవిధమైన దౌర్జన్యానికైనా దిగకండి. మరి వస్తాం'' అని లేచింది.

దుర్గా, మాష్టారూ మెయిన్ రోడ్డు వైపుకి నడవ సాగారు. శేఖరం మాష్టారు అడిగారు: ''ఏమమ్మా, మీరంతా వీరికోసం చేసిన ప్రయ త్నం ఎందుకు విఫలమైంది? కోర్టుల్లో కూడా న్యాయం లభించలేదా?''

''అంతా అయిపోయినట్లు కాదండి, మాష్టా రూ. పైవారి పథకం మార్చేటట్లు చేయలేకపో యాం. అంతవరకూ మనం విఫలమైనట్లే. కోర్టు మనకేసు పూర్తిగా కొట్టి వేయలేదు. స్టే ఇవ్వడానికి నిరాకరించింది, అంతే. ఇళ్లు కోల్పో యిన వారికి నష్టపరిహారం విషయంలో ఇంకా తీర్పురాలేదు. అక్కడైనా న్యాయం జరిగేటట్టు మనం ప్రయత్నం కొనసాగించాలి. తరువాత ఇలా ఇళ్లుపోయిన వారికి శాశ్వతమైన ఇళ్ల స్థలాలకు పట్టాలు ఇప్పించే ప్రయత్నం జర గాలి. కాని ఈ విషయంలో మట్టుకు మనకన్న రాజకీయ పక్షాల వారినే ఈపేట వాళ్లు ఆశ్ర యించడం మేలేమో అనిపిస్తోంది, మాష్టా రూ'' అంది దుర్గ.

''అవునమ్మా, మనం ప్రతిపక్షాల వాళ్లం కాము కాని అధికార పక్షానికి వ్యతిరేకులంగానే కనబడతాం. అందువల్ల మనకి అధికారపక్షం నుంచి కానీ, అధికార వర్గాల నుంచి కానీ సహకారం లభించదు. ఏదోవిధంగా ఈ పేద వాళ్లకి మేలు జరగడం మన కోరిక కాబట్టి ఎవరిని పట్టుకుంటే మంచిదో సూచించి, వెన కుండి సలహాలు ఇవ్వడం మంచిది'' అన్నారు శేఖరం మాష్టారు.

ఇద్దరూ మెయిన్ రోడ్డు చేరుకున్నారు. ఆటో కోసం కేకవెయ్యబోతుంటే ఒక ఖరీదైన కారు హఠాత్తుగా వాళ్ళ పక్కకి వచ్చి ఆగింది. ఇద్ద రూ కంగారు పడి పక్కకు గెంతారు. కారు లోపలనుంచి ''హలో మాష్టారు, ఎప్పుడు వచ్చా రు ఊళ్ళోకి?'' అన్న ప్రశ్న విని శేఖరం మాష్టారు ఆశ్చర్యంతో అటుచూశారు.

''నన్ను గుర్తు పట్టలేదా మాష్టారూ, నేను సురేష్‌ని'' అని ముందు తలుపు తీసుకొని బయటకి వచ్చాడతను.

''నువ్వా! గుర్తులేకేం? అసలు మరచిపోవ డమంటూ జరగదుకదా, ఇప్పుడు రాజకీయనా యకుడివి కూడా అయ్యావు అన్నారు శేఖరం మాష్టారు వ్యంగ్యంగా చిరునవ్వు నవ్వుతూ.

''మాష్టారు గుర్తు పెట్టుకున్నారే. రండిమా ష్టారు, మీరెటు వెళ్తున్నారు? నేను దిగబెట్టి వెళ్తాను'' అన్నాడు సురేష్.

''వద్దులే! మేము ఆటోలో వెళ్తాం, మీ పని చూసుకొండి'' అన్నారు శేఖరం మాష్టారు.

''నేనేదో చేస్తానని భయపడుతున్నారా, మాష్టారూ?''

''నేను భయపడనని నీకు తెలుసుకదా''

''అందుకే మీరంటే గౌరవం మాష్టారూ. ఆనాడు నేను అహంకారంతో కళ్లు మూసుకు పోయి మిమ్మల్ని గుర్తించలేకపోయాను. ఇప్పు డు మీ గొప్పతనం గుర్తిస్తున్నాను. నా మాట నమ్మండి, మాష్టారు. గతం ఒక పీడకల అను కోండి. ఇప్పుడు నేను మీకు ఏమీ హానిచేయ ను. చేతనైతే సాయం చేస్తాను. మంచిగానే అంటున్నాను, మాష్టారు. మీతో మాట్లాడాల



నుంది, వెళ్తూ మాట్లాడుకుందాం. రండి, దయ చేసి కారులో కూర్చోండి- ప్లీజ్'' అని కారు వెనక తలుపు తెరచి పెట్టాడు అతను.

''రా అమ్మ... ఇప్పుడే అనుకున్నాం కదా, ఆ పేదల ఇళ్ల సమస్య విషయంలో ఎవరైనా రాజకీయ నాయకుల సహాయం కోరితే మంచి దేమోనని. ఈయన ఇప్పుడు అధికారపక్షపు యువజన విభాగంలో లీడర్. ఈయన వల్ల మనకి సహాయం కలగవచ్చు'' అని కారులోకి దారితీశారు మాష్టారు. ఆయననను సరించి దుర్గ కూడా కారులో కూర్చుంది. కారు ముందుకు సాగింది. శేఖరం మాష్టారు సుబ్రహ్మణ్యం ఇల్లు ఎక్కడో చెప్పారు. కారు అటే పోసాగింది.

సురేష్ అడిగాడు- ''మీకు ట్రాన్స్‌ఫర్ అయిందని నాకు తరువాత తెలిసిందండీ, అక్కడ మీకు బాగానే ఉందా?''

''బాగానే ఉంది, కాని అక్కడికి వెళ్ళిన నాలుగు నెలలకే మరొక ఏరియాలో ఒక మారు మూల గ్రామానికి బదిలీ చేశారు''.

''చాలా విచారిస్తున్నాను మాష్టారూ. మీ వంటివారు ఇటువంటి చోట ఉంటేనే నలుగురికీ మంచిది. ఇది నేను కపటబుద్ధితో అనడం లేదు. ఇలాంటివారు అరుదని నేను మెల్లగా గుర్తించాను. నేను ఇదివరకు వాడినికాను మాష్టారు''

''చాలా సంతోషం. మంచికోసం మార్పు ఎప్పుడూ హర్షణీయమే''

''ఇది వరకు నేను దుర్మార్గంగా వ్యవహరించినా మీరు ఇలా మాట్లాడడం మీ ఔన్నత్యాన్ని సూచిస్తోంది, మాష్టారు. ఈ ఊరెందుకు వచ్చారు మాష్టారు? ఎన్నాళ్ళు ఉంటారు?''

''ఇక్కడ నావల్ల స్ఫూర్తితో కార్యక్రమాలు చేపట్టిన సుబ్రహ్మణ్యంవంటివారు ఏమిచేస్తున్నారో తెలుసుకుందామని వచ్చాను. తీరావచ్చిన తరువాత అబద్దపు కేసు మీద సుబ్రహ్మణ్యాన్ని మరికొందర్ని జెయిలులో పెట్టారని తెలిసింది. మాకిప్పుడు సెలవులు కాబట్టి ఇక్కడే కొన్నాళ్ళు ఉండి సుబ్రహ్మణ్యం వగైరాల విడుదల కోసం కృషిచేద్దామనుకుంటున్నాను'' అన్నారు మాష్టారు.

సురేష్- ''అలాగా...'' అని కొద్దిక్షణాలు మౌనంగా ఉండి తరువాత మళ్లీ అన్నాడు- ''మాష్టారు, వారెవరు?''

''అన్నట్లు మిమ్మల్ని ఒకరికొకర్ని పరిచయం చేయలేదు కదా! ఈమె దుర్గ అని విద్యార్థిని. ఈమె పెద్దన్నయ్యే పోలీసులాకప్పులో మరణించినది. ఈమె మూడో అన్నగారు నాగేంద్ర హత్య కేసులో ముద్దాయిగా జెయిలులో ఉన్నాడు. రెండో అన్నగారు సింగరేణీ కాలరీస్‌లో పనిచేస్తున్నాడు. ఈమె ఈ ఊళ్లో తల్లిదండ్రులతో కలసి ఉంటోంది'' అని చెప్పారు. సురేష్‌లో ఎటువంటి ప్రతిక్రియ వస్తుందో అని ఆసక్తితో ఎదురుచూస్తూ.....

సురేష్ ఉలిక్కిపడి ఒక్కసారి వెనక్కి తిరిగి దుర్గ కేసి చూసి తిరిగి మౌనంగా కారు డ్రైవ్ చేయసాగాడు.

'అమ్మ దుర్గా, ఇతను సురేశ్ అని కంట్రాక్టరు. వరప్రసాదరావుగారి ఏకైక పుత్రుడు. ఇప్పుడు రాజకీయనాయకుడు కూడా అయ్యాడని ఇంతకు ముందే చెప్పాను కదా'' అన్నారు మాష్టారు.

''నమస్కారమండి'' అని ఒకసారి దుర్గ వైపు తిరిగి చూసి, మళ్లీ కారు నడపడంపైన దృష్టి కేంద్రీకరించాడతను.

దుర్గకి ఏమిటో అనుమానం వచ్చింది ''మాష్టారు'' అని ఆగిపోయింది.

''ఏమిటమ్మా''?

''మాష్టారూ, ఆ నాగేంద్రం వీరి స్నేహితులే కదా?''

''అవునమ్మా''

''అయితే వెంటనే కారు ఆపు చేయండి సురేశ్ గారూ, నేను దిగిపోవాలి''అంది దుర్గ.

మాష్టారూ, సురేశ్ కూడా ఉలిక్కిపడ్డారు.

''ఇదుగో మిస్టర్ మీకే చెపుతున్నాను కారు ఆపుచేయండి. ఆ నాగేంద్రం హత్యకేసులో ముద్దాయి చెల్లెల్ని అని మరచిపోకండి. ఎందుకు మా మూడో అన్నయ్యముద్దాయి అయ్యాడో నాకు తెలుసు. మా పెద్దన్నయ్య ఎలా చనిపోయాడో నాకు తెలుసు. ఆ భయంకర సత్యాల్ని నేను మరచిపోలేను. నేను మీ కారులో ఉండలేను. వెంటనే ఆపివేయండి'' అంది దుర్గ తీవ్రంగా.





సురేశ్ అన్నాడు-" ఆ నాగేంద్రం నా స్నేహితుడే. కాని ప్రత్యక్షంగా నాకు ఆ సంఘటనతో సంబంధం లేదు. నేను జరిగిన దానికి విచారిస్తున్నానుకూడా. ప్లీజ్ నేనెలాంటివాడినైనా కొద్దిసేపు ఓపికపట్టండి. మీరు వెళ్లవలసిన చోటు వచ్చేస్తోంది కదా. ఈ కొద్దిసేపూ కారులో కూర్చుంటే తప్పుకాదుకదా"

"ఊఁహు, నిజం తెలిసిన తరువాత నేను మీకారులో కూర్చోలేను. మర్యాద వంకని భయంకర సత్యాలను దాచలేం, మిస్టర్ కారు ఆపివేయండి. లేకపోతే గట్టిగా అరుస్తాను-ఆపండి" అంది దుర్గ గొంతుక పెంచుతూ. సురేశ్ కారు ఆపక తప్పలేదు. కారు ఆగగానే దుర్గ తలుపుతీసుకొని బయటికి దూకింది. 'మాష్టారూ మీరు కూడా నాతో వస్తారా, కారులో వెళ్తారా?" అంది.

"నీతోనే వస్తానమ్మా"అని శేఖరం మాష్టారు కూడా దిగారు. దుర్గ ముందుకి కదిలింది. "వస్తాను, సురేశ్" అని మాష్టారు కూడా ఆమెతోబాటు నడిచారు. సురేశ్ కొంతసేపు వాళ్లిద్దరికేసి చూస్తూ ఉండిపోయి, తరువాత ఒకసారి పెద్దగా నిట్టూర్చి కారు నడుపుకుంటూ వెళ్లిపోయాడు.

కొద్ది దూరం పోయిన తరువాత దుర్గ అంది: "మాష్టారూ, నామనస్సు పాడైంది. ఇపుడు నేను సుబ్రహ్మణ్యంగారింటికి రాలేను. మధ్యాహ్నం రెండుగంటలకు బజారులో ఆయన షాపు దగ్గరికి వస్తాను. సుమతిగారిని కూడా తీసుకొని మీరు అక్కడికే రండి. అక్కడే మనం అన్ని విషయాలు చర్చించుకుందాం, సెలవు" అని అటుపోతున్న ఆటోకేకేసి దుర్గ వెళ్లిపోయింది.

శేఖరం మాష్టారు భారంగా నిట్టూర్చి సుబ్రహ్మణ్యం ఇంటివైపు కదిలారు.



అన్నట్లే రెండుగంటలకు దుర్గ బజారులో సుబ్రహ్మణ్యం షాపు దగ్గరికి వచ్చింది. ఆమె అంది-"మాష్టారూ, పొద్దున్న నేనలా వ్యవహరించినందుకు మీకు కోపం వచ్చిందా?"

"అదేమిటమ్మా, నీహృదయంలో ఎంత దుఃఖం, బాధ, కోపం పేరుకొని ఉన్నాయో నేను ఎలా మరచిపోగలనమ్మా? కాని ఆవ్యక్తి ఎలాంటివాడైనా, మనమట్టుకు-"అని ఆయన అంటూండగా-

"మాష్టారూ ఈపెద్దమనిషే ఆ శ్యామల చావుకి బాధ్యత వహించాలన్నది మరచిపోయారా? ఈ పెద్ద మనిషే మిమ్మల్ని దగ్గర ఉండి కొట్టించాడన్నది మరచిపోయారా? సుబ్రహ్మణ్యంగారు నాకు అంతా చెప్పారు. అన్నిటికన్నా దారుణం ఆ నాగేంద్రం ఈయన అనుచరుడే. ఈయన దన్ను లేకపోతే వాడు అలా చెలరేగకపోను. నన్ను అవమానపరచక పోవును. మాపెద్దన్నయ్య లాకప్‌లో చావడానికి ఈ పెద్దమనిషి ప్రోత్సాహం ఉందనే నేను నమ్ముతున్నాను. ఆ నాగేంద్రం చస్తే పెద్ద ఊరేగింపు లేవదీసింది కూడా ఈ పెద్దమనిషే, అటువంటివాడు కనిపిస్తేనే నారక్తం ఉడికిపోతుంది. అటువంటివాడితో కారులో ప్రయాణం చేయడమా?" అంది దుర్గ కళ్లలో నిప్పులు కుక్కుతూ.

"నీబాధ నేను అర్థంచేసుకున్నానమ్మా, కాని ఆనాడు అతను అహంకారంతో, మదంతో రాక్షసుడిలాగే వ్యవహరించాడు. పరిస్థితులు కూడా అతనిని అలాగే ముందుకు తోశాయి. కాని ఇప్పుడతనిలో మార్పు వస్తున్నట్లుందిగదా! పరమ రాక్షసుడుకూడా ఒక్కొక్కప్పుడు తన తప్పు తెలుసుకొని, పశ్చాత్తాపపడి, మామూలు మనిషిగా మారవచ్చుకదా" అన్నారు మాష్టారు.

"ఈమార్పుని నమ్మలేం మాష్టారు. ఇది ప్రస్తుతానికి చెడ్డగా వ్యవహరించడం అవసరంలేదు కాబట్టి మంచిగా వ్యవహరించడం కావచ్చు. ఈశిష్యమర్యాద ఒక ముసుగు. మళ్లీ అవసరం వస్తే, లేక పరీక్షవస్తే రాక్షసత్వం తిరిగి బయటపడదని నమ్మకమేమిటి?" అంది దుర్గ ఇంకా తీవ్రంగానే.

మాష్టారు కొద్దిక్షణాలు మౌనంగా ఉండి-"ఇక ఆవిషయం మరచిపోదాం తల చుకున్న కొద్దీ గుండెమంట చెలరేగుతూ ఉంటుంది. ఇక సుబ్రహ్మణ్యంగారి వ్యాపారం విషయం ఆలోచిద్దాం. అది దెబ్బతినకుండా యథాప్రకారం సాగేటట్లు చేయడం మన ధర్మం, కర్తవ్యం" అన్నారు.

దుర్గా, ఆయనా, సుమతీ, షాపులో సహాయ

కులూ వ్యాపారం గురించి చర్చించుకున్నారు.

అంతా అయిన తురువాత దుర్గ ఇంటికి వెళ్తానని చెప్పి బయలుదేరింది.

కొంతదూరం పోయిన తురవాత ఆమె తన తోకూడా ఎవరో అనునరిస్తున్నట్లు గమనించింది. గిర్రున వెనక్కి తిరిగింది. సురేశ్! "ఓ నువ్వా! మిస్టర్ సురేశ్, ఎందుకు నాతో కూడా వస్తున్నావు? నాకింకా ఏమి హాని చేయాలని చూస్తున్నావు!" అంది తీవ్రంగా.

"క్షమించండి, మీకోపం నేనర్థం చేసుకోగలను. నామాట మీరు నమ్మకపోవచ్చు కాని నావల్ల ఇకముందెన్నడూ మీకు ఏహానీ జరగదని మాట ఇస్తున్నాను. నేను మీతో ఒకసారి మాట్లాడాలనుకుంటున్నాను, నాకవకాశమివ్వండి, ప్లీజ్"

"ఇంతజరిగిన తరువాత ఏమీ తెలియనట్లు మాట్లాడాలనుకుంటున్నావా? నేను నీతో మాట్లాడాలా? నువ్వు నా ఎదర ఉంటేనే నారక్తం ఉడికి పోతుంది. మంచిగా చెపుతున్నాను వెంటనే నాకు దూరంగా వెళ్లిపో మిస్టర్".

"ప్లీజ్, మీరు నన్ను ద్వేషించండి, నిందించండి, శిక్షించండికూడా. కాని నామాట ఒకసారి వినండి. పరమకిరాతకుడిపైనైనా శిక్ష అమలు పరిచేముందు వాడు చెప్పకోవలసిందేమైనా ఉందా అని అడుగుతారు. మీదృష్టిలో నేను కిరాతకుణ్ణే. కాని నేను చెప్పేది విన్నంతలో మీకేమీ హాని జరగదుకదా"

"ఎందుకు వినాలి నేను? ఏమిటి ప్రయోజనం? దారుణంగా చచ్చిపోయిన మా పెద్దన్నయ్య తిరిగి వస్తాడా? ఇప్పుడు మీరు ఏమి చెపితే మాత్రం నాగుండెలో మంట చల్లారుతుందా?" అంది దుర్గ ఇంకా తీవ్రంగానే.

"మీ పెద్దన్నయ్యగారి దారుణమైన చావుకి నేను ఎంతో చింతిస్తున్నాను. చట్టపరంగా ఏబాధ్యత లేకపోయినా పరోక్షంగా ఆయన చావుకు నాకుకూడా నైతిక బాధ్యత ఉందనే భావిస్తున్నాను. చనిపోయిన మీ అన్నగారిని నేను బతికించలేను. ఆ భగవంతుడు కూడా బతికించలేడు. కాని మీరు ఏశిక్ష విధించినా స్వీకరిస్తాను. ప్లీజ్ అందరూ మనకేసి చూస్తున్నారు. పార్కు ఇక్కడే ఉంది. లోపలికి పోయి ఒక్క నిమిషం కూర్చొని వెళ్ళండి. ప్లీజ్" అన్నాడు సురేశ్ ఆమెకేసి ఆశగా చూశాడు.

ఆమె ఒకసారి హుంకరించి "సరే పద" అంది అతను మన్నిస్తున్నా తను మాత్రం అతనిని మన్నించకుండా.

ఇద్దరూ పార్కులోకి నడిచారు. మొక్కల మధ్య ఒక ఖాళీబెంచిమీద కూర్చున్నారు.

సురేశ్ తన పాంటు జేబునుంచి చిన్న రివాల్వరు పైకి తీశాడు దుర్గ కళ్ళు పెద్దవిచేసి చూసింది.

సురేశ్ అన్నాడు- "దుర్గగారూ, మీకు నామీద అపనమ్మకం సులభంగా పోయేటట్లు లేదు. ఇదుగో ఈ రివాల్వరు మీకిస్తున్నాను. మీ పెద్దన్నయ్యగారి చావుకు పరోక్షంగా నా బాధ్యత ఉన్నందున నన్ను కాల్చి పగతీర్చుకోండి" అని ఆ రివాల్వరు ఆమె వైపుకు చూపాడు.

దుర్గకళ్లు ఇంకా పెద్దవయ్యాయి. మళ్ళీ అంతలో ఆమె కనుబొమ్మలు ముడిపడ్డాయి "ఇదిగో మిస్టర్ సురేశ్ డ్రమటిక్ ఏక్షన్ సినిమాల్లో రక్తికడ్తుందేమోకాని నిజజీవితంలో కాదు. నేను ఆత్మరక్షణకేమోగాని పగతీర్చుకునేందుకు ఆయుధం చేపట్టనని నీకు తెలిసుండాలి" అంది ఆమె అంతే తీవ్రతతో.

"నేను గొప్ప డ్రమెటిక్‌గా ఉంటుందని అలా చేయలేదండి. నా నిజాయితీ నిరూపించడానికే అలాచేయబోయాను. నేను మారానని మీకు తెలియజేయడమెలాగో నాకర్థం కాకుండా ఉంది. ఇదివరకు నేను నోరువిప్పితే బూతులు లేకుండా మాట్లాడేవాడిని కాను. పరమ మోటుగా మాట్లాడేవాడిని. ఈ కొత్తరాజకీయ బాధ్యత చేపట్టిన తరువాత కష్టపడి, అభ్యాసం చేసి బూతులు లేకుండా మాట్లాడడం నేర్చుకున్నాను. సంస్కారయుతంగా మాట్లాడడం కూడా నేర్చుకున్నాను. అసలు శేఖరం మాష్టారిని కొట్టించిన రోజే నాలో మార్పు ప్రారంభమైంది. ఆయన ధైర్యానికి నాకు షాక్ తగిలింది. ఆమార్పు ఇటీవల మరింతవేగం పుంజుకుంది. గతంపట్ల పశ్చాత్తాపం కలుగుతోంది. తప్పులు దిద్దుకొని మంచి మార్గానికి మరలుదామనుకుంటున్నాను. అలాగని తప్పుల్ని చెరిపేసెయ్యమనడంలేదు. ఆ తప్పులకి ప్రాయశ్చిత్తం చేసుకోవడానికి నేను సిద్ధమే" అన్నాడు సురేశ్ రివాల్వరు మళ్ళీ జేబులో





పెట్టివేస్తూ.

"ఎందుకిదంతా నాముందు చెపుతున్నావు, మిస్టర్? నీకు శిక్ష విధించమంటున్నావు? నీకు శిక్ష విధిస్తే నాకు ఏమి వస్తుంది? నా బాధఏమి తీరుతుంది?"

"నావల్ల మీకు పరోక్షంగా ఎంతోహాని జరిగింది కాబట్టే మీముందే నాతప్పులు ఒప్పుకుంటున్నాను. ఏ విధంగా ప్రాయశ్చిత్తం చేసుకోవచ్చో, పరిహారం చెల్లించవచ్చో సూచించమంటున్నాను" అన్నాడు సురేశ్.

దుర్గ అతని కళ్లలోకి చూసింది. వాటిలో మొదటి తీవ్రత కొంత తగ్గింది. "మా పెద్దన్నయ్యని తిరిగి బతికించడం ఆ భగవంతుడికి కూడా సాధ్యంకాదని నేనూ అంగీకరిస్తున్నాను. చెప్పేది నిజమైతే ఎవరు అన్యాయానికి గురి అయ్యారో వాళ్లకి తోడ్పడాలి. మా బుల్లన్నయ్య నాకు జరిగిన అవమానంవల్ల, మా పెద్దన్నయ్య దారుణపు చావువల్లా విపరీతమైన ఆవేశం చెందాడు. ఆ ఆవేశంలో కొంచెం చితికిపోయాడన్నది నిజమే. అందుకు శిక్షపడడంలో కూడా తప్పులేదు. కాని ఆ నాగేంద్రం హత్యకు ఎలా కారణభూతుడయ్యాడో నీకు తెలిసే ఉంటుంది. అందువల్ల అతనికి అవసరానికి మించిన శిక్షపడడం అన్యాయమవుతుంది. ఆ అన్యాయాన్ని నివారించాలి. అలాగే సుబ్రహ్మణ్యంగారి మీద పెట్టిన కేసు దొంగకేసు అని గుండె ఉన్నప్రతి వాడికీ తెలును. ఆయన ఘర్షణలకీ, హింసకీ వ్యతిరేకి. నిజంగా ఆయన కొట్లాటలు జరగకుండా ప్రయత్నించారు. కాని ఆయనే కొట్లాటలు జరిపినట్లు కేసు బనాయించారు. కొట్లాటలు లేవదీసిందెవరో కూడా మీకు తెలిసి ఉండాలి" అంది దుర్గ.

"ఆ వివరాలన్నీ నాకు పూర్తిగా తెలియవు. సుబ్రహ్మణ్యంగారిపై ఈ కేసు విషయంలో నాకేమాత్రం సంబంధంలేదని మాత్రం చెప్పగలను. ఈ రెండు కేసుల విషయంలో నేను చేయగలిగిన సాయం చేస్తానని మాట ఇస్తున్నాను దుర్గగారూ"

"కాని మిస్టర్ సురేశ్, ఇది చేసినందుకు నేను కృతజ్ఞత చూపాలనుకుంటే పొరబాటుపడతావు. నాగుండెలో ఎంతటి [illegible] అందు. భ్రమలో ఉండవద్దని ముందే హెచ్చరిస్తున్నాను"

"ఇది నా ఆత్మతృప్తి కోసమే, నా గతానికి ప్రాయశ్చిత్తంగా చేస్తానని చెప్తున్నాను. మీ నుంచి కృతజ్ఞత కోసం ఎదురు చూడను" అన్నాడు సురేశ్.

"మాటల్లో కాదు, చేతల్లో చూపాలి, చూస్తాంకదా" అని లేచినిలబడింది దుర్గ.

అతనూ లేచాడు. ఇద్దరూ పార్కు వెలుపలికి నడిచారు. అంతలో దుర్గ ఏమో జ్ఞాపకం వచ్చి "కారేదీ?" అని అడిగింది.

"కారులో వస్తే మీతో మాట్లాడడం కష్టం అని మా స్నేహితుడి ఆఫీసు కాంపౌండులో విడిచి వచ్చాను.

"పాపం పాదాలు కందుతాయేమో. నాకోసం అనవసరంగా కష్టం కలిగిందనుకుంటాను"

"కష్టాల కోర్చుకోగలగడం శరీరానికీ, మనస్సుకీ మంచిదే కదండీ" అన్నాడతను.

దుర్గ అతని కళ్లలోకి ఒకసారి సూటిగా చూసి, తరువాత వీడ్కోలు చెప్పకుండానే అటు తిరిగి వెళ్ళిపోయింది. సురేశ్ ఆమె వెళ్ళిన వైపే చూస్తూ తరువాత ఒకసారి పెదవులు బిగించుకొని తల ఆడించి స్నేహితుడి ఆఫీసుకు నడిచిపోయాడు.

★ ★ ★

మర్నాడు దుర్గ షాపునుండి ఇంటికి వెళుతూండగా సురేశ్ ఎదురయ్యాడు.

దుర్గ "పలకరించి పోదామనేనా మీరు వచ్చినది?" అని అడిగింది.

"కాదండీ... మీరు చెప్పిన విషయం గుర్తు ఉంచుకున్నాను. నిన్న సాయంత్రమే వెళ్లి లాయరు భూషణరావుగారితో మాట్లాడాను. ఆయన ఈ ఊళ్లో పేరుమోసిన క్రిమినల్ లాయరు అని మీకు తెలిసివుండాలి. ఆయనతో నాకు తెలిసినంతవరకూ చెప్పాను. మిమ్మల్ని తీసుకువెళ్లి పరిచయంచేస్తాను. తరువాత మీరు, శేఖరం మాష్టారూ ఆయనకి కావలసిన వివరాలన్నీ చెప్పాలి. నేను ఆయనని ఎంగేజ్ చేసినట్లు ఎవరికీ చెప్పవద్దు. మీరే కుదిర్చినట్లు చెబుదురుగాని. ఆయన ఫీజ్ చాలా ఎక్కువ. కాని అది నేను చూసుకుంటాను. ఇది లంచమిచ్చి మిమ్మల్ని మంచి చేసుకోవడానికన్నట్లు కాదు. నా ప్రాయశ్చిత్తంలో భాగంగా

మాత్రమే ఇది చేయనివ్వండి. ఇప్పుడు వెళ్లి కలుసుకుందామా?'' అన్నాడతను.

''ఇప్పుడే వెళ్దామా?'' అంది దుర్గ.

''ఆయనకి ఈవేళ కోర్టులో పని ఎక్కువ లేదట. అందువల్ల పెందరాళే ఇంటికి తిరిగివ చ్చేస్తానన్నారు. కాని మీరు ఎందుకలా అడిగారు... ఇప్పుడు ఎక్కడికి వెళ్తున్నారు? ఏమైనా పని ఉందా?'' అని అడిగాడతను.

''ఇంటికేనండి. భోజనం చేయడానికి వెళ్తున్నాను. వేరే పని ఏమీలేదు. వెళ్దామంటే పదండి'' అంది దుర్గ.

''అంటే మీరు ఇంకా భోజనం చేయలేదన్న మాట. ఒక పనిచేద్దాం. హొటలుకి వెళ్దాం. అక్కడ మీరు భోజనం చేద్దురుగాని, తరువాత వెళ్లి లాయరుగారిని కలుసుకుందాం'' అన్నాడు సురేశ్.

''వద్దులెండి. భోజనంకన్న పని ముఖ్యం. ముందు లాయరుగారినే కలుసుకుందాం''

మిమ్మల్ని అనుమానించినందుకు క్షమాపణ చెప్పుకుంటున్నాను. ఇంతకీ మీరెందుకు వచ్చినట్లు?'' అని అడిగిందామె.

''ఇప్పటికైనా నన్ను ఒక మనిషిగా గుర్తించారు - సంతోషం'' అన్నాడతను.

ఇద్దరూ కలిసివెళ్లారు. లాయరుగారు ఇంటివద్దే ఉన్నారు. సురేశ్ ఇద్దరినీ ఒకరికొకర్ని పరిచయం చేశాడు.

తరువాత లాయరుగారు దుర్గని విషయం టూకీగా సురేశ్ద్వారా విన్నాననిచెప్పి దుర్గని తనకి తెలిసినదంతా చెప్పమన్నారు. దుర్గ చెప్పింది. ఆయన మౌనంగా, ఎంతో ధ్యానంతో విన్నారు.

''సరేనమ్మా...నాకిప్పుడు రెండుకేసులస్థితీ అర్థమైంది. ఈసాయంత్రం ఏడింటికి ఈవిషయంలో మీకు తోడ్పడుతున్నవారినీ, ఇప్పటికీ ఈ వ్యవహారాలు చూస్తున్న లాయర్లనీ పిలుచుకురండి. అప్పుడు భవిష్యత్ కార్యక్రమం రూపొందించుకుందాం'' అన్నారు భూషణరావుగారు.

దుర్గా, సురేశ్ ఆయనదగ్గర సెలవుతీసుకుని బయటికివచ్చారు. సురేశ్ అన్నాడు-''దుర్గగారూ, ఒక మంచి హొటలలో భోంచేద్దురుగానిరండి. నాభోజనం అయిపోయింది కాబట్టి మీతోబాటు ఏమైనా టిఫిన్ తీసుకుంటాను. ఈసారి నా ఆతిథ్యం స్వీకరించండి''

''అలాటివేమీవద్దు సురేశ్గారూ, మా అమ్మానాన్న నాకోసం ఎదురుచూస్తూ ఉంటారు. ఇప్పటివరకూ మీరుచేసినదిచాలు. అందుకు ధన్యవాదాలు'' అనిచెప్పి దుర్గ వెళ్ళిపోయింది.

★ ★ ★

మర్నాడు మధ్యాహ్నం దుర్గ ఇంటిదారివడ్తూ ముందులాగే వెనక్కితిరిగి చూసింది. కొంతదూరంలో సురేశ్ ఉన్నాడు. మరికొంత దూరం పోయినతరువాత మళ్ళీ వెనక్కి తిరిగి చూసింది. సురేశ్ తనవెనకే వస్తున్నాడుకాని దూరంగానేవస్తున్నాడు. ఆమె ఆగిపోతే అతనూ ఆగిపోయాడు. దగ్గరికిరావడానికి ప్రయత్నించలేదు, పలకరించడానికీ ప్రయత్నించలేదు. చాలా చిత్రంగాఉందే! పట్టించుకోకుండా వెళ్ళిపోదామా, దగ్గరికిపిలిచి విషయమేమిటో కనుక్కుందామా అని కొద్దిక్షణాలు గుంజాటనపడి చివరికి తెగింపుకువచ్చి అతని వైపుకు చేయిఊపింది. నిలబడి అతని వేపే చూసింది. అతను దగ్గరికి వచ్చాడు.

దుర్గ అడిగింది-''మీరు నా వెనకే వస్తున్నట్లున్నారు. కాని ఎందుకు దూరంగా ఉండిపోయారు?''

''పలకరిస్తే మీకు కోపంవస్తుందేమోనని. తరచూ నాతోమాట్లాడడం మీకిష్టంగా ఉండదనిపించింది'' అన్నాడతను.

''అయితే నావెనక ఎందుకురావడం?''

''దానివల్ల మీకేమీ ఇబ్బంది లేదుకదా''

''ఇబ్బందిలేదునరే, ఏమీ మాట్లాడకుండా కొంచెం దూరంగా నా వెనకరావడంవల్ల ప్రయోజనమేమిటి? నాతో చెప్పవలసిందేమైనా ఉంటే వచ్చి చెప్పేయాలి. నేను మీదపడికరవనుకదా. చెప్పవలసింది ఏమీలేకపోతే మీదారిన మీరు వెళ్లిపోవాలి. అంతేకాని- '' అని దుర్గ అతనికేసి ప్రశ్నార్థకంగా చూసింది.

కాని అతను మౌనంగా ఉండిపోయాడు.

''ఏమిటి, మీ వ్యవహారం ఈవేళ చిత్రంగా ఉందే. అలా మౌనంగా ఉండిపోయారేం? నా



ప్రశ్నకు జవాబివ్వరేం?''

"ప్లీజ్, మనం పార్కుదగ్గరకి వచ్చాం. కొద్ది సేపు లోపలికి వెళ్దాం అక్కడ నేను చెపుతాను. అప్పుడే అందరూ మనకేసి చూస్తున్నారిక్కడ'' అని పార్కువైపుకు అడుగులు వేశాడతను.

దుర్గ అతని వెనకే నడిచింది. ఇద్దరూ మొక్కలమధ్య ఖాళీ బెంచిమీద కూర్చున్నారు.

"ఇప్పుడు చెప్పండి, మీరెందుకిలా చేస్తున్నారో?''

"నిన్నరాత్రి శేఖరం మాష్టారినీ, మీకోసం పనిచేస్తున్న యువలాయరినీ తీసుకొనివెళ్ళి లాయరు భూషణరావుగారిని కలుసుకున్నారా? ఏమైంది?''

"నిన్నరాత్రి అందరం ఆయనదగ్గరికి వెళ్ళామండి. అంతాచెప్పాం. ఆయన ఎన్నో ప్రశ్నలువేశారు. వాటికి జవాబిచ్చాం. ఆయన తన జూనియర్స్‌నికూడా సాయపడమని చెప్పారు. పోలీసుఅధికార్లతోకూడా ఆయనే మాట్లాడుతామన్నారు. మరికొందరు సాక్షుల్నికూడా తీసుకురమ్మన్నారు. ఎవరైతే వీలుగాఉంటుందోకూడా చెప్పారు. ఆయన సుబ్రహ్మణ్యంగారూ వాళ్లూ బయటికి రావడం ఖాయమన్నారు. మాఅన్నయ్యమీదకూడ ఎక్కువ శిక్షపడకుండా చూడగలనన్న విశ్వాసం తనకుందన్నారు. మాకు కూడా ఇప్పుడు బాగా ధైర్యం కలిగింది. ఇదంతా సాధ్యం చేసినందుకు మీకు ధన్యవాదాలు. అవును, మీరెందుకు మీరుసాయం చేస్తున్నట్లు చెప్పవద్దన్నారు?''

"ఇంతగా ప్రాధేయపడుతుంటే మీరే నన్ను సులభంగా నమ్మడంలేదు. ఇతరులు నమ్ముతారా? మాష్టారు నన్ను కొంత అర్థంచేసుకున్నారనుకుంటాను. కాని సుబ్రహ్మణ్యంగారూ వాళ్లూ నన్ను సరిగా ఎరగరుకదా. నేనుసాయంచేస్తున్నానని తెలిస్తే అవాంఛనీయమైన పరిణామాలు వస్తాయేమోనని భయపడ్డాను. అంతేనండి, మీరేమని చెప్పారు?''

"నాస్నేహితురాలికి ఆయన బంధువని, ఆ స్నేహితురాలుచెపితే ఆయన సానుభూతి చూపి స్వచ్ఛందంగా ముందుకు వచ్చారనీ చెప్పాను. నన్ను మీవాళ్లు ప్రశ్నించరుకదా. ఇంతకీ మీరు నా మొదటి ప్రశ్నకు జవాబు చెప్పనేలేదు. మధ్యలో పక్కదారి పట్టించారు''

సురేశ్ మళ్లీ మౌనం వహించాడు.

"ఎందుకు జవాబు చెప్పడంలేదు? మనమధ్య పెద్ద అగాథం ఉందని తెలిసినా నాదగ్గరికి రాసాహసించిన వారు ఇప్పుడు వెనుకాడడం దేనికి?''

"మిత్రులు కలుసుకోవడం తప్పులేదుకదా. చెప్పుకోవలసినది కూడా చాలానే ఉంటాయి. మీతో చెప్పేది ఏమైనా ఉంటేనే మీదగ్గరికి వస్తాను. నన్ను దూరంగా తరిమివేయకండి, ప్లీజ్ నా మీద దయ ఉంచండి'' అని వేడుకున్నాడు సురేశ్.

"దగ్గరకు రావాలంటే ఏదో నెపం దొరకకపోదు. భ్రమ తొలగించుకొండి సురేశ్. మిత్రునిగా చూస్తానన్నా మనమధ్య మైత్రి కూడా అంత సజావుగా సాగలేదు. మీరు కాదన్నా మీ ధనం, పలుకుబడి, హోదాల ప్రభావం నుంచి మీరు బయటపడలేరు. ఈనాడు ఆవేశంలో ఏమైనా చేస్తాను, అన్నీ వదులుకుంటాను, కాలినడకనే తిరుగుతాను అంటే అనవచ్చు కాని త్వరలోనే నిజం బయటపడకమానదు. ధనవంతులు కూడా ఒక్కొక్కప్పుడు పేదరికపు నిశ్చింతా, ఆనందమూ గురించి కలలు కంటారట. కాని నిజంగా పేదరికం అనుభవిస్తే తెలుస్తుంది తమ కలలో ఎంత సారం ఉందో! మీరీ రాత్రికి భోజనం చేయకుండా ఉండండి. రేపు పొద్దుటికే మీ ఆవేశం తగ్గకపోతే చూడండి. అందుకే సురేశ్‌గారూ మీరు నామీద ఏ భ్రమలు పెట్టుకోకండి, నాకు కొంచెం దూరంగానే ఉంటూ ఉండండి'' అని లేచి దుర్గ వెళ్ళిపోబోతూ, అంతలో ఆగి "సారీ, మీకు వీడ్కోలైనా చెప్పలేదు. నా మర్యాదలేమి మళ్లీ రుజువవుతుంది. ఇంతవరకు మీరు చేసిన దానికి మళ్లీ ధన్యవాదాలు తెలుపుతున్నాను, వస్తాను'' అని చిరునవ్వు నవ్వి వెళ్లిపోయింది.

* * *

మర్నాడు మధ్యాహ్నం దుర్గ ఇంటికి వెళ్తూ అంతలో ఏదో జ్ఞాపకం వచ్చి పక్కకు తిరిగి చూసింది. అక్కడ రోడ్డు పక్కన సురేశ్ నిలబడి ఉన్నాడు. ఆమె దగ్గరికి రావడానికి ప్రయత్నించలేదు. ఆమె అటువెళ్లవలసి రావడం చేత అతని దగ్గరగా కదిలింది. కొంచెం దగ్గరయ్యేటప్పటికి "నమస్కారం దుర్గగారూ''




అన్నాడు అతను విచారంగా చిరునవ్వు నవ్వుతూ కదలకుండానే. ఆమె చిరునవ్వుతో "నమస్కారం సురేశ్" అని అతని మొహంలోకి చూసింది. ఏదో తేడా తోచింది.

"ఏమిటి సురేశ్ అలా ఉన్నారు! ఒంట్లో బాగాలేదా?" అని అడిగింది.

"ఏమీ లేదండి, ఒంట్లో మామూలుగానే ఉంది"

"మరి మీ మొహంలో కొంచెం నీరసం కనిపిస్తోందేమిటి? కళ్లు కొద్ది లోతుకు పోయినట్లున్నాయేమిటి?"

అతను మాట్లాడలేదు.

ఆమెకు హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది. "సురేశ్, నేను నిన్న యధాలాపంగా అన్న మాట నిజంగా తీసుకోలేదు కదా? నిన్న రాత్రి భోజనం చేయలేదా?"

అతను గంభీరపు చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు.

"నేను మీకు పరీక్షపెట్టలేదే! ఈ పరీక్ష పాసైతే మీకు వచ్చే ఫలితం ఏమీ లేదే. ఎందుకలా చేశారు?"

"మీరు పరీక్షపెట్టారని కాదండి. ఒకపూట భోజనం మానేస్తే ఎలా ఉంటుందో చూడాలనిపించింది... మానేశాను. దానివల్ల పెద్ద ఇబ్బంది ఏమీ కలగలేదు"

"పోనీ ఈ పూటైనా ఏమైనా ఆహారం తీసుకున్నారా?"

అతను మళ్లీ ఆదేరకంగా చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు.

"నామాట అక్షరాలా తీసుకొని మీరు నాకు పరీక్షపెడుతున్నారు. సురేశ్‌గారూ... మీరిప్పుడు కూడా భోజనం చేయకపోతే నేను తప్పుచేసినట్లు బాధపడవలసివస్తుంది. పదండి - మీకు నచ్చిన ఏ హోటలుకైనా. మీరు బోజనం చేస్తుంటే నేను దగ్గర కూర్చొని తరువాత వెళ్తాను"

"మీరిప్పుడు ఇంటికి భోజనానికి వెళ్తున్నారు కదా. మీరుకూడా నాతో భోజనం చేస్తేనే నేనూ చేస్తాను" అన్నాడు సురేశ్.

"సరేలెండి, పదండి" అంది దుర్గ.

సురేశ్ దగ్గరలోనే ఉన్న ఒక ఖరీదైన హోటలుకి తీసుకువెళ్ళాడు. ఫామిలీ రూంలోకి వెళ్లి భోజనానికి కూర్చున్నారు.

"మీరు నాకోసం చేసిందేదో చేశారు. ఇక చేయవలసిందేమీ లేదు. ఒక పనిచేస్తాం... అది చేయడం నానుంచి మెప్పుపొందడానికి కాక మీలోని మానవత్వం దృఢమవడానికి మాత్రమే చేయాలి"

"అదేమిటో చెప్పండి... చేస్తాను"

దుర్గ సుబ్రహ్మణ్యం కేసు సందర్భంగా చెప్పిన విషయాలు గుర్తుచేసి ఆ పేటవానుల దీనస్థితి గురించి చెప్పింది. పన్నెండుమంది కుటుంబాలవారున్నారు. వాళ్లు తలదాచుకుందుకు కూడా జాగా లేదిప్పుడు. వారు ఎక్కడో అక్కడ తాత్కాలికంగానైనా గుడిసెలు వేసుకుందుకు స్థలంకావాలి. తరువాత వాళ్లకి శాశ్వతమైన ఇళ్లస్థలాల పట్టాలు లభించేటట్లు చేయాలి. ఆనాడు కారులో నన్ను ఎక్కమని ప్రోత్సహిస్తూ మీ రాజకీయపు పలుకుబడివల్ల ఇలా చేయగలరేమోనని మాష్టారు అన్నారు. మీకు రాజకీయ పదవి ఉంది. ఇలా చేయగలరేమో అని నేను అనుకున్నాను. ఇలా చేయడంకూడా మీ రాజకీయపు పలుకుబడీ, పేరు ప్రతిష్ఠలు మరింత పెరిగేందుకు దోహదం చేస్తుందేమో" అంది దుర్గ.

సురేశ్ కొంతసేపు ఆలోచించాడు. తరువాత అన్నాడు- "ఈవేళ సాయంత్రం మీకు ఏ విషయం చెబుతాను. ఎక్కడ కలునుకోమంటారు?"

"సుబ్రహ్మణ్యంగారి షాపు దగ్గరే కలుసుకుందాం"

"అయితే సాయంత్రం ఏడుగంటలలకు వస్తానండి. షాపులోకి రాను. షాపు వెలువల కొద్దిదూరంలో మీకోసం వేచిచూస్తాను" అన్నాడతను.

ఇద్దరూ భోజనం ముగించి బయటికి నడిచారు.

★ ★ ★

సాయంత్రం ఏడున్నరకికానీ దుర్గకు గుర్తురాలేదు. షాపులో చెప్పి తొందరగా బయటపడి చూస్తే కొంతదూరంలో సురేశ్ కనిపించాడు.

"ఎంతసేపైంది మీరువచ్చి?" అని అడి

గిందామె.

"కొద్దిసేపైందిలెండి. ఫరవాలేదు" అన్నాడు అతను చిరునవ్వుతూ.

"మిమ్మల్ని అరగంట నిలబెట్టేశానన్న మాట. వార్తలేమైనా చెబుతారా?"

"ఒక స్థలం ఉందండీ. శ్రీరాంనగరంలో బియ్యం మిల్లు వెనక కొంతస్థలం ఉంది. బజారుకి ఒక మైలు దూరం ఉంటుంది. అది మా దూరబంధువులకు చెందినది. కాని కోర్టులో కేసు ఉండటంవల్ల ఏ నిర్మాణమూ జరగడంలేదు. ఆ స్థలం మానాన్నగారి పర్యవేక్షణ కింద ఉంది కోర్టు వ్యవహారానికి అడ్డురాకుండా. తాత్కాలికంగా గుడిసెలు వేసుకోవచ్చు. ఎప్పుడు చెప్తే అప్పుడు ఖాళీ చేస్తామని కాగితాలు రాసివ్వాలి. కాని కనీసం ఏడాదివరకూ వాళ్ళు వదలవలసిన పని ఉండదు. వాళ్ళు కాగితాలు రాయడానికి అడ్డు చెప్పరనుకుంటాను. నామమాత్రంగా ప్రతి గుడిసె రూ నెలకు ఐదు రూపాయలు అద్దె చెల్లించాలి. దీనికి అభ్యంతరం ఉండదనుకుంటాను. మా స్థలంకాకపోవడంవల్ల ఇంతకన్నా రాయితీలు కలగజేయలేకపోతున్నాను. అందుకు మాకు అధికారంకూడా లేదు" అన్నాడతను.

"మీరు చెప్పిన షరతులు బాగానే ఉన్నాయి. వాళ్లు సంతోషంగా అంగీకరిస్తారనే నేననుకుంటున్నాను. నేను పొద్దున్నే వెళ్ళివాళ్లతో మాట్లాడుతాను. వాళ్లు సిద్ధపడితే రేపే వాళ్లు ఆ స్థలంలోకి మారడంలో సాయపడతాను" అంది దుర్గ.

"రేపు పొద్దున్న మీయింటికి రమ్మంటారా?"

"మీరు మా ఇంటికి వస్తారా?"

"ఏమి, రాకూడదా? నిషేధం లేకపోతే అడ్రను చెప్పండి వస్తాను" అన్నాడతను అప్పుడే.

"వద్దులెండి తరువాత ఎప్పుడైనా వద్దురుగానీ, ఆ వంతెనకట్టబోయే స్థలానికి రండి అది మీకు తెలుసుకదా. ఉదయం తొమ్మిదింటికి రండి" అని చెప్పింది దుర్గ.

"అలాగే వస్తాను, సెలవు" అని వెళ్లబోతూ అతను వెనక్కి తిరిగి "అన్నట్లు మీకిది ఇవ్వడం మరచిపోయాను" అని ఆమెను ఒక కాగితాల కట్ట ఇచ్చాడు.

"ఏమిటిది?" అని అడిగిందామె ఆశ్చర్యంగా చూస్తూ.

"ఒక దుర్మార్గుడి స్వీయచరిత్ర మీకు తీరిక లభించినప్పుడు చదవండి. వస్తాను" అని అతను గబగబా నడచిపోయాడు.

మర్నాడు పొద్దున్న కాలవపై వంతెనా, వంతెనను కలుపుతూ రోడ్డు వేయబోయే స్థలం దగ్గరికి అతను చేరుకున్నాడు. దుర్గ అంతకు ముందే వచ్చి అతనికోసం ఎదురు చూస్తోంది.

"నేను వీళ్లతో మాట్లాడానండీ. వాళ్లు సంతోషంగా మీరు చెప్పిన షరతులకు ఒప్పుకున్నారు. ఇక వీళ్లని ఆ స్థలానికి చేర్చడమే మనం చేయకలిగింది" అంది ఆమె.

"ఉండండి ఇప్పుడేవస్తాను" అని అతను వెనక్కి వెళ్లాడు ఒక అరడజను మంది మనుషులు అతని కూడా వచ్చారు. మరి కాసేపటికి రెండు లారీలు కూడా వచ్చాయి. ముందు విడతగా నాలుగు కుటుంబాలవారిని తమ సామాన్లు ఆరెండు లారీల్లో సర్దుకోమని చెప్పాడు. అతను కూడా తెచ్చిన మనుషులు కూడా సాయం చేయగా ఇళ్లు నష్టపోయినవారు సామాను లారీల్లోకి చేరవేయసాగారు.

అది చూస్తూ దుర్గా, సురేశ్ ఒకపక్క నిలబడ్డారు. అతను అడిగాడు "నేనిచ్చిన కాగితాలు ఒకసారి తిరగేశారా?"

"తిరగేయటమేమిటి? మొత్తం చదివేశాను. నవలలాగే ఉంది మీ కథ"

"ఎన్నో జన్మలకు సరిపడా పాపాలు చేశాను కదూ?"

"పాపం పుణ్యం మాటేమోకాని ఈ చరిత్ర తెలిస్తే ఏ ఆడదైనా మీరు కనిపిస్తే చాలు హడలిపోతుంది. దూరంగా పారిపోతుంది" అంది ఆమె.

"కాని పరమపాపికి పాపప్రక్షాళనం చేసుకుందుకు అవకాశం ఉండాలికదా"

"అవును మీ నిజాయితీయే మీలో నిజమైన మార్పువచ్చింది అనే తెలియజేస్తోంది. అందుకు మిమ్మల్ని అభినందిస్తున్నాను" అంది ఆమె.

లారీల్లోకి సామాను ఎక్కించడమయింది. పేదలకెంత సామాను ఉంటుంది కనక! దుర్గా, సురేశ్ ఇద్దరూ ఒకలారీ కాబిన్‌లోకి ఎక్కకూ





ర్చున్నారు. ఆ లారీని పోనిమ్మన్నారు. రెండవ లారీ ఆ లారీవెనక వచ్చింది. స్థలం చేరుకున్నారు. దుర్గా, సురేశ్ దిగారు. సురేశ్ ఆ స్థలంలో కొంత ఖాళీజాగా వదిలి, తక్కినది పన్నెండు భాగాలుగా ఏర్పరచి గుర్తుగా రాటలు పాతించాడు కూడా. వచ్చిన నాలుగు కుటుంబాలకీ ఒకవైపు స్థలాలు కేటాయించాడు. వాళ్లు తమ సామాను ఆ స్థలాల్లోకి దించుకోసాగారు. సామాన్లు అంతా దింపిన తరువాత లారీలు మరో నాలుగు కుటుంబాలవారికోసం వెళ్లాయి. దుర్గా, సురేశ్ అక్కడే ఉండి అక్కడికి వచ్చిన కుటుంబాలవారు సామాన్లు సర్దుకోవడంలో, గుడిసెలు లేవదీయడంలో సాయపడసాగారు. ఒంటిగంటకు "భోజనం చేసి, కొంచెం సేపు విశ్రాంతి తీసుకొని మళ్లీ వద్దాం" అని దారి తీసింది. ఇద్దరూ కలిసే భోజనంచేసి గుడిశెలు వేస్తున్న స్థలానికి బయలుదేరి వెళ్లారు.

★ ★ ★

సుబ్రహ్మణ్యంగారూ ఆయన అనుచరుల మీదా కేసు కొట్టివేయబడింది. వాళ్ళందుకే జైలువెలుపలే దండలువేసి ఊరేగింపుగా సుబ్రహ్మణ్యం ఇంటికి తీసుకువచ్చారు. అక్కడ చాలా కోలాహలంగా ఉంది. ఎందరో వచ్చి సుబ్రహ్మణ్యాన్ని అభినందించివెళ్తున్నారు. కొంతసేపటికి రద్దీ తగ్గింది. సుబ్రహ్మణ్యంతోబాటు విడుదల అయినవారిని వాళ్లఇళ్లకు వెళ్లమని చెప్పిపంపివేశాడు. తరువాత సుబ్రహ్మణ్యం, భార్యాపిల్లలూ, శేఖరం మాష్టారూ దుర్గా మాత్రమే మిగిలారు.

సుబ్రహ్మణ్యం అన్నాడు "దుర్గగారూ మీ మేలు మరచిపోనండి. మీద్వారానేకదా ఆ పెద్దప్లీడరుగారు మీ కేసు చేపట్టింది. మీ అన్నయ్యకేసు కూడా ఆయన చేస్తానన్నారట కదూ? ఇప్పుడు మనకి న్యాయం జరుగుతుందని ధైర్యం కలుగుతోంది దుర్గగారూ".

శేఖరం మాష్టారు అన్నారు" అంతేకాదు, ఆ వంతెనా రోడ్డు పథకంలో ఇళ్లు నష్టపోయినవారికి వేరేచోట తాత్కాలికంగానైనా ఇళ్లుకట్టుకుందుకు ఈ దుర్గే స్థలం చూపించి సహాయం చేసిందట".

"అవును దారిలో వస్తూంటే ఎవరో చెప్పారు. చాలా సంతోషం దుర్గగారూ, మీరొక్కరే ఒక ఉద్యమమనిపిస్తోంది. మీరుమాతో ఉంటే మనమందరం ఎంతో చేయగలమన్న ధీమా నాకేర్పడింది" అన్నాడు సుబ్రహ్మణ్యం.

దుర్గ అంది "నన్ను అతిగా పొగడకండి. ఎందుకంటే మీ ప్రశంసలకు నేనర్హురాలినికాను. ఇక్కడ మీకోనిజం చెప్పాలి".

"ఏమిటది?" అన్నారు సుబ్రహ్మణ్యం, శేఖరం మాష్టారు ఒక్కసారే.

"దీనికంతటికి కారణం సురేశ్ అంటే మీరు నమ్ముతారా?" అంది దుర్గ

"ఏ సురేశ్? ఆ వరప్రసాదరావుగారి కొడుకేనా?" అన్నారు శేఖరం మాష్టారు.

"ఆ గూండా నాయకుడు, ఎందరో ఆడపిల్లల జీవితాలతో చెలగాటమాడినవాడు, శ్యామల చావుకి పరోక్షంగా కారణమైనవాడు, మాష్టారిని కొట్టించినవాడూ, మీ అన్నయ్యల దుస్థితికీ కారణమైన ఆ సురేశ్!" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"అవును, ఆ సురేశే కాని ఇప్పుడతను మారాడు. స్వయంగా మాష్టారికే తెలుసు" అంది దుర్గ.

"అవును అతను కొంతమారాడని నేను గుర్తించాను. కాని ఇంతలా మారుతాడని అనుకోలేదే! అతను కలగజేసుకోవడం ఎలా జరిగింది? ఎందుకు చేశాడు?" అని అడిగారు మాష్టారు.

"ఆవేళ కారులోనుంచి నేను అలా దిగిపోయిన తరువాత మర్నాడు అతను నాదగ్గరకివచ్చి తనను క్షమించమని వేడాడండి. తనుచేసినదానికి పరిహారం చెల్లించుకునే అవకాశం కలగజేయమన్నాడు. అప్పుడు నేను ఈ పనులుచేసి, తనునిజంగా మారినట్లు నిరూపించమన్నాను. అతనే ఈ లాయరుగారితో మాట్లాడి ఒప్పించాడు! ఆయనకు కావలసిన ఇతరవిధమైన సహకారం కూడా అందించాడు. ఫీజు తనే చెల్లించాడు. ఇప్పుడు ఆ పేటవాసులకూ స్థలంచూపించింది అతనే అది వాళ్లదూరపు బంధువులది. కోర్టు తగాదాల్లో ఉండడంవల్ల ఖాళీగా పడిఉంది. అందువల్ల వీళ్లని అక్కడ గుడిసెలు వేసుకోమన్నాడు. కనీసం ఒక ఏడాది వరకూ వాళ్లు అక్కడినుంచి లేవనక్కర్లే

దన్నాడు'' అని చెప్పింది దుర్గ.

''దుర్గగారూ, మీరు చేసినది తప్పుఅనను కాని అలాంటివారికి మనం ఋణపడి ఉండడం ముందుముందు మనకాళ్లకి బంధ మవుతుందేమో! ఏదో ప్రయోజనం ఆశించి కానీ వాళ్లు ఇలాంటి మంచిపనులు చేయరు. అతనిప్పుడు ఛోటా రాజకీయనాయకుడు కూడా అయ్యాడుకదా. మనల్ని కూడా బల వంతంగా రాజకీయాల్లోకి లాగుతాడేమో'' అన్నాడు సుబ్రహ్మణ్యం.

దుర్గ అంది ''అవన్నీ మనం ముందే ఊహించుకొని కలవరపడడమెందుకు? ఆ పరిస్థితి వస్తే అప్పుడే ఎదుర్కొందాం. మనమే మీ అతనికి ఋణపడిలేము. అది నేనతనకి స్పష్టం చేశాను. తనుచేసిన దానికి పరిహా రంగానే ఇలా చేశాడు. దానివల్ల మరేవిధంగా నూ సాధించలేనిది సాధించగలిగాం అందులో తప్పేముంది?''

''అయినా అటువంటి చరిత్రగలవాళ్ల విష యంలో కొంత జాగ్రత్త ఉండడం మంచిద మ్మా. ఇప్పుడేదో మంచి బుద్ధిపుట్టి అలాచేసి ఉండవచ్చు. రేపు పరీక్షకి గురిఅయి మళ్లీ పాతతత్వమే బయటపడితే అతను మరోలా వ్యవహరించవచ్చు. మనం మొహమాటంలోప డి అతనిని ఎదుర్కోలేని పరిస్థితి ఏర్పడవ చ్చు. ఉపకారాల్లాంటివి చేసి మనుమల్ని మొ హమాటపెట్టి చెడుకి తలవంచేటట్లు చేసిన సంఘటనలెన్నో జరుగుగుతున్నాయమ్మా లోకంలో'' అన్నారు శేఖరం మాష్టారు.

''నేను గుడ్డిగా అతనిని నమ్మలేదు మాష్టా రూ. జాగ్రత్తగా ఆలోచించే, అతనికి ఇందులో ప్రత్యేకమైన లబ్ధిలేదని గుర్తించే అతని నుంచి ఈ సహాయం స్వీకరించాను. మీరన్న ట్లు చెడ్డవాళ్ల విషయంలో జాగ్రత్తగా ఉండాల న్నది నిజమే. ఒక ఖూనీకోరూ, పేదల్ని దోచు కొని బలిసినవాడూ సమాజసేవ చేస్తానని ముందుకు వస్తే మనం నమ్మలేం. నమ్మకూడ దు కూడా. కాని సమయమూ సందర్భమూ గుర్తించాలి కదా. ఫ్రెంచి రచయిత మపాసా కథలో కొందరు వేశ్యలు, జర్మనులు తమ దేశం ఫ్రాన్సుని ఆక్రమించుకున్నప్పుడు దేశం కోసం ఎంతో త్యాగం చేసి దేశభక్తి ప్రదర్శించినట్లు చిత్రించాడట. నువ్వు వేశ్యవి, నువ్వు దేశం కోసం త్యాగం చేయడానికి వీలులేదనవచ్చా? అలాగే రెండో ప్రపంచయుద్ధంలో నాజీలకీ, ఫాసిస్టులకీ వ్యతిరేకంగా మతాధికార్లూ, కమ్యూ నిస్టులూ కలసి పోరాడిన ఉదంతాలు ఉన్నా యట. మీరు కమ్యూనిస్టులు మీతో కలిసి పనిచేయమని మతాధికార్లూ అనలేదు; మతా ధికార్లతో కలిసి పనిచేయమని కమ్యూనిస్టులూ అనలేదుట. ఎందుకంటే ఎవరెవరెలాంటివా రైనా ఇద్దరి లక్ష్యం ఒకటే కాబట్టి. ఈ సురేశ్ ఎలాంటివాడైనా అతని ద్వారా మన పని నెరవేరుతోంది కదా. మనమేమీ మోసం చే యడం లేదు. అన్యాయం చేయడం లేదు. అది అలా ఉంచి తను మనకి శత్రువే అను కుందాం. అయితే మాత్రం ఏమిటి? పాము విషం నుంచి కూడా మనం ఔషధం తయారు చేసుకోవడం లేదూ? శత్రువుకి లొంగకుండా శత్రువుని కూడా ఉపయోగించుకోగల నేర్పు ఉండాలండి మనకి. ముక్కుకి సూటిగా పోతా మంటే అప్పుడప్పుడు మొగం పగిలేటట్లు బోరగిలపడవచ్చు. మోసం, అక్రమం చేయ మని చెప్పడం లేదని మళ్లీ గుర్తుచేస్తున్నాను. కాని మనకి నష్టం కలగనప్పుడు ఎటువైపు నుంచి సాయం అందినా స్వీకరించడంలో తప్పు లేదనుకుంటాను. కాని మీరన్నట్లు ఎప్పు డూ జాగరూకతతో ఉండాలి మాష్టారూ'' అంది దుర్గ ఏకధాటిగా ఉపన్యాసం చేసేసి.

కొంతసేపు అందరూ మౌనంగా ఉండిపో యారు. తరువాత శేఖరం మాష్టారు అన్నారు- ''సెభాష్ దుర్గా... నువ్వింత ఎదిగిపోయావని నేను గుర్తించలేకపోయానమ్మా. గురువును మించిన శిష్యురాలివయ్యావు. నీలో ఆలోచన వుంది. వివేకముంది. కార్యోత్సాహం ఉంది. సామర్థ్యం ఉంది. ఇక నీకు తిరుగులేదమ్మా. నువ్వన్నట్లు శత్రువర్గంలో నుంచే ఒకరిని మన వైపు తిప్పుకోగలగడం గొప్పవిషయం. అందు లోనూ సామాన్యమైన శత్రువు కాదు కదా. ఇది నిజంగా ఘన విజయమమ్మా. నువ్వు విజయ దుర్గవేనమ్మా. సుబ్రహ్మణ్యంగారూ... ఇక మీరు కూడా దుర్గ నుంచి నేర్చుకోవలసింది ఎంతో ఉంటుంది అని గుర్తుపెట్టుకోండి సుమా''

''మంచి అన్నది నేర్చుకోవడానికి నేను ఎప్పుడూ సిద్ధమేనండి. దుర్గగారు మనకితో






డుగా ఉంటే అన్నానిందాకా. దుర్గగారికే మనం తోడుంటే అని దిద్దుకోవాలి'' అన్నాడు సుబ్రహ్మణ్యం.

అంతలో సురేష్ అటు వచ్చాడు.

సుబ్రహ్మణ్యం కొద్దిక్షణాలు తటపటాయించి ముందుకు వచ్చి చేయిచాపాడు.

''నాపేరు సుబ్రహ్మణ్యం. నాగురించి మీకు తెలిసే ఉంటుంది''

''తెలుసు'' అంటూనే చేయందుకున్నాడు సురేశ్.

''నాకు కాదండీ... ఈ దుర్గకే మీరు కృతజ్ఞతలు చెప్పుకోవలసింది. ఈమే నాచేత ఈ పనులు చేయించింది'' అన్నాడు సురేశ్.

''దుర్గ ఇప్పుడే మాకు మంచివార్త చెప్పింది. సురేశ్- నీకు నా ఆశీర్వాదాలు'' అన్నారు మాష్టారు.

మాష్టారు మళ్లీ అన్నారు, ''ఇదుగో దుర్గా, నేను ఈ ఊరు నుంచి వెళ్లేముందు మీ ఇద్దరి రూపంలో రెండు దీపాలు వెలిగించాననీ, ఇక అన్యాయపు చీకట్లు తొలగక తప్పదనీ ఆశతో వెళ్లాను. కాని కొన్నాళ్లకు మీ నుంచి ఏ కబురూ రాక, ఇక్కడికి వచ్చి పరిస్థితి చూసి నిరాశలో మునిగిపోయాను. కాని నువ్వు త్వరలోనే తిరిగి నాలో ఆశ నింపావు. ఇప్పుడు సురేశ్ కూడా మీతో చేరాడు. మీరు ముగ్గురూ ఉండగా భవిష్యత్ ఉజ్వలంగానే తోస్తోంది నాకు. ఎదర అంతా సాఫీగా ఉంటుందని చెప్పడం లేదు. ఆటుపోట్లు ఉండవచ్చు. జయాపజయాలు కలగవచ్చు. కాని కృషి మాత్రం ఆగదనే నమ్మకం కలిగింది నాకిప్పుడు. ఆ ఆశతోనే నేను రేపు మా ఊరు వెళ్తున్నానమ్మా''

సురేష్ అన్నాడు ''మాష్టారూ... మిమ్మల్ని తిరిగి ఈ ఊరు రప్పించడం నాకొక ముఖ్యమైన బాధ్యత అనీ, అది నెరవేర్చగలననీ అనుకుంటున్నాను. ఇది నా ప్రాయశ్చిత్తంలో భాగమే మాష్టారూ''

''మంచిది నాయనా, ఉపకారం చేస్తానంటే వద్దని ఎలా అనగలను? కాని నా కారణంగా మరొకరికి కష్టం కలగకూడదని మాత్రమే నేను కోరుకునేది'' అన్నారు శేఖరం మాష్టారు.

''అది దృష్టిలోనే పెట్టుకుంటాను మాష్టారూ'' అన్నాడు సురేశ్.






## రచయిత్రుల సంఘం

రచయిత్రులను ప్రోత్సహించాలని, వారి కాల్పనికశక్తిని పెంపొందించాలని, వారి రచనలు ముద్రించాలని, వారిలో నిద్రాణమై ఉన్న



రచనాసక్తిని, రచనాశక్తిని జాగృతంచేయాలని భావించి 1925 నం॥ సెప్టెంబరు నెలలో ఆస్ట్రేలియాలో ఓ సొసైటీ ఏర్పడింది. గత అరవై సంవత్సరాలనుంచి ఈ సొసైటీ ఎంతో అభివృద్ధి చెందింది. దీనికి సంబంధించిన ఆరుశాఖలు ఆస్ట్రేలియాలోని వివిధ రాష్ట్రాలలో ప్రారంభించబడ్డాయి. సొసైటీలోని సభ్యులంతా నెలకోసారి తప్పనిసరిగా సమావేశమౌతారు. ప్రముఖ రచయితలు, రచయిత్రులు కూడా అప్పుడప్పుడు ఈ సమావేశాలకు అధ్యక్షత వహిస్తుంటారు.

ప్రతి సంవత్సరం ఉత్తమ రచయిత్రిగా ఎన్నికైనవారికి 'ఆలీస్' అవార్డును ఇస్తారు. అత్యంత ప్రతిష్ఠాకరమైన ఈ అవార్డును 'ఆలీస్' అనే స్కూలు టీచరు ప్రారంభించారు.

రేడియోలకు, టి.వి.లకు కావల్సిన స్క్రిప్టులు తయారుచేయటానికి, ఉపన్యాసాలు ఇవ్వటానికి కావల్సిన మెళకువలు ఈ సమావేశాల్లో చెబుతారు. కాపీరైటు నిబంధనలు, ప్రభుత్వ




చట్టాలు, స్కాలర్షిప్పులు, ఫెలోషిప్పులు వాటికి సంబంధించిన వివరాలు తెలియచేస్తారు. వివిధ ప్రాంతాల్లోని పబ్లిషర్ల జాబితాలు ఇచ్చి ఎవరెలాంటి పుస్తకాలు ముద్రిస్తారోననే విష యాలన్నీ కూలంకషంగా తెలియచేస్తారు.

ఈ సమావేశాల్లో వర్ధమాన రచయిత్రులను ప్రోత్సహించే ఉద్దేశంతో వారి రచనలను చది వించి, వారి రచనలలోని లోపాలను తెలియ చేసి సరిచేసి తిరిగిరాయిస్తారు. ఆ సంద ర్భంలో జార్జిబెర్నార్డ్షా వంటి మహామేధావుల రచనలే తొలిదశలో సంపాదకులచే తిరస్కరింపబడినాయని, తిరిగితిరిగి ప్రయత్నించి తన లోపాలను సవరించుకొని ఆయన మహాక విగా కీర్తిపొందాడని, కనుక తొలిదశలో మీ రచనలు తిరిగివస్తే కుంగిపోవద్దని ఉత్సాహప రుస్తుంటారు సొసైటీవారు.

అందుకోసమే 18 ఏళ్ళలోపు యువతులకు సంవత్సరానికొకసారి వారి రచనలలో పోటీలు నిర్వహించి కొన్ని ప్రత్యేక అవార్డులను ఇస్తుంటారు. అంతేగాక కవితా పాఠశాలలు, ప్రదర్శనశాలలు ప్రముఖ రచయిత్రుల ఆధ్వ ర్యంలో నిర్వహించి గేయాలు, కథలు, నాటికల వంటి వివిధ ప్రక్రియలలోని లోతుపాతులు, మెలకువలు తెలియచెబుతుంటారు.

ఏ రచయిత్రి అయినా తొలిదశలో కొన్ని ప్రాథమిక సూత్రాలు తెల్సుకోవాలి. ఆ సూత్రా లన్నీ కవితాపాఠశాలల ద్వారా తెలుసుకోడానికి వీలవుతుంది. అయితే ఈ సమావేశాలన్నింటి కీ గ్రామీణ ప్రాంత రచయిత్రులు హాజరుకాలే కపోవచ్చు. అందుకోసమై వారికి ఈ కార్యక్రమా లకు సంబంధించిన టేపులు, వీడియో కేసె ట్లు పంపి వారికి విషయాలు తెలియచేస్తారు. ఈ బాధ్యత సొసైటీ ఉపాధ్యక్షురాలిదే. ఒక్కో సంవత్సరం ఒక్కో గ్రామంలో వార్షిక సమావేశా లు ఏర్పాటుచేయటంవల్ల గ్రామీణ రచయి త్రులు అందరూ చురుకుగా వీటిలో పాల్గొనే అవకాశం ఉంటుందని సొసైటీవారి అభి ప్రాయం.

అంతేగాక ప్రతి సంవత్సరం కొందరు ఔత్సాహిక రచయిత్రులు, సభ్యురాండ్ర రచన లు ముద్రించి వారిని ప్రోత్సహిస్తున్నారు సొసై టీవారు.

ఈ సొసైటీ చేపట్టిన కార్యక్రమాల్ని ప్రతి స్త్రీ వయోభేదం లేక వృత్తిభేదంలేక అభినంది స్తోంది.

రచయితలు పుడతారుగాని తయారుచే యబడరు అనే లోకోక్తి తప్పని ఇప్పటికే ఎంతో మంది రచయిత్రులను తయారుచేసిన ఈ సొసైటీ నిరూపిస్తోంది.

## మూకుమ్మడి సహగమనం

సహగమనం అనేమాటకి అర్థం "కలసి వెళ్లడం". భార్యాభర్తలు జీవితాంతం కలసిక ట్టుగా నడవాలన్న ప్రబోధం తప్పితే భర్త చనిపోయాక కూడా కలిసే వెళ్లాలి అనే సిద్ధాంతం సహగమనమనే మాటలోలేదు. కానీ ఇపుడు దానికి పెడర్థమే తప్పదుమరి.

లియొనార్డ్ ఊలీ అనే బ్రిటిష్ చరిత్రకారు డు మూకుమ్మడిగా జరిగిన సహగమనాల్ని వెలికితీశాడు. అయిదువేల సంవత్సరాలనాటి ఇరాని రాజు అబార్గీ, తన రాణి షుబ్అబాద్ సమాధుల్ని వెలికితీసే ప్రయత్నంలో ఇంకా ఇరవై పైచిలుకు సమాధులు బయటపడ్డాయి. వాళ్లు ధరించిన దుస్తుల శిథిలాలనుబట్టి రాజుగారి దర్బారు ప్రముఖులనే నిర్ణయం జరిగింది. ఇక రాణిగారి పక్కనున్న సమాధుల్లో చెలికత్తెలు లేకపోలేదు.

అదే ప్రాంతంలో చేదకులతోసహా గుర్రపు బళ్లూ, గాడిదల బళ్లూ సమాధుల్లో ఉండటం మరో విశేషం. బంగారు, వెండి నగలు రాణిగా రికే పరిమితంకాదు. సితార వాయిస్తున్నవాళ్లు అలాగే సమాధిలో అన్ని ఆభరణాలతో ఉన్నా రు. మొగల్‌రాజు మరణానంతరం దర్బారు లోని మందీమార్బలానికి కూడా సహగమనం ఉండేదని ఊలీ కథనం. మూకుమ్మడి సహగ మనాలను నమోదుచేసిన మరొక చరిత్రకారు డు ఆర్తమెనోయ్.

రష్యా, మధ్యఆసియాలోని ఒకప్పటి సితి యన్‌జాతుల్లోనూ ఇలాంటి దర్బారు సహగమ నాలు ఉన్నాయట. పైలోకమే సత్యమనీ, సర్వం ఆ లోకంలోనే దొరుకుతుందనే నమ్మ కంతో నగలేకాదు – నచ్చిన, మెచ్చిన మనుమ

లని సైతం చనిపోయిన రాజుతో సమాధి చేయించుకోవడం ఈ జాతికి ఆచారం.

సితియన్ రాజుల కర్మకాండలగురించి గ్రీకు చరిత్రకారుడు హెరిడోటస్ విపులంగా రాశాడు. రాజుపార్థివ దేహాన్ని కొన్ని పూతలతో చెడకుండా భద్రపరచి దేశంలో 40 రోజులపాటు ఊరేగిస్తారు. ఊరేగింపు సమయంలో భూతపిశాచాలని దూరంగా ఉంచేందుకు కేకలు వేస్తూ గంటలు వాయిస్తారు. ఈ లోపల రాజుగారి సమాధి తవ్వకం పూర్తయ్యేది. కత్తికటారులతోసహా సర్వాంగసుందరంగా అలంకరింపబడ్డ దేహం రథంలో ఉంచి – బతికున్న గుర్రాలతోసహా సమాధిలో దించేస్తారు. ఇక రాణులు, ఆమె పరివారంతోసహా ఆ గోతిలోకే. ఆ తర్వాత ఎలాగూ సమాధిపూడుస్తారు.

రాజుగారి ప్రథమ వర్ధంతికి దేశవ్యాప్తంగా జరిగే ఉత్సవంలో కనీసం యాభైమందైనా యోధులు తమ గుర్రాలతోసహా సజీవసమాధికి ముందుకి వస్తారు.

భర్తవైపు బంధువులు ఆస్తిపాస్తులు చేజిక్కించుకోవాలనే స్వార్థబుద్ధితో భార్యను బలవంతంగా చితిమంటల్లోకి తోసిన ఉదంతాలు చరిత్రలో కోకొల్లలుగా కనిపిస్తాయి. ఇటీవలే జరిగిన రూప్‌కన్వర్ సంగతి మనకందరికీ తెలిసిందే!




## బార్లలో నీరు కస్టమర్లజోరు

కాలిఫోర్నియాలోని బివెర్లీ హిల్స్ 'ఇక్-సీస్' బార్లోవైన్, బీర్ కంటె నీళ్లకు గిరాకీ హెచ్చింది. అక్కడ చాలామంది బార్లో కూర్చుని లొట్టలువేస్తూ మరీ నీళ్లగ్లాసుల్ని ఖాళీచేస్తున్నారు. అయితే అది మామూలు నీళ్లుకాదు. ఖనిజజలం. భూగర్భంలోని రాతిపొరలలో లభ్యమయ్యే అరుదైన జలం.

“రుచి, వాసనలతోపాటు కావల్సినంత కిక్ ఇచ్చే ఈ నీటికోసం జపాన్‌నుంచి వచ్చే వ్యాపారులు కూడా తెగఎగబడుతున్నారు” అని ఈ బార్‌మేనేజరు ఆగస్టు స్యుయల్ ఫ్లో అంటున్నాడు.

“షాపింగ్ చేసే కస్టమర్స్‌కి ఇక్కడి చాలా దుకాణాలలో కాఫీలు, డ్రింకులు అందిస్తుంటారు. కాని మేం ఈ ఆనవాయితీని తలకిందులు చేశాం. మాకు ప్రత్యేకంగా ఎందరో కస్టమర్లున్నారు. వారు కోరినంత నీళ్లని మేం అందించ

గలిగితే మా జన్మధన్యమైనట్లే! అందుకని మేమిగిలిన స్టోర్లలో మా 'వాటర్‌డ్రింక్'ని ఫ్రీగా ఇవ్వడంజరగదు'' అని దృఢంగా తన అభిప్రాయం వెలిబుచ్చుతున్నాడు న్యూయల్ ఫ్లో.

మిగిలిన వైన్స్‌లాగే ఈ ఖనిజ జలానికి ప్రత్యేకత, ప్రిస్టేజిఉంది. రాతిపొరలనుంచి ఈ జలాన్ని తీసి వడగట్టడానికి ఎంతోశ్రమ, నమయం వెచ్చించాల్సుంటుంది.

''చాలామంది ఇది కేవలం నీరేకదా అని కొట్టిపారేస్తారు. అయితే మామూలు నీటికి ఈ జలానికి గల భేదాన్ని వాళ్లు గ్రహించలేరు''

యడం జరుగుతోంది.

వర్జీనియాలోని ఇంటర్నేషనల్ బోటిల్‌వాటర్ అసోసియేషన్ అంచనాలప్రకారం గత నంవత్సరం అమెరికాలో 1.2 బిలియన్లగేలన్ల ఖనిజజలం వినియోగించినట్లు తెలుస్తోంది. అంటే అంతకుముందు నంవత్సరం కంటే 15 శాతం ఎక్కువ అన్నమాట.

దక్షిణకాలిఫోర్నియాలో వాటర్ మార్కెట్ విపరీతంగా ఉన్నప్పటికీ వాషింగ్టన్ తదితర నగరాల్లో ఈ 'నీటిబార్లు' వృద్ధిచెందలేదు; విజయవంతంకాలేదు.




అంటాడు ఈ నీటి చరిత్ర క్షుణ్ణంగా తెల్సిన 21 ఏళ్ల ఆర్ట్‌ఫిలచెర్ట్.

'లాస్‌ఏంజిల్స్ టైమ్స్' ఆధ్వర్యంలో విదేశాలనుంచి, స్వదేశంలోని అనేకచోట్లనుంచి తెప్పించిన ఖనిజజలాన్ని 1979లో పరిశీలించగా దాదాపు అన్నీ ఒకలాగే ఉన్నట్లు తోచింది. వీటన్నింటిని ఒకే ఉష్ణోగ్రతలో పరీక్షించి శీతలపరిచి రుచినికూడా క్రమబద్ధంచేశారు.

ఈ నీరు అనేకరూపాలలోనున్న సీసాలలో లభ్యపడుతోంది. సీసాలు, వాటిపై లేబిల్స్ కూడా కస్టమర్స్‌ని బాగా ఆకట్టుకొంటున్నాయి. రుచిని, మనిషి ఆరోగ్యాన్ని దృష్టిలోఉంచుకొని ఈ జలాన్ని భద్రపరచడం, ఎగుమతిచే

## ప్రకృతి ప్రతీకారం

ప్రకృతి పరిసరాలలో కలిగే దుష్పరిణామాలను లెక్కించకుండా అభివృద్ధి కార్యక్రమాలను చేపట్టినప్పుడు మానవునికి కలిగే హాని ఊహాతీతంగా ఉంటుంది. పంచమహా సరోవరాలుగా ప్రఖ్యాతిపొందిన సుపీరియర్, మిచిగన్, హూరన్, ఈరి, అంటేరియా సరస్సులు అమెరికా, కెనడా సరిహద్దుల్లో వున్నాయి. పరస్పరం కలుసుకొనే వీటి తీపి నీరు నయాగరా




వద్ద జలపాతంగా దుమికి సెయింట్ లారెన్స్ నది ద్వారా ప్రవహించి అట్లాంటిక్ సముద్రంలో కలుస్తుంది. నయాగరా జలపాతం దగ్గరనుండి అట్లాంటిక్ సముద్రం వరకున్న సెయింట్ లారెన్స్ నది నౌకాయానానికి అనుకూలంగా వుంటుంది. సుపీరియర్ సరోవరం చుట్టుపక్కల ఇనుపఖనిజ నిక్షేపాలున్నాయి. అందుచేత నౌకలు అట్లాంటిక్ నుండి నేరుగా ఇక్కడకు రాగలిగితే ప్రపంచ మార్కెట్‌కు తలుపులు తెరిచినట్లే అని భావించారు.

ఇంజనీర్లు రంగంలోకి దిగారు. నయాగరా జలపాతాన్ని చుట్టుకుంటూ ఈరి సరోవరం నుండి అంటేరియా సరోవరం వరకు బ్రహ్మాండమైన కాలువను తవ్వారు. సరోవరాల వివిధ నీటి మట్టాల వ్యత్యాసాలవల్ల నౌకల ప్రయాణం కష్టం అవుతుంది. ఈ కష్ట నివారణకోసం అమోఘమైన సాంకేతిక పరిజ్ఞానంతో లాకులు నిర్మించారు. వీటి నిర్మాణం వల్ల అన్ని సరోవరాల్లోని నీరు సమంగా వుండి నౌకలు నడవటం సులభమైంది. ఈ కాలువకు నాటి న్యూయార్క్ గవర్నర్ వెలాండ్ పేరు పెట్టబడింది. నౌకలు అట్లాంటిక్ సముద్రంనుండి సునాయాసంగా సరోవరాలవరకు పయనించటం ప్రారంభమైంది. మానవుడు ప్రకృతి విరుద్ధమైన నౌకాయానాన్ని సిద్ధం చేశాడు.

పదిసంవత్సరాల తర్వాత ఇప్పుడు ప్రకృతి ప్రతీకారం ఎలా తీర్చుకుంటోందో తెలియవచ్చింది. రాను రాను ఆ మహాసరస్సులలోని కార్ప్ మొదలైన ఖాద్యచేపల సంతతి తరిగిపోతూ వచ్చింది. ఇందుకు కారణంకూడా తెలిసింది. సముద్రాల్లో 40-60 సెంటీమీటర్ల పొడవుండే ల్యాంప్రి అనే పాము జాతిచేపలు నివసిస్తుంటాయి. ఇవి ఇతర సముద్ర జీవుల రక్తాన్ని పీల్చుకొని జీవిస్తుంటాయి. ఈ ల్యాంప్రి చేపలు సరోవరాలకు వలస వచ్చేశాయి. ఇంతకు ముందు వీటి వలసను నయాగరా జలపాతం అడ్డుకొనేది. ఇప్పుడు కాలువవుంది గనక నౌకలతోపాటు ల్యాంప్రి చేపలుకూడా సునాయాసంగా పయనించాయి.

ల్యాంప్రి చేపలు సముద్రపు ఉప్పునీటి పరిసరం నుండి సరోవరాల తీపినీటి పరిసరాలకు అలవాటుపడిన తర్వాత అవి అపారంగా తమ సంతతిని వృద్ధి చేసుకుంటున్నాయి. ఈ ల్యాంప్రి సంతతి మామూలు ఖాద్య చేపల సంతతి రక్తాన్నితాగి నశింపచేస్తుంది. నౌకాయానానికి కలిగిన అనుకూలత మత్స్యపరిశ్రమకు అపరిమితమైన అననుకూలతగా పరిణమించి అపారమైననష్టం సంభవిస్తోంది. ఈ విధంగా ప్రకృతి పగ తీర్చుకుంటోందనిపిస్తూ వుంది.




మీ సస్యాలకు రక్షణ... అన్నదాత

మీ పశుపోషణలో శ్రీరామరక్ష... అన్నదాత

మీ ఆర్థిక స్థోమతకు పునాది... అన్నదాత

మీ పంటలకు జవం జీవం... అన్నదాత

చీడపీడలపై బ్రహ్మాస్త్రం... అన్నదాత

రైతులకు, సంస్థలకు వారధి... అన్నదాత

---

## బోనస్ బుక్

నెలనెలా ఇచ్చే వార్తలు, వ్యాసాలు, వివరాలు సలహాలేకాక, వ్యవసాయ రంగానికి, దాని అనుబంధ రంగాలకి చెందిన ముఖ్యమైన ఒక్కో అంశాన్ని కూలంకషంగా చర్చిస్తూ పూర్తి వివరాలతో, ఫోటోలతో కూడిన సప్లిమెంట్‌ను ఒక క్రమపద్ధతిలో ఇచ్చే 'బోనస్‌బుక్' 'అన్నదాత' పాఠకులకొక అమూల్యమైన కానుక.

**నెలనెలా అన్నదాత చదవండి!**

**మీ పురోభివృద్ధికి మీరే మార్గంవేసుకోండి!!**



# చతుర సమీక్ష



ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

## నవంబర్ 'చతుర' నవల: అన్యాయం

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా : ..............................

..............................

..............................

..............................




## అన్నీ ఉన్నా...

**నే**ను ట్రాన్స్‌ఫర్ మీద మద్రాసుకు వచ్చి అప్పటికి పదిహేనురోజులవుతోంది. వచ్చిన దగ్గరనుంచి అద్దెకొంపకోసం తెగగాలిస్తున్నాను. కానీ ఎక్కడా దొరికి చావడంలేదు. అప్పటికీ ఆఫీసులో అందరికీ చెప్పాను. పాపం వాళ్ళూ ప్రయత్నిస్తూనే ఉన్నారు.

హైదరాబాద్‌లో ఉన్నప్పుడు నాకు ఈ బాధ లేదు. నగరం నడిబొడ్డున సొంతకొంపే ఉంది. నేనే నలుగురికి వాటాలు అద్దెకు ఇచ్చేవాడిని.

ఏ ఉద్యోగినీ ఎక్కువకాలం ఒకేచోట ఉంచకూడదని ప్రభుత్వం రూల్స్‌లో అఘోరిస్తుండటంవల్ల కేంద్రప్రభుత్వ ఉద్యోగినైన నన్ను మద్రాసుకు విసిరేసి చేతులు దులుపుకున్నారు మా ఆఫీసువాళ్ళు.

ఎన్నిరకాలుగా ప్రయత్నించినా ఆ ట్రాన్స్‌ఫర్ ఆర్డర్స్ రద్దుకాకపోవడంతో చేసేదేమీలేక పెట్టేబేడా సర్దుకుని మద్రాసుకు చేరుకున్నాను. మా ఆఫీసు గెస్ట్‌హౌస్‌లో తాత్కాలికంగా బసపెట్టాను. నాలుగైదు రోజులలో ఏదో ఒక ఇల్లు చూసుకుని అందులోంచి బయటపడాలి. లేకపోతే బావుండదు.

ఇప్పటికే మా ఆవిడ తెగ ఉత్తరాలు రాస్తోంది. ఇక్కడ ఈ ఇద్దరు గడుగ్గాయిల్నీ (అంటే మా పిల్లలు లెండి) నాపాల పడేసి మీరు హాయిగా అక్కడకు వెళ్ళి కూర్చున్నారు. వీళ్ళు చేసే అల్లరిని భరించడం నావల్లకాదు. అర్జంటుగా ఇల్లు చూస్తారా లేదా చెప్పండి. లేకపోతే వీళ్ళను వదిలేసి నేనూ ఎంచక్కా మా పుట్టింటికి పోతాను అంటూనే బెదిరింపు కూడా ఉంది ఆ ఉత్తరాల్లో.

పైగా మా ఆవిడ వట్టి అనుమానపు పక్షి. తన పరోక్షంలో నేనేదన్నా 'రాచకార్యాలు' వెలగబెడతానేమోనని విపరీతమైన సందేహం. అందుకే ఈ ఉత్తరాల పరంపర.

ఇంటికోసం నేను పడేపతిప్పలు మా ఆవిడకేం తెలుసు చెప్పండి?

వచ్చిన చిక్కల్లా ఏమిటంటే నాకు తమిళంరాదు. అయినా 30 రోజులలో తమిళభాష పుస్తకం ప్రభావం వల్ల ఎలాగోలా మేనేజ్‌చేస్తున్నాను.

ఒకళ్ళమీద ఆధారపడితే ఇక లాభంలేదనుకుని నా మిడిమిడి భాషా జ్ఞానంతోనే ఇల్లుకోసం ట్రైచేయాలని నిర్ణయించుకున్నాను.

టి.నగర్‌లో అయితే మన తెలుగువాళ్ళు ఎక్కువమంది ఉంటారని ఎవరో చెప్పగా విని బస్‌ఎక్కి టి.నగర్ స్టేజ్‌లో దిగాను.

తీరా దిగిన తర్వాత ముందు ఎటుపోవాలో తోచలేదు నాకు.

అటూ ఇటూ దిక్కులు చూస్తున్న నాకు అల్లంత దూరంలో ఒక పాన్‌షాప్ కనిపించింది. ఒకసిగరెట్ పాకెట్ కొని- ''ఇక్కడ వీడు కడుగుతుందా?'' తెలుగు, తమిళం మిక్స్‌చేసి చాలా కాజువల్‌గా అడిగాను.

పాపం ఆ షాపువాడికి నా కవి హృదయం



అర్థంకాలేదనుకుంటాను.

అందుకే మొహం చిట్లించి "ఎన్నా?" అన్నాడు.

నేను చదివిన పుస్తకంలోని తమిళ పదాలన్నింటినీ ఒకసారి గుర్తుచేసుకుంటూ అతనికి అర్థమయ్యే విధంగా చెప్పడానికి ప్రయత్నించాను.

నా భాషా పరిజ్ఞానాన్ని అతను భరించలేక ఒకవేపు చూపించి- "అంగేపోయి విశారయింగు" అన్నాడు. అనడమేకాదు జాలితోకూడిన ఒక ఎక్స్‌ప్రెషన్ కూడా ఇచ్చాడు.

అదేమీ నేను పట్టించుకోకుండా అతనికి కృతజ్ఞతలు చెప్పుకుని అక్కడినుంచి కదలబోతుండగా వెనుకనుంచి "సామి ఇక్కడ ఇల్లు ఉంటాది" అని ఎవరో అనడం వినిపించింది.

గిరుక్కున వెనక్కి తిరిగాను ఎదురుగా పళ్లు ఇకిలిస్తూ ఒక వ్యక్తికనిపించాడు. అతని కట్టుబొట్టు చూస్తేనే తమిళుడని అర్థమయిపోతుంది.

ఇందాకటినుంచి గమనించలేదు కానీ ఆవ్యక్తి ఆ కొట్టుదగ్గరే ఉన్నాడు. మా సంభాషణ ఆలకించినట్టున్నాడు కాబోలు. అందుకే నన్ను పలకరించాడు.

ఇల్లు ఉందని అతను చెప్పగానే నాకు వెదకబోయిన తీగ కాలికి తగిలినట్లయింది. మొహాన నవ్వు పులుముకుని అతని దగ్గరకు వెళ్ళి ఇంటి వివరాలు అడిగాను.

ఇల్లు దగ్గరలోనే ఉందనీ అద్దె 5 వందలని చెప్పి "బెడ్‌రూమ్‌లో ఒకటేప్, బాత్‌రూమ్‌లో ఒకటేప్, కక్కూస్‌లో ఒకటేప్ ఉండాది. అన్నిదా బావుంటది" అన్నాడతను.

"ఇంటిగురించి చెబుతూ మధ్యలో టేపుల గురించి చెబుతాడేంఖర్మ అనుకుంటూ ఎన్నా టేప్?" అన్నాను అయోమయంగా చూస్తూ.

అతను ముసిముసి నవ్వులు నవ్వుతూ "టేప్ కాదు సామి...వాటర్‌టేప్" అన్నాడు వత్తి పలుకుతూ.

"అయితే నీళ్లకరువు ఏమాత్రం లేదన్న మాట" అన్నాను హైదరాబాద్‌లోని నీటిఎద్దడిని గుర్తుకు తెచ్చుకుంటూ.

"ఆమ సార్" అన్నాడతను వినయంగా

"అయితే ఆలస్యం ఎందుకు? వెళ్లి ఆ ఇల్లు చూద్దాంపద" అన్నాను అడుగులు ముందుకు వెయ్యబోతూ.

"కానీ ఒరు విషయంసామి ఓవర్‌హెడ్ టాంక్ పనిసేసిలేదు" అన్నాడతను చావుకబురు చల్లగా చెబుతూ.

—వినాయకరావు

# పాపం కరెంట్

"ఈటి.విలు, రేడియోలు, మైకులు కనిపెట్టిన వాళ్లెవరోగానీ, ఒక్కడన్నా చేతికి దొరికితే బావుండు-ముక్కు పచ్చడయ్యేలా కొడ్తాను. అయ్యో! నాలాంటి విద్యార్థులుంటారేమో! వాళ్ళకి పరీక్షలనేవి ఉండి ఛస్తాయేమోనన్న ఇంగితం వాళ్లకు లేకున్నా కనీసం ఈ వాడుకునే వాళ్ళక్కూడా ఉండి చావదు. పగలు, రాత్రి భేదం లేకుండా మైకుల్లో సిన్మా పాటలు మ్రోగిస్తుంటారు! హైవాల్యూమ్‌లో టి.విలు, రేడియోలు చెవులు చిల్లులు పడేలా పెడుతుంటారు. ఎట్లా చదువుకొని చచ్చేట్లు?" అని మనస్సులోనే తిట్టుకొన్నాడు నారాయణ.

నారాయణ బ్యాంకు పరీక్ష ప్యాసయి క్లర్కుగా ఓ బ్యాంకులో చేరాడు-హైద్రాబాద్‌లో

పల్లెటూరువాతావరణంలో ప్రశాంత జీవితం, విశాలమైన ఇళ్ళలో గడిపిన నారాయణకు ఈ మహానగరవానం, ముఖ్యంగా ఎలుక కలుగుల్లాంటి ఇళ్ళల్లో మనుమలు అద్దె కుండటం చూసి ఎక్కడలేని చిరాకు, ఛీదర పుట్టించసాగాయి. అంతేగాక అడపాదడపా రోడ్ల మధ్య నల్ల జెండాలు పాతి, మైకులు పెట్టి సిన్మా పాటలు వేయటం, చీటికి మాటికి షాపులు మూసేయటం మరీ ఇబ్బందిగా మారింది నారాయణకు.

తను సి.ఎ.ఐ.ఐ.బి ఫైనల్ పరీక్షకు కట్టాడు. అది ప్యాసయితే రెండు ఇంక్రిమెంట్లు రావటమేగాక, త్వరలో ఆఫీసరుగా ప్రమోషన్ కూడా వస్తుంది. కాని ఈమధ్య పెరిగిపోయిన టి.విలు, రేడియోలు నారాయణ దీక్షను ఊహించని ఇబ్బందులకు గురిచేస్తున్నాయి.

చదువుకు డిస్టర్బెన్సు మరీ ఎక్కువకావడంతో బయటికి వచ్చాడు.

పాన్ షాపు దగ్గరకెళ్ళి- "ఈ మైకుల హొరు ఏమిటిలా?" అని అడిగాడు సిగరెట్ తీసుకొంటూ.

"మూసాపేట కౌన్సిలర్ గార్కి ప్రజాసన్మానం" అని చెప్పాడా షాపువాడు.

ఉసూరు మనుకుంటూ సిగరెట్టు వెల్గించుకొని ఇంటి ముఖం పట్టాడు నారాయణ. ఇంట్లోకి అడుగు పెట్టుండగానే కరెంటు పోయింది.

"ఛ...ఛ! నేను అప్పుడు ఉన్నది పల్లటూర్లోనైనా కరెంటు అరుదుగానే పోతుండేది. ఇప్పుడు ఈ హైద్రాబాదులో కరెంటు ఎప్పుడు పోతుందో, ఎప్పుడొస్తుందో తెలీటంలేదు" అని



మనస్సులో అనుకుంటూ చిమ్నీ వెతికి దీపం వెలిగించి పుస్తకం ముందు కూర్చున్నాడు నారాయణ. ఆ రాత్రంతా కరెంటు రాకపోయినా నారాయణ చదువు మాత్రం నిరాఘాటంగా సాగింది.

మర్నాడు కూడా నారాయణ ఆఫీసు నుంచి ఇంటికొచ్చేసరికి కరెంటుపోయింది. నారాయణ ముందు రాత్రి అనుభవం గుర్తుంచుకొని, బట్టలు మార్చుకొని చిమ్నీ వెలిగించి చదువు ఆరంభించాడు.

ఇరుగు పొరుగు ఆడవాళ్ళు అంతా బయటికొచ్చి- "ఛీపాడు కరెంటు! సరిగ్గా సాయంత్రమే పోవాలా! త్వరగా వస్తుందో రాదో! అసలే 'చిత్రలహరి' కార్యక్రమం ఉంది! అదీ వారానికొకసారి" అని ఓ అంతర్జాతీయ సదస్సు ప్రారంభించారు.

అందులో ఓ ముసలామె నారాయణ రూము దగ్గరికొచ్చి- "చూడు బాబూ! ఇంట్లో మగవాళ్ళు ఎవ్వరూలేరు. కాస్త కరెంటు ఆఫీసుకు పోయి కంప్లయింట్ ఇచ్చి, వీలైతే కరెంటువాణ్ని వెంటతీసుకురాకూడదూ" అంది నారాయణతో.

నారాయణకసలే మొహమాటం. అందులోనూ పెద్దావిడ చెప్పటంతో తప్పనిసరైలేచి, లోపలికెళ్ళి ప్యాంటు, చొక్కా తొడుక్కొని బయటికి వచ్చాడు.

"పాపం మంచికుర్రాడు. చెప్పగానే లేచాడు" అన్నారు మిగతా ఆడవాళ్ళు.

అరగంటలో అద్దె సైకిలు మీద వెళ్ళివచ్చాడు నారాయణ. ఆడవాళ్ళంతా నారాయణ రాకకోసం వేయికళ్ళతో ఎదురుచూస్తున్నారు. వస్తూనే నారాయణని చుట్టు ముట్టేసి-"వెళ్ళిన విషయం ఏమైంది?" అని అడిగారు.

నారాయణ "ప్చ్" అని పెదవి విరిచి- "ఇప్పుడు పోల్ దగ్గర ఫ్యూజ్ పోయిందట. ఇంత రాత్రిపూట ఎవ్వరూ పోల్ ఎక్కరట" అని చెప్పేసి తన రూముకి వెళ్ళిపోయాడు.

"ఔరా!" అనుకుని ఆడవాళ్ళు "ఇది ఎండాకాలం కూడా కాదు ఇప్పుడే పరిస్థితి ఇట్లా ఉంటే ఇక వేసవిరోజుల మాట ఎంగాను? ఇంతింత డబ్బు పోసి కొన్న ఈ టి.విల నేంచేయాలి?" ముక్త కంఠంతో పలికారు నిరసనగా ఈసడిస్తూ. నారాయణ తన చదువులో నిమగ్నమయిపోయాడు. అతను రోజూ ఇంటికొచ్చేటప్పటికి కరెంటు పోవటంమాత్రం నిత్యకృత్యమై పోయింది. అతను బుడ్డిలైటులో చదువుకోవటం గమనించి ఇరుగూపొరుగూ ఎంతో జాలిపడ్డారు. టి.విలు, రేడియోలు బర్రున మ్రోగే రోజుల్లో కూడా కన్పించని నారాయణ ఇప్పుడు వాళ్ళకు కన్పించసాగాడు.

అయితే... తన పరీక్షలయ్యేవరకు ఆ వీధిలోని పది ఇళ్ళకూ సాయంత్రం పూట కరెంటు సప్లయ్ తీసేయమని లైన్‌మైన్‌కు నారాయణ చెప్పిన సంగతినీ పాతిక రూపాయలు ఇచ్చిన వైనమూ మాత్రం ఇరుగుపొరుగు ఎవ్వరికీ తెలీదు.

— గిరిజానారాయణ్

## హరి అంటే...

గుర్నాథం నా ఫ్రెండ్ కావడం నా దురదృష్టం కాదు. వాడు ఎల్.ఐ.సి ఏజంటవటమే నా ఖర్మ! వాడి 'హంటింగ్' పుణ్యమా అని మా ఇంట్లో ఉన్న సభ్యులు అయిదుగురికీ చచ్చినట్లు పాలసీలు తీసుకున్నాం. మా కుటుంబానికి ఆదాయం సంపాదించే ఏకైక పురుషుణ్ణి నేనే కనుక ఖర్చంతా నాదే! గుమస్తాగిరీ వెలగబెడుతూ సంపాదిస్తున్న నాజీతంరాళ్లు ఇంటి అవసరాలకే సరిపోతున్నా అనుకోని ఖర్చు తగిల్తే చాలీచాలని పరిస్థితుల్లో ఈ ఎల్.ఐ.సి పాలసీలు ఒకటికాదు, అయిదు అంటగట్టాడు వాడు ఈ అయిదేళ్లలో. ఒకటా...? రెండా...? అయిదు! నాజీతంలో సగం డబ్బు వాటికే పోతుంది. పోనీ తెగించి సగంలో పాలసీలను విరమించుకుందామంటే కట్టిన డబ్బు తిరిగిఇవ్వరట. అయినాసరే వెధవ డబ్బు పోతేపోయిందిలెమ్మని పాలసీలపీడ వదుల్చుకోనేవాడినే. కానీ గుర్నాథం వదలడే! నెల అయ్యేసరికి కార్పొరేషన్ ద్వారా వాడికి రావలసిన కమీషన్ రాపోతే పులిలా ఇంటికొచ్చిపడతాడు. పాలసీ ప్రీమియం కట్టేవరకూ వదలడుగాక వదలడు. అలాంటి గుర్నాథం అకారణంగా ఈరోజు మాఇంటికి వచ్చేశాడు బాకీలేమీలేకున్నా.

"ఏం గుర్నాథం... పాలసీలన్నీ సక్ర






మంగానే కడుతున్నానే'' అంటూ రసీదులు చూపించబోయాను వాడికి.

''ఛ... అందుక్కాదు నేను వచ్చింది'' అన్నాడతను.

''మా ఇంట్లో పాలసీకి కట్టవలసిన కొత్త మనుమలు కూడా ఎవరూలేరు'' ముందుజాగ్రత్తగా అన్నాను.

''అబ్బబ్బ... నన్నో ఏజెంటుగా మాత్రమే చూడటం ఏమీ బాగాలేదురా. సరదాగా నిన్ను చూడటానికి వచ్చాను అంతే'' తేలికగా అన్నాడు గుర్నాథం.

''నిజంగా అంతేనా?''

''ముమ్మాటికీ''

''అయితే ఫర్వాలేదులే! కాఫీ తాగుతావా?'' అంటూ శ్రీమతి తెచ్చిన కాఫీ అందించాను. తాగుతూ అడిగాడు గుర్నాథం.

''మీ బుజ్జిగాడు ఏడీ? మంచి వాగుడుకాయలే! వెధవ ఎక్కడా కనిపించడేం?''

నాకు మింగుడు పడలేదు. అయ్యవారి దృష్టి వాడిమీద పడిందన్నమాట.

''మీ సంస్థలో పాలసీపొందాలంటే మినిమమ్ పద్దెనిమిది యేళ్లు వుండాలనుకుంటానే'' అనుమానం వ్యక్తంచేశాను.

''అవును... ఏం?'' ప్రశ్నించాడు.

''మా బుజ్జిగాడికి ఆరేళ్లే'' చెప్పేను. గుర్నాథం నర్మగర్భితంగా నవ్వాడు.

''నేనొచ్చింది అందుకుకాదని ముందే చెప్పాను. పిల్లవాడు కదా అని అలా అడిగాను''

''అయితే వుండు పిలుస్తాను అంటూ ''ఒరెయ్ బుజ్జీ— ఇటురా'' అని కేకేశాను.

బుజ్జివచ్చాడు. ''ఓ... హరీ... హరీ... అంకులా?'' అన్నాడు గుర్నాథాన్ని చూసి పలకరింపుగా.

''హరి... హరి... అంకుల్ ఎవరురా?'' అడిగాను నేను.

''అదుగో— ఆయనే డాడీ! మీరోసారి 'హరీ' అనకూడదూ?'' అన్నాడు వాడు.

''హరి ఏమిట్రా?'' తెల్లబోయాను నేను.

''అమ్మయ్య! హరీ అన్నారుగా సరే అంకుల్— ''మీరు యాభైవేలు ఇవ్వండి'' అనడిగాడు గుర్నాథాన్ని.

''ఎందుకివ్వాలి?'' ప్రశ్నించాడు గుర్నాథం.

''మా డాడీ హరీ అంటే మాకు యాభైవేలు వస్తాయని మీరు ఒకసారి అన్నారు— మరచిపోయారా?'' నిలదీశాడు బుజ్జిగాడు. గుర్నాథం ఇబ్బందిగా చూశాడు.

''సారీ... ఏదో వ్యాపారసరళిలో అలా చెప్పకతప్పలేదు''అని చల్లగా జారుకున్నాడు బయటికి.

—కొల్లిమల్ల అప్పారావు





## దొరకునా ఇటువంటి....

ఎప్పుడూ జనంతో కిటకిటలాడే ఆఏరియా కర్ఫ్యూ విధించినట్టు నిర్జనంగా ఉంది.

"పట్టపగలు దొంగతనం ఏమిట్రా పిచ్చిగానీ ఎక్కిందా నీకు?" ఆశ్చర్యంగా అడిగాడు భద్రం.

"మాట్లాడకుండా నావెనుకే రా" అని దర్జాగా దొడ్డిదారిన ఓ ఇంట్లో ప్రవేశించాడు శ్రీను. అనుసరించాడు భద్రం. ముందుగదిలో జనం సందడిగా ఉన్నట్లున్నారు.

డైరెక్ట్‌గా ఐరెన్ సేఫ్ ఉన్నగదిలోకి వెళ్ళారిద్దరూ. హేంగర్‌కి ఉన్న ఫాంట్ జేబు వెతికి, అందులో ఉన్న పర్సు భద్రానికిచ్చేడు శ్రీను. పర్సు నిండా వందనోట్లే!

ఎడం పక్క గదిలో కెళ్ళేరు. డ్రెసింగ్ టేబిల్ తాలూకు సొరుగు తెరిచాడు శ్రీను. అందులో వున్న బంగారపు గొలుసు, కంటె, ఒంకీ- పక్కన ఉన్న పోలథిన్ బాగ్ తీసి అందులో వేసుకున్నాడు.

భద్రానికి యిదంతా భయంగానూ, ఆశ్చర్యంగానూ ఉంది. పగలు దొంగతనాలు వాళ్లిద్దరికీ అలవాటు లేదు. పైగా ఇంటివాళ్ళు ఉండగానే.

"వీడికింత ధైర్యం, తెగింపూ ఎలా వచ్చాయబ్బా" అని ఆలోచించేడు భద్రం. కానీ అంతుపట్టలేదు.

"ఇంకేం పట్టుకెళ్ళొద్దు- సరిపెట్టేద్దాం" అంటూ బైటికి నడిచాడు శ్రీను. తద్దినం పెట్టేవాడి తమ్ముడిలాగ ఆవెనకాలే బైటికొచ్చాడు భద్రం.

ఆఇల్లు వదలి అరమైలు దూరం వెళ్ళాక తన అనుమానాన్ని బయటపెట్టాడు భద్రం.

"ఏంటి గురూ ఇంత ధైర్యం వచ్చేసింది నీకు? ఎవరేనా మనల్ని చూస్తే? పట్టుబడిపోతే....?"

"ఒరేయ్...అమాయక చక్రవర్తి! మనం ఆటైమ్‌లో ఎవరికీ దొరకం. టైం అలాంటిది" అన్నాడు శ్రీను.

ఏమిటని అడిగాడు భద్రం అయోమయంగా!

శ్రీను పెద్దగానవ్వి, కాసేపాగి- "ఇది టి.వి.లో మహాభారతం వచ్చేటైంరా..." అన్నాడు దర్జాగా!

నోరు వెళ్ళబెట్టేడు భద్రం.

—గోపరాజు రాధాకృష్ణ

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482.

# మీ పాపాయికి
# అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి.
పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి
సెరిలాక్ లాభాన్ని అందించండి.

**పోషకాహారం లాభం :** సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు. ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు. విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

**రుచి లాభం :** పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

**సమయం ఆదా లాభం :** సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ, పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

**ఎంపిక లాభం :** ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ, తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ, డబ్బా మీద సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాలు నించి




4 మాసాలు నించి




6 మాసాలు నించి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి. సెరిలాక్
పోస్ట్ బాక్స్. నెం 3
న్యూ ఢిల్లీ 110008




**సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం ఎంతో రుచికరం**

RK SWAMY/FSL/5112/TEL

